శ్రీ

# కోకిల

(అయిదంకముల నాటకము)

ఇది

రాధాకృష్ణ, పాదుకా పట్టాభిషేకము, విప్రనారాయణ

మొదలగు నాటకములు రచించిన

## పానుగంటి లక్ష్మీనరసింహారావుగారిచే

రచియింపఁబడినది.




ప్రకటనకర్త:

## కురుకూరి సుబ్బారావు,

ప్రొప్రయిటరు, సరస్వతీ బుక్ డిపో,

బెజవాడ, కృష్ణాజిల్లా.

రెండవకూర్పు 1000 ప్రతులు.

బెజవాడ ఆంధ్రవాణీ ముద్రాక్షరశాలయందు,

ముద్రింపఁబడియె.

1937



[వెల రు. 1—0—0.

# ప్రకటన.



ఈ కోకిల నాటకపుస్తకము కాపీరైటుయొక్క సమస్త హక్కులు గ్రంథకర్తగారి వలన నేను పొందియున్నాను గావున నావ్రాత మూలకమైన అధికారపత్రమును పొందనిదే అంతయుగాని, కొంతయుగాని ముద్రించుట, భాషాంతరీకరించుట, ప్రదర్శించుట, గ్రామోఫోను రికార్డింగుచేయుట, టాకీ స్క్రీనింగుచేయుట మొదలగుపనులు చేయకూడదు. ఇందులకు అతిక్రమించినవారలు నా నష్టమునకు బాధ్యులగుటయేగాక నేను జరిపే సివిల్ క్రిమినల్ చర్యలకు పాల్పడుదు రని యిందుమూలముగా తెలియజేయడ మైనది.

ఇట్లు,

కాపీరైటు హక్కుదారుడు,

కురుకూరి సుబ్బారావు, ప్రొప్రయిటరు,

సరస్వతీ బుక్ డిపో, బెజవాడ.

ది 1—9—1937.



# పీఠిక.



నే నిదివఱకు నర్మదాపురుకుత్సీయము, సారంగధర చరిత్రము, ప్రచండచాణక్యము, రాధాకృష్ణనాటకము, పట్టభంగరాఘవ మను నైదు నాటకముల వ్రాసియుంటిని. కోకిల యను పేరుగల యీ నాటక మా ఱవది. ప్రస్తుత పీఠికాపుర సంస్థానాధీశ్వరు లగు శ్రీ రాజా రావు వేంకట కుమారమహీపతి సూర్యారావు బహద్దరువారి వివాహమహోత్సవ సందర్భమున 1906 సంవత్సరము మేయి నెలలో నీ నాటకమును వ్రాసితిని. ఈనాటకమును దీనికిఁ బూర్వమందుఁ బ్రచురింపఁబడిన రాధాకృష్ణ నాటకమును గూడ శ్రీ శ్రీ రాజా సూర్యరాయ ప్రభువువారే తమ ధనసహాయముచే దయాపూర్వకముగ నచ్చు వేయించిరి. ఇట్టి మహోప కారకృత్యము లనేకము లొనర్చుచున్న యీ ప్రభువువారి కితోధికసర్వ శ్రేయములు సర్వేశ్వరుఁ డొసంగుఁగాక! దీనికి నాందీప్రస్తావనలను బ్రహ్మశ్రీ కూచి నరసింహముగారు వ్రాసి దయచేసిరి.

పిఠాపురము,
25—9—1909.

పానుగంటి లక్ష్మీనరసింహారావు.



# ఈ నాటకమున వచ్చు పాత్రములు



## పురుషులు.

వసంతుఁడు—కథానాయకుఁడు, శ్రీపుర రాజకుమారుఁడు

మోహనుఁడు—బుద్ధిమతికి ప్రియుఁడు, కోకిలను దొంగిలించినవాడు

విజయసారథి—శ్రీపుర సేనానాయకుఁడు, భ్రమరికను వలచినవాఁడు

జగన్నాథుఁడు—విజయసారథిచెలికాడు

రుద్రదేవవర్మ—విజయపురప్రభువు, కోకిల తండ్రి

కృష్ణశంకరులు—శ్రీపుర బ్రాహ్మణులు

రామచంద్రగోపాలురు—శ్రీపురపౌరులు

☞ కోకిల పురుషవేషముతో శ్రీపురప్రభువుగా వచ్చును.

## స్త్రీలు.

కోకిల—కథానాయిక, వసంతునిభార్య, విజయపుర రాజకుమార్తె

భ్రమరిక—కోకిలదాసి, విజయసారథివలచినది

బుద్ధిమతి—మోహనుని వలచినది

చంద్రిక—వసంతునితల్లి, శ్రీపురపురాణి

వాహిని—వసంతుని స్త్రీరూపము

☞ ఇంకను సేవకులు సువాసినులు మొదలగువారు వత్తురు.

శ్రీ

# కోకిల.

## ప్రథమాంకము.

### నాంది.

శ్రీ రామామణి సీత యక్కునఁ దను ♦ శ్రీఁ జేర్చుచో భక్తిశ
స్త్రారుండై పవనాత్మజుం డడుగు లొ♦త్తం జొచ్చుచో వారలన్
గారుణ్యార్ద్రకటాక్షచంద్రికలఁ దో♦గం జేసె ము న్నెవ్వఁ డా
శ్రీరామప్రభుదృక్ప్రభవ్రభలు వ♦ర్షించున్ సదా మీపయిన్.

(నాంద్యంతమున సూత్రధారుఁడు)

ఓ పరిషన్మహాజనులారా! మీయెదుట నీరాత్రి శ్రీపీఠపుర సంస్థానాధీశ్వరుండును, ఆర్యస్తూయమాన సకలజనమనోహర సుగుణాభిరాముండును, హూణాంధ్రభాషావిశారదుండును, ప్రశస్తకవితారసజ్ఞతాభినవభోజుండును, ప్రఖ్యాతయశోవనలక్ష్మీవిరాజమానస్మేరాననుండు నగు శ్రీరాజా రావు వేంకట కుమార మహీపతి సూర్యారావు బహద్దరువారి వైవాహికోత్సవము లందు నీనాటకం బ్రదర్శింప నాజ్ఞాపింపఁబడితిని. దీని పేరు 'కోకిల.' కవి ప్రసిద్ధ ప్రతిభావంతుఁ డైన 'పానుగంటి లక్ష్మీనరసింహారావు.' ఇది యాతని షష్ఠనాటకము.

గీ॥ గ్రంథకథ యంత కవిమనః♦కల్పితంబు
చిత్రముగఁ జిత్రబంధంబుఁ♦జేయుఁ జుండి!
యూర్ణనాభతంతునిలయ ♦ మొయ్య నొయ్య
మించి మృదుజంతువులను బం♦ధించినట్లు.

గీ॥ సంతసింపుడి సభ్యు లీ ♦ సరసనాటి
క న్గనులఁ జూచి విని మీదు ♦ కర్ణములను
గాయికానందములకు వె♦క్కసము గాని
మానసికసౌఖ్యములకు స♦మ్మోడ్కి గాదు.

(తనలో) సరియే కాని, పురుషపాత్రంబుల నే సిద్ధముచేసి, స్త్రీ పాత్రంబుల సముచితంబుగ నలంకరించి సరిచేసి వేవేగ రమ్మని నటికిం జెప్పి వచ్చితిని. అయలసగమన యింతయాలస్య మేల చేసెనో?

నటి—(ప్రవేశించి) మే మలసగమనల మని కాదా యంటిరి. అందుచే తనే యాలస్యము మా సహజదోషము. క్షమింపుఁడు.

సూ—క్షమించుటకు నిం దేమున్నది?

గీ॥ సమ్రపాక్యంబు లాడు నీ•నాల్క; కాని
సుదతి! బొమముడి కినుకను • జూపుఁజుమ్మి;
గమనములె మందములు గాని • కలికి కలుక
గదురు నెట్టులో వాయువే•గమున వచ్చి.

నటి—పోవుచప్పుడుమాత్ర మట్లుకాదా! ప్రదర్శనమునం దెట్టి లోపము లున్నను నాటికాపాత్రశస్త్రమునకుఁ గొఱంత వచ్చునను భీతితోఁ బాత్రలకు వారివారి పఠనీయ భాగంబులు బోధంబు సేయుచుంటిని. ఇదియే నాయాలస్యమునకు హేతువు.

సూ—మఱి యా యసమయోచితం బగు కుటిల భ్రూకుటి నెట్లు సమర్థింతువు?

నటి—(నవ్వుచు) సమర్థించుటకు మీరు పూర్వపక్షకారులును, నేను సిద్ధాంత వాదినినా? పాత్రలకుఁ గోపచేష్టాద్యభినయవిశేషంబుల నిప్పటివఱకుఁ గఱపి వచ్చితిని గావున దచ్ఛేషంబు లేమైన నిచ్చటఁ గనఁబడెనేమో పోనిండు. ఈపాలయుల్క లీ సభాసదుల యెదుట నెందులకు?

సూ—గీ॥ ఎంత మాయలమారివే • యింతి నీవు
కినుక వోడమిన మోమును • గనుచునుండ
నీరదము లేనిపున్నమ•నిశిని నింగి
భంగిఁ జేసితి చిఱునవ్వు • బఱపి పైని.

ఇఁకఁ బ్రస్తుతాంశమును గూర్చి మాటలాడుదము. స్త్రీపురుష పాత్రంబు లన్నియుఁ బ్రదర్శనోన్ముఖంబులుగ నున్నవా?

నటి—ఆ! స్త్రీపాత్రంబులుఁ బురుషపాత్రంబులుఁ బురుష స్త్రీ పాత్రంబులు స్త్రీపురుషపాత్రంబు లన్నియు సిద్ధముగ నున్నవి. మీయాజ్ఞ కెన్నఁడును విరోధముగా నడచుకొనుదానను గా నని మీకే తెలియునుగదా! కాని, యీరాత్రి గడువిచిత్రమైన రాత్రి! అఁడువానిని మగవానిని జూచెడు రాత్రి!

సూ—ఔ నట్లే చుమా!

ఉ॥ పాటిగఁ జూడ సృష్టి మగ♦వాఁడును స్త్రీ యనునట్టి భేదముల్
బూటక మంతరాత్మ కెటు ♦ పుంస్త్వము స్త్రీత్వము గల్గునంచుఁ జే
చాటుగ బుద్ధిమంతులకుఁ ♦ జాటె తమంబు నడంచుఁగాన నీ
నాటక మాడురాత్రి సుజ♦నప్రకరంబునకుం విచిత్రమే.

నటి—(ముక్కున వ్రేలిడుకొని) అన్నిటికంటె మీపలుకులు విచిత్రములుగ నున్నవి. ఆమూలాగ్రము శుద్ధశృంగార రసవ్యాప్తంబు మునలులకుఁ గూడ మోహ నలయంబు లుదయింపఁజేయు ప్రౌఢ ప్రశ్నోత్తరంబులతో నిండియుండు నీగ్రంథమా వేదాంతబోధకము! పూలదండలమ్ము పుష్పలావికకడనుం జపమాలలు దొరకుట?

సూ—అటుకాదు. కవిముఖోద్దేశము ద్రష్టలకుఁ జదువువారికిఁ గవితానంద మొసంగుటయే యైనను సూక్ష్మబుద్ధిగలవారలు దీనిలోఁ గావలసినన్ని సత్యములు గ్రహింపవచ్చును.

ఆ॥ వె॥ సృష్టియును గవికృతి♦సృష్టియు నొకరీతి
నిందు నందుఁ గూడ ♦ నుందు రుత్త
ములు నను త్తములును; ♦ బుద్ధిమంతుల కర్థ
లందఱును వివేక ♦ మందఁజేయు.

జగన్నాటకాంతర్నాటకము లనఁదగు సత్కవి నాటకములందు యోగ్యపాత్ర లాచరణీయ ధర్మంబులును, గర్హ్యపాత్రలు త్యాజ్యార్థంబుల నుపదేశించును.

నటి—అట్లయిన నీనాటకమునఁ బరస్పర విరుద్ధపాత్రంబు లుండినఁ దెల్పెదరా?

సూ—నటీ! అంతయుఁ బరిశీలించి యిట్లడిగెద వేమి? చూడు! బుద్ధిమతీ మోహనులను.

తే॥ గీ॥ బుద్ధిమతి మోహనునిపైని ♦ మోహముంచి
తనదు పెనిమిటిగాఁ జేసి♦కొనఁగ నుంట
తలిరుటాకుల మవ్వంపు ♦ టలరుఁదీఁగ
వలచి బొమ్మజెముడుమీఁదఁ ♦ బ్రాఁకునట్లు.

ఆహా! బుద్ధిమతివాక్యంబులు గీతావాక్యంబులు గావా? దుష్కామాగ్నితప్తమలీమసమనస్కుండును, సమస్తదోషనిలయుండును నగు మోహానునకు నాపుత్త్రడిబొమ్మకు నెంతతారతమ్యము!

నటి—ఔను. ఈకవికి శుభ మగుఁగాక! జ్ఞానవృక్షంబునకు వేరుఁబుర్వులనియుఁ, బతులకు బంగారుసంకెల లనియు, మేఁకవన్నెపులులనియు మఱియు నిట్టి నిందావాక్యములపాల్సేయఁబడి వర్ణింపఁబడు మా స్త్రీజాతిలోఁ గూడ యోగ్యురాం డ్రున్నట్లు కనఁబఱచినాఁడు. కాని యార్యపుత్త్రా! మీ రన్నట్లీ భగవద్విరచిత విపులప్రపంచ నాటకముండఁగా నల్పజ్ఞులగు మనుష్యులచే రచియింపఁబడిన నాటకంబు లెల్ల శ్లాఘనీయంబు లగును?

సూ—అట్లగు టాశ్చర్యముగాదు.

తే॥ గీ॥ ఒచ్చెమొఱగును లేక పెం ♦ పచ్చుపడఁగ
నజుఁడు నిర్మించినట్టి మ♦నుజుని జూడ
సంతసము లేదు; గాని చూ♦చాయఁజేయఁ
బడిన శిల్పంబునకు నెన్నొ ♦ పనదనములు.

కాన మనుష్యుని బుద్ధికట్టి సమ్మానము గలదు. ప్రియురాలా! ఈశుష్కసంభాషణములతో రాత్రి యంతయుఁ గడుపుచున్నట్లున్నారము. ఇది వసంతర్తువు గాదా? తదాగమంబుఁ గూర్చి నీమధురస్వరంబులతో నించుకపాడు, మది విని నాటికాప్రదర్శన మారంభింతము.

నటి—వసంతాగమము మనోహరంబుగఁ దెల్పఁ గోకిలదక్క మఱి యెవ్వరు శక్తులు?

సూ— సుధామధురస్వనంబుల నీవునుం గోకిలయు నొక్కటియే. కానిమ్ము!

నటి—చిత్తము. (పాడును.)

ద్విపద.

ముత్తుకదుప్పటములు ♦ మూలలడాఁగె;
వెలకసాగిరి జను ♦ లివ్వసనకట్లలను;
జిరుచెమ్మటలు మేను♦చేరి బాధించెఁ;
గరువలి పై నిచ్చ ♦ గలిగె నందఱకు;
గంధంబు, బూలును ♦ గడు నింపులయ్యె;
నందంబుగా మొర♦ క్లాకులు దాల్చెఁ;
బరభృతారవముల ♦ వనములు మాఱు
మొరసెఁ; దావులతోడఁ ♦ బుష్పించె లతలు;
చెంత నెప్పుడు నుండు ♦ చెలువకుఁ బతికి
సంతసం బిడు నీ వ♦సంతాగమంబు;
కాని, యయ్యో! దవ్వ♦గా నుండుసట్టి
వానిని గాంతను ♦ వలవంతఁ బెట్టు.

సూ—ఆహా!

గీ॥ ఇంతి! త్వత్కంఠబద్ధ వ♦సంతరాగ
మసదృశవిపంచివంటి నీ♦రసననుండి
వెలువడి సుధానిభస్వన♦ములను బఱపి
యెట్టి యానంద మొసఁగెనో! ♦ యిపుడు మాకు.

(ఇద్దఱును నిష్క్రమింతురు.)

ఇది ప్రస్తావన.



శ్రీ

# కో కి ల

ప్రదేశము : విజయపురము.

[ ప్రవేశము—కారాగృహస్థుఁ డగు వసంతుఁడు. ]

వసం—గీ॥ మొదట భరియింపరాని యా♦పదలైననఁ
గ్రమముగాఁ గొంత సహ్యత ♦ కానిపించుఁ;
బ్రబలదర్శగాఢాంధకా♦రమునన్నైన
నడుగు వెట్టినకొలఁదిఁ దే♦న్నానునట్లు.

అదిగాక.

గీ॥ రాజపుత్త్రిక, కోకిలా♦రాజవదన
కంటఁ బడునంతకాల మీ ♦ కారబాధ
బంచబంగాళ మగు; నాఁడు♦వారి యోర
చూపులను బోని యిడుమ లె♦చ్చోటఁ గలవు?

(కోకిల ప్రవేశించును.)

కోకిల—(నవ్వుచు) వసంతా! ఏమనుచు టివి? 'ఆఁడువారియోరచూపులను బోని యిడుమ లెచ్చోటఁ గలవు?' అనియా? కాంతావలోకనము లసమానకష్టప్రదములా? ఆసంగతి తెలియక తలచుగ నిక్కడకు వచ్చి నీకు శ్రమ మిచ్చినందులకు క్షమింపుము.

వసం—(నవ్వుచు) ఆహా! కోకిలా! వచ్చితివా? ఈరాత్రి యింత యాలసించితి వేల?

గీ॥ వత్తువో, రావో యని శశ♦వశము నొంది
యటు లిటులు చూచి చిటుకన్న ♦ నదరిపడుచుఁ
బడుచు, లేచుచు, నూఁగాడు ♦ చడలు వోడమి
గడియ లేండ్లుగ నీకయి ♦ కాచియుంటి.

కో—వసంతా! నీవు కాచియుండినప్పుడు నేను రావలసినదా? ఈవ మీాపమున నున్న పుష్పవనమున విహరించుట కిష్టానుసారముగ వచ్చుచుందునుగాని, నిన్నుఁ జూచుటకుఁ గా దని నీవెఱుఁగవా?

వసం—(తనలో) హా! హృదయమా! ఇన్ని నెలలనుండి యెంత వెఱ్ఱి పడుచుంటివి!

గీ॥ లతలు తల లూఁచి పూలు జ◆లజలరాల్పఁ
గ్రిందితృణచయ మానంద ◆ మందఁదగునె?
సురభిళానిల. మేతేర ◆ సూకరంబు
తన్నుఁ గౌఁగిలించుట కంచు ◆ నెన్నఁదగునె?

గీ॥ వక్కనను జంద్రికళనవ్వఁ ◆ గొక్కెఱ తను
నద్ది ప్రేమించె నని యెన్న◆నగునె? మింటఁ
జుక్క మినుకని మెఱుఁగా ◆ జక్కవ తను
నద్ది కన్గొనె నని వెఱ్ఱి ◆ నందఁదగునె?
అలాగే,

గీ॥ సహజలీలావిలోల యా ◆ చంచలాక్షి
యగపఱచుచున్న హావభా◆వాదికములఁ
గాంచి యది నన్ను మోహించె ◆ నంచు నెంచి
యిపుడు మొండిచేఁ గని యిగి◆లింపవలసె.

గీ॥ చూడనట్టి చూపులు, మాట◆లాడనట్టి
పలుకులును, వేడ్కలేని న◆వ్వులును, నలుకఁ
గనని బొమముళ్ళు, చేసిచే◆యని పనులును,
బుట్టువన్నెలు చిన్నెలు ◆ పొలఁతుకలకు.
(ప్రకాశముగా)

హా! కోకిలా! ఏమంటివి? 'నాపుష్పవనమున విహరించుట కే వచ్చుచుంటినిగాని నిన్నుఁ జూచుటకుఁ గా దని నీ వెఱుఁగవా?' అని వచించితివా? హా! అట్టిసంగతి నే నెఱుఁగనా? సార్వ భౌమ పుత్త్రికవైన నీ వెక్కడ? మాతాపితరులనుండి, రాజ్యము

నుండి వేఱుచేయఁబడి నీతండ్రిచే నిట్లు కారాగృహబద్ధుఁడనై యధమాధమస్థితిలో నుండు నే నెక్కడ? అట్టి నీ విట్టి నన్నుఁ జూచుటకు వచ్చుచుంటి వని యోజించుటకంటె బుద్ధిమాంద్యమును సిగ్గుమాలినతనము నుండునా?

గీ॥ కలుగులోనుండు నీచక ◆ ర్కటక మేడఁ?
గంధిజామూల్యతమసుధా ◆ కలిక యేడఁ?
బంకనిర్మగ్నతనువైన ◆ బా తకేడ?
స్వర్ధునీస్వర్ణసరసీజ ◆ వల్లి యేడ?

నన్నుఁ జూచుటకే నీవు రాకపోయినను వచ్చి నన్నుఁ జూచుచుంటివికదా! అందువలన నే నింతింతనరాని యామోదము నొందుట విరుద్ధమా?

గీ॥ భవ్యకేళీవనిని జూడ ◆ వచ్చి నీవు
వదన మీక్షింప సంభ్రమ ◆ పడుట తగదె?
చంద్రికల భువి కీవచ్చి ◆ చందమామఁ
గనుటకై సంబరపడదె ◆ కలువపూవు?

జ్ఞో—(తనలో) ఆహా! ఇదివఱకు నే నన్న యీమాత్రపుమాటకే యీతఁ డెంత వగచినాఁడు! కొంచెము వేఁడిగాలిచే శోషిల్లి యొక్క నీటితుంపరచే వికాసమొందు పుష్పముకంటె నీతని హృదయము మెత్తని దని తోఁచుచున్నది.

(ప్రకాశముగా)

ఇంతమాత్రమునకే యెంత చదివితివి! ఎన్ని పూర్వగాథలఁ దడవితివి! ఇపుడు మాతాపితృవిశ్లేషసంభావన మేల? రాజ్యపరిత్యాగవార్త లేల? అధమాధమస్థితి యని విలపింప నేల? మాతండ్రి నీ కెక్కడ నేమి లోప మొనర్చుచున్నాఁడు? నిన్ను సమస్తవైభవములతోఁ బెంచుచు నీకు సర్వవిద్యలను నేర్పించి జాగరూకతగ నీక్షేమ మరయుచునే యున్నాఁడుగదా! ఒక్క స్వచ్ఛందవిహారమున కున్న లోపముదక్క నితరలోప మే ము

న్నది ? ఆలోపముగూడ దీశినయెడల నీకు మేమే కావలయు ననిన మాట యేమి ?

వసం___హాహా ! ఏమి మాటాడితివి ! (నవ్వుచు) ఏదీ ! కోకిలా ! ఒక్క-సారి నావంకఁ దేఱిపాఱఁ జూచి, నీ విప్పు డనిన చిత్రవాక్యమును దిరిగి వచియింపుము.

కో___(తలవంచుకొని నవ్వును)

వసం___(తనలో) ఆహా ! ఎంత సవికాసముగ మందహాసము చేయు చున్నది!

గీ॥ పై పెదవి గదలఁగ, నడ్డ • బాసముత్తె
మదర, బుగ్గ లిట్టె యుబుక, • నకు లింత
సన్న వడఁ, జుబుకము పైని • జిన్న గుంట
వడ, రదములు వెన్నెలఁ గాయఁ • బడఁతి నవ్వె.
ఆహా ! ఈమహావైభవదర్శనమునకై సంతసింపనా ? యింత

కు ముందు,

గీ॥ కన్గొలుకులతోఁ జెక్కులు • కందఁగఁ గుచ
శిఖరహారాళితో నోష్ఠ • సీమ యదర
భ్రూయుగముతోడ మూతియు • ముడివడంగ
దృష్టితోఁ బల్కు తీండ్రింపఁ • దెలుప యలిగె.
ఇందులకు విచారింపనా !

గీ॥ రసపరిద్రవన్మన్మనో • రంగ మబల
పరిపరివిధంపుఁజిత్రరూ • పంబు లెల్ల
నంగ్రహించెను సమ్యక్ప్ర • శ స్తసరణి
నాకృతివిలేఖకం బను • యంత్రమట్లు.

(ప్రకాశముగ)

హా! కోకిలా! ఏ మంటివి? 'నీకు మేమే కావలయు నన్న మాట యేమి' అనియా ? ఇది న్యాయమేనా ? నాకు నీకంటె మఱెవ్వ రున్నారు ? నేను నాతల్లి నెఱుఁగను. తండ్రి నెఱుఁగను. రాజ్యము

నెఱుఁగను. నేను మూఁడేండ్లపిల్లవాఁడ నై యుండఁగ నీకారా లోనికిఁ దీసికొనిరాఁబడితినఁట! నాదోష మేదియో నే నెఱుఁగను.

కో—ఎఱుఁగ కేమి? సామంతరాజగు నీతండ్రి సార్వభౌముఁ డగు నాతండ్రిని ధిక్కరించినందుల కాతని విధేయతాసాంతత్యమున కతని పుత్త్రుఁడ వైన నిన్నుఁ బూఁటకాఁపుగ మాతండ్రి తెచ్చినాఁడు.

వసం—అయినను మాతండ్రికి నాకు నెంత భేద మున్నదో చూడు!

కో—ఏది?

వసం—నాతండ్రి నీతండ్రిని ధిక్కరించినందుల కతని పుత్త్రుఁడనైన నన్ను నీతండ్రి కారాబద్ధుని జేసినాఁడు. పరిశుద్ధాంతఃకరణము గల నన్ను నిష్కారణముగ నీతండ్రి యీరీతిగ నిన్నిసంవత్సరములనుండి బంధించి యుంచినను, నే నట్టివాని పుత్త్రికవైన నిన్ను మనసులోఁ దలఁచి యువ్విళు లూరుచుఁ బ్రాణాధికఁగ నెంచుచు సమస్తమునకుఁ గతిగా నెంచుచున్నాఁడను గదా! (నవ్వుచు) నీతండ్రి నాకుఁ జేసిన యుపకారమునకు నే నిట్లు చేయఁదగునా?

కో—(నవ్వుచు) నాకుఁగూడ నీవలెనే కారాగృహబంధము లే దని విచారించుచుంటివా?

వసం—నావలెమాత్రమే కాదు. నాతోపాటి కారయుండే నీకుఁగూడ బంధము లే దని విచారించుచుంటిని.

కో—నీ కిట్టి యసూయ తగదుసుమా! స్వేచ్ఛావిహారము గల వారికి బంధ మగునెడల నీ బంధబాధ యెట్లు శమింపఁగలదు? నీకు బంధవిముక్తి కావలయు నని కోరుకొనవలయును గాని—

వసం—బంధమునుండి విముక్తి యైనను నాకు నీ బాహుపంజరమున గాఢతరబంధమే కదా! అట్టి మహానందదాయక మగు నీబాహుబంధముయొక్క యనుభవము నాకీ కారాగృహమందైన నేమి? వెలుపల నైన నేమి? బంధమున బంధము మఱింత గాఢతరముగ నుండు నని యటు లంటిని.

కో—ఇట్టి మాటలు నీ నోటినుండి రావచ్చునా ?

(నేపథ్యమున) రావచ్చునా ? అమ్మా ! అటులు రావచ్చునా ?

వసం—(తనలో) ఆ రవము నాప్రియురాలి చేటిక యగు భ్రమరికదివలెఁ గానిపించుచున్నది. 'రావచ్చునా' అని యది పలికినది. తాను స్వేచ్ఛగా నిచ్చటకు వచ్చుట కేదియో యుపరోధ మున్నట్లు భావించియే కద యట్లు పలికినది. నేనును గోకిలయు నన్యోన్య ప్రియవాక్యపరామర్శనలీలాలోలత నుండ నెంత యిష్టురాలయ్యు నట్టి సమయమునఁ దాను వచ్చిన మా కానందభంగ మగు నని యిటు లనిన శ్లోచవలసి యున్నది. నాయందుఁ గోకిల కనురాగ మనిన సంగతి నీమెవలననే యాభ్రమరిక తెలిసికొని యుండును. ఒకపు డుదాసీనతయు, నొకపుడు నిరాదరణము, నొకపుడు కోపము నీమె నాయెడఁ గనఁబఱచిన నంతరంగమున ననురాగమునకు లోపము లేదనుట కీ భ్రమరికావాక్యము కొంతనిదర్శనమై యున్నది. (నేపథ్యమున) కోకిలా ! 'నేను రావచ్చునా' యని యొనరించిన ప్రశ్నమునకు నీవు నిరుత్తరవై యుండుటచేతను రాఁగూడ దని తోఁచుచున్నది. నావెఱ్ఱిగాని నీప్రియునితో నీవు సంభాషించునపుడు నేను గావలయునా ?

వసం—(తనలో) సుధాప్రవాహమాధురీధురీణగభీరాలాపములు చేటికాముఖమునుండి వచ్చినవి.

గీ॥ సతికి నాయెడఁ గల మన:స్థితులు దురవ
గాహము లయినఁ జేటివా:క్యములఁ దెలిసెఁ,
గవిత దుర్భేద్యభావమై : కష్టపఱుప
నమలినవ్యాఖ్యచే స్పష్ట:మైన యట్లు.

కో—అసందర్భప్రలాపినీ ! ఇంక రా వేమి?

(భ్రమరిక ప్రవేశించును.)

భ్ర—అమ్మా ! నాపైఁ గోప మేల ?

కో—ఛీ ! మూర్ఖురాలా ! వదరుఁబోతా ! ఈతఁడు నాకుఁ బ్రియుఁ డని నీతోఁ జెప్పియుంటినా ?

వసం—(తనలో) భ్రమరికా! ఏ మని ప్రత్యుత్తర మిచ్చెదవో? నా బ్రతుకంతయు నీజిహ్వాగ్రమున నున్నది.

గీ॥ ప్రియులు ప్రియ లటంచును వదరెదరుగాని
వారియసువులు దత్సఖీవశ్యము లగు;
రాజకృప యంచు శ్రితులు సంభ్రమపడెదరు
గాని వారు తత్సేవకాధీను లహహ!

భ్ర—కోకిలా! ఈతఁడు నీప్రియుఁ డని నీనోటితోడనే చెప్పవలయునా? నీకన్నులతోఁ జెప్పలేదా? కనుబొమలతోఁ జెప్పలేదా? భావముతోఁ జెప్పలేదా? పులకాంకిత మగు నీయొడలితో నిప్పుడు చెప్పుచుండుట లేదా? నోటితోఁ జెప్పనిలోప మేమున్నది? అదిగాక, 'ఈతఁడు నాప్రియుఁ డని నీతో నేఁ జెప్పియుంటినా' యని నీ వింతకుముం దనినవాక్యములో 'నీతఁడు నాప్రియుఁ డని' నీనోటితోనే పల్కితివి కాదా! అదిగాక పల్కినపల్కుల కంటెఁ జేష్టలే ప్రబలతరములై యుండఁ బల్కవలె ననినమాట యేమి?

వసం—(తనలో) సెబాస్! భ్రమరికా!

కో—ఓసీ! అవిధేయురాలా! నాచేష్టలలో నీ వెంచిన తప్పేమికే?

వసం—ప్రియురాలా!

కో—ఆఁ! అటు లనకుము.

వసం—నీవు నీసఖిపైఁ గోపింపవలదు. నీచేష్టలలో నది యెంచిన తప్పేమియు లేదు. నీచేష్టలు నాయం దనురాగమును సూచించుచున్న వనెను.

కో—వసంతా! నీవుకూడ నట్టివెఱ్ఱి పడుచుంటి వేమి?

వసం—ఓ మోహనాకారా! నీయనురాగమునకు వెఱ్ఱిపడఁదగినవాఁడను నేనే. నే నొక్కఁడనే.

(మోహనుఁడు ప్రవేశించును.)

మో—(తనలో) నీ వొక్కఁడవే కావు. నేనుఁగూడ నున్నాఁడను.

గీ॥ లలితలలనాంగలావణ్య • లహరి నాశ్రి
యించుకొని యుంటి మీవును • నేనుఁగూడ
నమృతసన్నిభవాఃపూర్ణ • మైన నదిని
నెపుడు కూలద్వయం బాశ్రి • యించుపోల్కి.

హా ! కోకిలా !

గీ॥ రాగవశమున మనసులో • రమణి ! నిన్ను
ముద్దుఁగొని కౌఁగిలించి, స • మ్మోదమంది,
మైమఱచి యుంటి; స్వప్నస • మ్యక్సమాగ
తాంగనాశ్లిష్టనిద్రావ • శాత్ముఁడట్లు.

నీ విప్పు డిచ్చట నుండు వని యెంచి యిచ్చటి కెన్ని యభ్యంతరములైన దాఁటివచ్చితిని. ఆహా! రాగమున కెన్ని యద్భుత శక్తు లున్నవి ?

గీ॥ కవికివలెఁ గల్పనమును, చౌ • క్కలును బక్షి
కటులు, యోగికివలెఁ గామ • యానశక్తి,
యఖిలవిస్తృతి పవనుని • కటులు, సిద్ధు
నకటు దూరశ్రవణదర్శ • నంబు లుండు.

గీ॥ ఏతదనురాగశక్తిచే • భీతిలేక
కండకం బీది బుఱుజెక్కి • గాధలఘుత
నుపవనపుగోడ దాఁటిపో • నుఱికి యిటకు
వచ్చినాఁడను నేత్రోత్స • వంబు కొఱకు.

ఇక్కడ వీరందఱు మాటలాడుకొనున ట్లున్నారు. ఈనంది వర్ధనపునికుంజముచాటున దాఁగి విందును.

కో— భ్రమరికా! నోరు మూసికొని యూరకుంటి వేమి? నాచేష్ట లేవియో చెప్పవైతి వేమి?

భ్ర— అమ్మా! మతితగ్గినదానిచేష్టలవలె మదనవికృతి హెచ్చుగుదాని చేష్ట లసంఖ్యములు గాదా! ఎన్ని యని చెప్పఁగలను?

కో—— నీవు మతితగ్గినదాన వగుటచే నాచేష్టలు నీకంటికి విపరీతములుగ నున్నవి.

భ్ర—— నాకు మతితగ్గుటకు నే నీమహానుభావుని గాఢముగ వలచితినా?

కో——ఆఁ! నోరుగట్టిపెట్టికొనుము.

భ్ర——ఈమాత్రపుమాటకే యసూయపడుచుంటివా?

మో—— (తనలో) కోకిలా! నీ యసూయయే నీ రాగాధిక్యమును సూచించునది.

గీ॥ జను నహంభావ మెంతొ యజ్ఞాన మంత,
జను నతుష్టి యెంతొ యిహావాంఛయును నంత,
కవి కసహన మెంతయొ యశః కృతియు నంత,
సతి కసూయ యెంతయొ రాగగతియు నంత.

కోకిలా!

గీ॥ బద్ధునెడ నీవు వినియోగపఱచు ప్రేమ
మంతయును నిష్ఫలం బగు; నబ్జబద్ధ
భృంగమునఁ దేనె చికిలినరీతి, విషయ
విహ్వలున కిచ్చు వేదాంతవిద్యపోల్కి.

భ్ర—— అమ్మా! నేనుఁగూడ వచ్చువఱకుండు మని నీతోఁ జెప్పినను నీవు నాకంటె ముం దిచ్చటి కేల వచ్చితివి?

కో—— ఏల వచ్చితినో నీ కేల చెప్పవలయును?

భ్ర—— చెప్పనక్కఱలేదు. రహస్య మంటివా, అదియే చాలును.

కో——అదిగో! అసందర్భము లాడుచున్నావు. రహస్య మే మున్నది? నేను వచ్చుటకు నాయిష్టమే కారణము.

భ్ర—— ఈతనిపై——అంతియేనా?

వసం——సతిమణీ! ఔ నసరాదా? హాసీ! అంతమాట నాడ నక్కఱ లేదు.

గీ॥ తల నిటుల వంచి మొగ్గదం♦తము లగపడ
నింత నగరాదె? చెవులవ్రా ♦ లిట్టె కదల
మొగము నింత యూపఁగరాదె? ♦ ముద్దులొలుక
నోరఁ గనరాదె? వల దూర♦కుండరాదె?

కో—మీ రిద్దఱేకమై నన్నుఁ బరిహసించుచుంటిరా?

వసం—మే మిద్దఱ మేక మగుట యసత్యము ఎన్నటికైన నీవును నేనును.

మో—(తనలో) నీవు నదియుఁగాదు; నేను నదియును.

గీ॥ చిరపరిచయముచేఁగూడఁ ♦ జెలుల కథము
పయి మనసు దగులుఁ; దగిన♦వారిఁ గన మ
నను దిరుగు; లఘుసూత్రిస♦నాథసూచి
చుంబకముగఁ జేరి విడుచు దా♦రంబుగాదె?

వసంతా!

గీ॥ తగినవారలలోన ను♦త్తముఁడ నేను;
నీచుఁడవు నీవు; కోకిల ♦ నీకుఁ దగదు;
నిన్నుఁ ద్రోసిరా జని కాంత ♦ నేను గోనఁగ
వచ్చినాఁడ నా కంతటి♦భాగ్య మున్న.

కో—(కోపముతో) వసంతా! నీ విప్పు డేమంటివో మఱియొక్కసారి యనుము.

వసం—(నవ్వుచు) ఏ మంటినో చెప్పనా? కర్ణరసాయనముగ విందువా? ఒక్కసారి యన నేల? నాజన్మము కృతార్థ మగునట్లు వేయిసారులైన నందును. నీవును నేనును—నేనును నీవును—నద్వయానందానుభవమున—

కో—చాలు! చాలు! నీ ప్రజ్ఞాలాపముల నుడుగుము.

మో—(తనలో) సెబాస్! కోకిలా! అతనిమాటలకంటెఁ బై మాటలును నత్యవాక్యములును నే నాడితిని. నీవు వినఁదలఁచుకొనవా? ‘నీవు నదియుఁ గాదు, నేను నదియు!’ నని నే నంటిని.

కో—వసంతా! నీ కట్టియౌద్ధత్యము కూడదుసుమా!

మో—(తనలో) ఔద్ధత్యము కాదు; అద్వైతము.

కో—నే నింటికిఁ బోవలయును. నీవు నాతోఁగూడ వచ్చెదవా? లేక నే నొక్కతెను బోవుదునా?

భ్ర—నేను నీతోడనే వచ్చెద నని చెప్పినప్పటికిని నన్నుఁద్యజించి పోవుటకు వసంతుఁ డింటియొద్ద నున్నాఁడా?

కో—ఇఁక నీవు వసంతునిపే రెత్తకుము.

వసం—కోకిలా! నాపేరు నీ వెత్తఁగూడదు కాని, భ్రమరిక కేమి?

భ్ర—చూచితివా సఖి! వసంతుఁ డేమనుచున్నాఁడో! నీ వాతని భార్యవు కావున భర్తపే రెత్తఁగూడ దని యభిప్రాయపడుచు న్నాఁడు.

వసం—రాజపుత్రికా! నా కట్టి మహాభాగ్యము నీవు లభింపఁ జేయ రాదా?

మో—(తనలో) పోవోయి! అట్టిభాగ్యము నాకుఁ గాని, నీకుఁ గాదు.

కో—ఎన్నిమాఱులు చెప్పు మంటివి? నీ ప్పై నా కనురాగము లేదు. నీ విట్టి యడియాసల మానుకొనుము. తెలిసినదా? నీవు నాక క్కఱలేదు. తఱచుగ వచ్చి చూచుటవలనఁ గలిగిన చనువు నా ధారమును జేసికొని యెన్నిమాటలు పల్కుచుంటివి? (భ్రమరికవంకఁ దిరిగి) ఏమీ, వచ్చెదవా?

వసం—హా! భ్రమరికా! నాప్రియురాలు పోవుచున్నది. నేను వ్యర్థుఁ డను. బద్ధుఁడను. నీవు నామాఱుగ దాని నాఁపరాదా? చూచె ద వేమి? అయ్యో! పోవనున్నదికదా!

గీ॥ ఇట్టు కర మడ్డు పెట్టి మో • మట్టు త్రిప్పు
కొనిన కాంతను బతిమాలు•కొనెడుమిషను
గడ్డము గ్రహించి దానిమొ•గంబు నాదు
వైపునకుఁ ద్రిప్పి పుణ్యాన • వజలరాదె.

గీ॥ నేను నీవాఁడ, నినుఁ బాసి ♦ నిలువఁగలనె
యనుచు నామాటలుగఁ బల్కి ♦ యబలపైఁట
నొడిసిపట్టి యీఁపఁగ రాదె ? ♦ యడుగులందు
వ్రాలి నామాఱుగా నడ్డు♦పడఁగ రాదె ?

భ్ర—(పైఁటచెఱఁగు బట్టి యీఁచును.)

మో—(తనలో) ఆఁడుదాని ప్రకృతి రహస్యములు దెలియని వసంతుఁ డాందోళనము పడి కోకిలను బట్టుకొను మని సంభ్రమపడినఁ బడునుగాక! భ్రమరికా! నీకైనఁ దెలివిలేదా! నీ వాఁడు దానవు కావా? నీ సఖీహృదయమును నీ వెఱుఁగవా? నీ వేల యంత తొందరపడి యామెచేలచెఱఁగు గ్రహింపవలయును? వదలివేయుము ఒక్కయడుగు ముందునకుఁ బెట్టిన నే నీ శిరముఁ దెగనఱకికొందును.

గీ॥ స్వచ్ఛశోభనాంగపూర్ణ మీ ♦ సకియమనసు
తరళతను మొసఁ దత్యద్భు♦తగతి కలది;
యాఁపిన మఱి త గతిఁగల♦దగును; వ్రేల
నడఁపఁబడు శీధురసబిందు♦వటులె యెపుడు.

గీ॥ మాట బడబడ కాని, యా♦ముగువమనసు
నమృతమగభీరరససం♦భరిత మంచు
నెఱుఁగవే? వసంతా! భయం♦కరవిశేష
గాఢగర్జాఢ్యఘుమఘుమా♦ఘనముమాడ్కి.

భ్రమరికా! నీవు తెలివితక్కువ పనిఁ జేసినను నా కామోద మొసఁగితివి!

ఆ॥ వె॥ వదలుపైఁటలోని ♦ వనితచన్నవ బిగి
నింతదనుకఁ గాన, ♦ నిపుడు నీవు
పైఁట లాగ నద్ది ♦ ప్రబలి యున్ముఖ మాచు
మనసు కనుల నొక్క♦మాఱు పొడిచె.

వసం—భ్రమరికా! నీచెలి నాఁపి నీవు పుణ్యముఁ గట్టికొని నన్నుఁ గృతార్థుని జేసితివికదా!

కో—(వసంతునివంకఁ జూచుచు) అది యాఁపునది; నే నాఁగెడు దాననా? సఖి! నీవు నన్ను వదలుదువా, లేదా? లేనియెడల శిక్షాపాత్రము వగుదువు. జాగ్రత్త!

(ముందునకుఁ బోవ యత్నింప భ్రమరిక యాఁపును.)

భ్ర—నీవలనిశిక్షకు నేను భయపడుట లేదు. నీ వింటికిఁ బోయిన యెడల నీకు మదనునివలన శిక్ష యని నేను జడియుచుంటిని.

వసం—(తనలో) కోప మున్న ట్లగపడుటయే కాని, కోపచిహ్నములు మోమందుఁ గానఁబడుట లేదు.

గీ॥ నాతివీక్షణములు ప్రస♦న్నంబు లగుచుఁ
జల్లఁగా నుండెఁ, బలుకులు ♦ చండములయి
బాధ నిచ్చు; హాయిగ జల్లు♦వాన నిచ్చు
చు వడగండ్ల రాల్చు వసంత♦శోభఁబోలె.

గీ॥ ఉవిదమన సొకతీరు; పం♦లొక్కతీరు;
చేష్ట మఱియొకతీ; రిట్లు ♦ చెలఁగు దీని
ప్రకృతి చిత్రంబు; శ్రుతికి సం♦బంధ మొంద
నట్టి పాటకు నపలయ ♦ దొట్టినట్లు.

మో—(తనలో) ఓ వెఱ్ఱి వసంతా!

ఆ॥ వె॥ ఒడలు బయలుసేయు ♦ నువిద గర్వ మెటులొ
మనసు బయలుసేయు ♦ మగువ యటులె;
జిహ్వ యాయఁబడెను ♦ జిత్తగతులఁ గప్ప
నొడలిగతులఁ గప్ప ♦ బిడియమటులె.

కో—న న్నింక నేల పట్టుకొందువు?

భ్ర—నీ వాగుఁదు ననిన విడువ కుందునా? సఖీ! నామనవి నంగీకరించి కొంతసే పింక నిచ్చట నుండుము.

వసం—నీ మనవియే కాదు; నా ప్రార్థనగూడ నదియే!

కో—వీలు లేదు. నే నింటికిఁ బోవలయును.

భ్ర—ఇంటియొద్ద నే మున్నది?

కో—ఇచట మాత్రమో?

భ్ర—ఇచ్చట జగన్మోహనుఁ డగువసంతుఁ డున్నాఁడు.

మో—(తనలో) భ్రమరికా! తప్పు. జగన్మోహనుఁడు, వసంతుఁడు నున్నా రనుము.

కో— ఆతఁడు జగన్మోహనుఁ డని పెద్దపేరు నీవు పెట్టిన నే నేల కాద నవలయును? కాని నాయిష్టము మదధీనము. నీవు మాఱుచెప్పక యూరకుండుము.

భ్ర—నేను మాఱుచెప్పక పోయిన వసంతుఁ డూఱకుండునా?

వసం—కాంతామణీ! త్వదధీనమైనది నీయిష్టమే కాదు; నాయిష్టము, నామనసు, నాయాత్మ గూడను. బంధనాలయాధీనమైన యీగాత్రముఁగూడఁ ద్వదధీనమును జేసికొని నన్ను సర్వవిధములఁ గృతార్థుని జేయ వేడుచున్నాను.

కో—నీ కెంత యస్వతంత్రతయో నాకుఁగూడ నంతియే యని యెఱుగవా? నీ కిక్కడ బంధము; నా కంతఃపురమున బంధము. నీపైఁ గాపుగాయువారలకంటె నన్నుఁ గాపుగాయువా రధికసంఖ్యఁ గలవారై యున్నారు. అట్టిచో నేను నీ కెట్లుబంధవిముక్తిఁ జేయఁగలను? వ్యర్థము లగు నాశలఁ బెట్టుకొనక ప్రస్తుతావస్థతో సంతుష్టి నొంది యుండుము.

వసం—సరే! ప్రస్తుతస్థితితోడనే సంతుష్టి నొందెదను. నే నడియాసల నొందను. నా కేమియు నక్కఱలేదు. ఒక్కసంగతి మాత్రము చెప్పవలయును. 'నేను నిన్ను వలచితిని' అను సుధామధురాక్షరములు నీ నోటితో నాచెవిని వేయవలయును. ఇదియే నాకో

రిక. ఇంతతో సంతుష్టిఁ జెందెదను. ఊఁ! కర్ణరసాయనముగ వచి యింపుము.

భ్రి—అమ్మా! సందేహింపకుము. ఏదీ? నేను—నిన్ను—పలుక వేమి?

కో—ఆఁ! నా కిది యేమి బలాత్కారమా? సఖీ! నా కిప్పుడు నీవు నేను మాటలను జెప్పుచుంటివా? ఎంత యవిధేయతగ నుంటివి? జాగ్రత్త! నే నట్టిమాట లాడుదానను గాను. ఆడుట నా కిష్ట ము గాదు.

మో—(తనలో) ఆహా! సముద్రపుఁబీతలలో నెన్నిజాతు లున్నవో స్త్రీలలో నన్ని ప్రకృతు లున్నవికదా! నక్కలు పీఁతలను గ్రహిం చినట్లే జిత్తులమారి స్వభావముఁగలవారే స్త్రీల స్వాధీనలగఁ జేసికొందురు. తన్నుఁ గోకిలవలచినట్లింక వసంతునికిఁ దెలియనే లేదు కాఁబోలు! హా! ఎంతటి బుద్ధిశాలి! నేను నిన్ను వలచితి నని కోకిల తనతోఁ జెప్పునా? ఎంత కాల మాశ్రయించిన సరే, ఎన్ని సేవల జేసిన సరే, యీజాతిమాత్ర మెంత సేపటికి నుహూ హ్హూ నుటయేకాని, ఊఁ యనునదిమాత్రము కాదు.

ఆ॥ వె॥ మాటకరకుదనము ♦ మనసు మెత్తఁదనంబుఁ
గలుగుదీని బలిమిఁ ♦ గవయు నిద్ద
ఱుట్టె లోకు వగును ♦ గుట్టుబాధను దోఁచి
చేరఁ దేనెపట్టు ♦ చిక్కినట్లు.

వసం—ఎంత దయ లే కుంటివి? ఈ రెండుమాటలు ననలేవా? అనుట కిష్టతయే లేదా? నేను నీ రాజ్యమును గోరితినా? నీధనమును గోరితినా? నీవు నన్నుఁ బరిణయ మాడవలయు నంటినా? ఏమి యుఁ గోరలేదు. రెండుమాటలే కదా! ఆమాత్రమే పలుక లేవా?

మో—(తనలో) ఈపరమవిరాగునకు, నీమహా వేదాంతశిఖామణికా రెండు మాటలుమాత్ర మెందులకో? అవితత్వమసివాక్యములా యేమి?

కో—ఇన్ని మాటలు పలుకుచున్నదాన నామాటలుమాత్రము పలుక
లేకుందునా? వట్టిమాటలు పలుకుట నాకిష్టము లేదు.

వసం—అంత దయఁగలదాన వైనయెడల వట్టిమాట లేల? క్రియానిద
ర్శకము లగుమాటలే పలుకవచ్చును.

కో—అయిన నీ కిట్టిమాటలతో నేమి ప్రయోజనము?

వసం—ప్రయోజన మున్నదికాదా!

కో—అది యెట్టిదో?

వసం—నేను జీవించియుండుటయే.

గీ॥ కుసుమ మొక్కటి వేఱొక్క • కుసుమమునకుఁ
బరిమళం బిచ్చి తత్సౌర•భము గ్రహించు;
దీప మొక్కటి వేఱొక్క • దీపమునకు
స్వప్రభ నొసంగి తత్కాంతి • సంగ్రహించు.

గీ॥ ఆత్మ యుండుట వేఱొక్క • యాత్మకొఱకుఁ
గాని, తనకొఱకును మాత్ర • గాదు; కాన
నీకొఱకు మేనఁ బ్రాణము • ల్నిలిపినాఁడ
ననుఁ గృతార్థుని జేయవే • నలిననేత్ర!

గీ॥ దేహమే బద్ధమైనది; • దీని కిహసు
ఖానుభవ మేదియును గల్గ • దైనఁ, జింత
లేదు; మదికి శృంఖల లేవి • లేవు, కాన
నీపయిని వ్రాలె నద్ది ని•ర్నిద్రఫణితి.

గీ॥ దానిమోదంబునకు నిరో•ధంబు లేదు
నిన్ను వలచితి ననుచును • జిన్నిముద్దు
పలుకులను జల్లఁగా వీను•లలరఁ బలుకఁ
జాలు నదియె; ముమ్మాటికిఁ • జాలు నదియె.

గీ॥ ఏమి లేకున్న నన్నుఁ బ్రే•మించునట్టి
యొకతె కలదని సంతుష్టి•నొంది తద్వి
నిశ్చలతమదృష్టినె యుందు • నిశ్చలోత్త
రముఖదిక్ప్రసూచీకంట•కమునుబోలె.

కో—(తనలో) అనురాగపూర్ణ మగు మాటల నాడుచున్నాఁడు.

భ్ర—అమ్మా! వసంతుని యనురాగమహిమ మెట్టిదో చూచితివా?

మో—(తనలో)

గీ॥ వనితయుఁట; దూరగతయైన • బాధ గలుగ
దఁట! వలచితి ననఁగఁ జాలు•నఁట! ముదమట!
దవ్వునుండి యన్నము నివే•దనముఁ జేయ
నాఁకలి శమించు బ్రిబలవే•దాంతి యితఁడు.

గీ॥ మహితవస్త్వాళివిషయసం•పర్క మొంద
వలయు, ననుభవమున శాంతిఁ • బడయవలయు,
నింద్రియోద్ధతి యురక శాం•తించునె? యిలు
గాల నాఱునే? స్వస్తివా•క్యములచేత.

వసం—కోకిలా! ఊరకుంటివి. ఆమాటలు నీవు నాతో ననుటకు నీకు లజ్జయైన నీ చెలితోఁ జెప్పుము.

భ్ర—పెకిఁ బలుకుటకుఁగూడ నీ కంగీకారము లేనియెడల నాచెవిలోఁ జెప్పుము. ఏదీ? ఏదీ? (తనమోమును గోకిలమోమునొద్ద నుంచును.)

మో—(తనలో) పళ్ళెరమున నుండు పాలగ్రిమతీర్థమును మొదట గిండిలోఁ బోసి, తరువాత భక్తనినోటఁ బోసినట్లు కోకిలా! నీమాటలను మొదట భ్రమరిక కిచ్చి దానిగుండ నీ పీతని కర్పింపుము.

భ్ర—ఏదీ? నాచెవి నీవదనముయొద్ద నుంచితిని. ఊఁ!

వసం—ప్రియురాలా! సందేహింపకుము.



గీ॥ నవ్వు కేగ్రంట నలరఁ గంధర యొకింత
చాఁపి, యెడమచే సకియభుజమున నునిచి
యోష్ఠచలనంబు బుగ్గల నొందకుండ,
నాయొడలు జల్లుమనఁ బల్కు నాతిచెవిని.

భ్రమ—ఏదీ? ఊఁ!

మో—(తనలో) ఆహా! ఏమి విలాసయుతముగ నున్నది!

ఆ॥ వె॥ చేటిచెవినిఁ గల్లు చెంగల్వ కోకిలా
స్యమున వ్రాలె; నాకె యట్టిజనన
మున్న నిట్టులిట్టు లెన్నొముద్దులు గొని
యొసఁగియుందు నడవియేన్పు మాని.

భ్రమ—సఖీ! నీవు నాపైఁ జేనై వకపోయినను నీనాథుని యభిప్రాయ
మది కావున నీకరమును నాభుజముపై వేసికొందును.
(అట్లు చేయుచున్నది.)

వసం—అటులేని సఖీ! హృద్గతాభిప్రాయమునుగూడ నీచెవిని నైచు
కొనవలయును.

కో—భ్రమరికా! నీకుఁ బిచ్చియా యేమి?

మో—(తనలో) ఇట్టి యస్వతంత్రుఁడై నవానిని వలచినందులకుఁ బిచ్చి
నీకు; తన స్థితిగతుల నెఱుఁగక యాకాశనదీగతాంభోజపరిమళ
మునకు ముక్కుపుటము లుప్పరమున కుంచి వేచియుండుటకుఁ
బిచ్చి వసంతునకుఁగాక, నడుమ భ్రమరికకుఁ బిచ్చి యేమి?

కో—వసంతా! నీ వనుమాటలు నేను నీతో బిగ్గరగఁ బలుక నా
కిష్టము లేదు. వానిని నాసఖికర్ణమున నిమ్మళముగ వచింప నీకు
వినఁబడవు కదా! అంటి ననియే భావింపలేవా?

వసం—మహాప్రసాదము. అంటివి కదా!

కో—అనుకొంటిని—అటుమీఁద?

మో—అటుమీఁద నిం కేమున్నది? కారాగృహమం దుండియు, శయనగృహమున నీతో హంసతూలికాతల్పమం దున్నట్లు భావించుకొనును. ఇకయినుప జాలకట్టును కౌఁగిలించుకొని నిన్ను గాఢముగఁ బరిరంభమును జేసికొనినట్లు భావించును అజ్ఞబాలురు కట్టుముక్కను గాళ్ళనడుమ నిడుకొని కాళ్ళు విఱుగఁగఁ బరుగెత్తుచు మహావేగపరిధావదశ్వారోహణామితానందానుభవమున నుప్పొంగుట లేదా! ఉన్మత్తుఁడు చిల్లపెంకులను జినుఁగుల గుడ్డను మూటఁగట్టుకొని తన్నాశ్రయించుటకు వచ్చిన మహాపండితు లందఱకును బంగారునాణెములు వెదఁజల్లుచుండ వారందఱు తన త్యాగపరాయణత కుత్కంఠులై స్తోత్రములు సేయఁ దాను మోదాతిశయమున శిరఃకంపము సేయుచుండుట లేదా! ఇది గాక తనప్రక్కనున్న చిలుముగొట్టమును దన సహధర్మచారిణి యని దాని ముద్దుఁగొని మతిగల సంసారికి లేని సరస సంసార సౌఖ్యానుభూతిని సంతసించుట లేదా! ఇట్టిదే నీబ్రతుకు గూడను. భావనాసంభాషణములకు, భావనాపరిరంభమునకు, భావనాభోగములకు నీప్రార్థన లేల? ఈ దైన్యము లేల? ఈ బాధ లేల?

వసం—తరువాత నేమో చెప్పనా?

కో—కానిమ్ము.

వసం—కొంచె మిటు రమ్ము.

మో—(తనలో) ఎందులకో! వచ్చిన దనుకొనుము.

కో—ఎందులకు?

వసం—ఒక్క ఛిన్నసంగతిని జెప్పుటకు—

మో—(తనలో) హే! హే! ఓ భావనామయూ! చెప్పితి ననుకొనరాదా?

గీ॥ సత్య మగు నీ జగం బంత • సర్వమిథ్య
యనుచు నద్వైతమతము బోధనము సేయు
భావనవిపరీతాద్వైత • భావ యగు న
సత్య మంత సత్యంబుగా • సంగ్రహించు.

భ్రి—సఖి! ఆతనిని గొంచెము సమీపింపుము.

కో—వసంతా! నే నిక్కడనే యుందును నీవు చెప్పఁదలఁచుకొనిన దేదియో చెప్పుము. నే నక్కడ కేలి రావలయును? అక్కడఁ గ్రొత్తవా రెవ్వ రున్నారు?

మో—(తనలో) నేను లేనా? నే ననేకపర్యాయములు నిన్నుఁ జూచి యుండుటచేత నీవు నాకుఁ గ్రొత్తకాదు. కాని నేనుమాత్రము నీ కిప్పటికిఁ గ్రొత్త. ఇఁకముందు ప్రాత గావలసియున్నది.

వసం—ఎందులకుఁ బిలిచితినో యొకసారి యనుగ్రహించి యిటురమ్ము.

భ్ర—వెళ్ళు. నీ మన సాతనికిఁ దెలిపితివి. అతని మనసు నీ విదివరకే గ్రహించితివి ఇఁక నాతో నీకుఁగాని, యాతనికిఁగాని పని యేమున్నది? చత్వారపుగంటికి జోటిని దగిల్చినపిమ్మటఁ దగిల్చిన చేతితోఁ గంటికిఁగాని జోటికిఁగాని పనియే మున్నది?

మో—(తనలో) ఊడఁదీయునప్పుడు పనియున్నదికాదా! అప్పుడీ జోటిని నా ముక్కునకుఁ దగిలింపవలదా?

కో—ఏమి భ్రమరికా! నీ కిట్లనుట తగునా?

భ్రి—ఇది తగునో తగదో నే నెఱుఁగనుగాని యాతఁడు రమ్మని పిలుచుచుండ నీ విచ్చటనే యుంటమాత్రము తగదు.

వసం—భ్రమరికా! ఏమిమాట లాడుచుంటివి? నేను నా ప్రియురాలిని రమ్మని పిలువఁగ నీవు దానిని దీసికొనిరమ్మని నా యభిప్రాయ మని నీ వెఱుఁగవా? నేను నిన్ను వదలుకొనుట కింతలో నాకుఁ గలిగిన మహావైభవ మేమి?

మో—(తనలో) ఇంతలోనే కాదు. ఎప్పటికి నింతే.

వసం—గీ॥ అభిమతవిహారయోగ్య లౌ♦నట్టివారె
ప్రియులకొఱకుఁ దచ్చేటికా♦బృందమునకె
ప్రాణములనైన నర్పింప♦వలసియుండ,
బద్ధుఁడను నిన్ను నే నెట్లు ♦ వదలగలను?

కావున, భ్రమరికా! అలుకమాని నా కాంతను నాయెడ ననుగ్రహవతిఁ జేసి నన్ను ధన్యుని జేయుము.

మో—(తనలో) ఈ విచిత్రచరిత్రములో భ్రమరికాకోపోపసంహార మనునది యొక్క యుపాఖ్యానము!

కో—భ్రమరికా! నీకుఁ గోపముతీరినదా?

భ్ర—నాకుఁ గోపము తీరినది. నీకు సిగ్గును గొంత తీరినది. రమ్ము అతనియొద్దకుఁ బోవుదము. (చేయిపట్టుకొని లాగును.)

మో—(తనలో) ఆఁ! భ్రమరికా! ఎంత సాహసము! ఇంతవరకుఁ గోకిలావసంతుల కన్యోన్యసంభాషణశ్రవణానందముమాత్రమే యనుకొంటిని. ఇప్పుడు నీవు వారి కంతకంటె నానంద మీయఁ దలఁచితివా?

గీ॥ వలపు లేనిచోటనయిన ♦ లలనలకును
వలపుఁ గలిగించు జాణ లీ♦బానిస లహా!
వలపుగలయెడ సంధాన♦పాటవప్ర
శస్తరచనకు వీరి కా♦శ్చర్య మేమి?

భ్ర—రా వేమి? (లాగుచున్నది.)

కో—(తనలో) ఈ మహానుభావునియొద్దకు సన్నాకర్షించుచున్నది భ్రమరికయే కాదు. నా ప్రేమముగూడను. నే నిప్పు డేమి చేయుదును? (ప్రకాశముగ) సఖీ! నన్ను లాగుటచేత నా కరము నొచ్చుచున్నది. వదలుము.

భ్ర—నేను లాగుటచేత నొచ్చుట లేదు. నేను ముందునకు లాగ నీవు వెనుకకు లాగుకొనుటచేత నొచ్చుచున్నది. నిస్సందేహముగ, నిరంకుశముగ ముందడుగువైచి యాతని సమీపించినయెడల నీకరమూ నొవ్వదు. నాకరమూ నొవ్వదు. ఆతని మనసా నొవ్వదు రమ్ము. (లాగును.)

మో—(తనలో) నాప్రాణములు నొచ్చునుగదా!

కో—అబ్బ! నొప్పి యెత్తుచున్న దనఁగ వదలఁగూడదా?

భ్రి—పోనీ! ఈ యెడమచేతిని వదలి కుడిచేతిని గ్రహింతును.

వసం—వలదు; భ్రమరికా! నీ వామెకుడిచేయి నంటవలదు. అది నా కరస్థ మైనది.

గీ॥ బ్రహ్మహీరాంగుళీయక • ప్రాంచితంబు
నవరసాలకిసాలారు • ణంబు మంజు
కంకణోపేత మత్ప్రఘు • ర్మాంక మైన
దానికుడిచేయి నాపాలి • ధనముగాదె!

మో—(తనలో) స్వప్నధనము.

కో—(తనలో) ఒడ లుప్పొంగుచున్నది. (ప్రకాశముగ) అబ్బ! వెనుక కాలిపై నేమో ప్రాకుచున్నది.

(తొందరగ నొక్క యడుగు ముందున కిడును)

భ్రి—వెనుకవైపునఁ గాలిని బ్రాఁకుట గాదమ్మా! ముందువైపున మనసును బీఁకుచున్నది.

మో—(తనలో) ఆహా! ఈకాంత యెంత విలాసవతి!

గీ॥ వెడఁదకనులు బెదరి యట్టు • వెనుకఁ జూచు
సందడిసి బైఁటజాఱఁ గాల్ • తొందరగను
దులుప నందెలు మ్రోయ గుబ్బలు వడంక
నటివలె శ్రవణాక్షియుగళా • నంద మొసఁగు.

భ్రమరికా! నీవు దీనిని గాంతునియొద్దకుఁ బ్రోత్సాహపఱచు చుంటి వని యింతకుముందు నిన్ను దూషించితిని. నేను బొరపడి తిని. క్షమింపుము. నీవు దాని నిప్పుడు లాగుటయే నాకు క్షేమ కర మయ్యెను.

గీ॥ ఇట్టి యీతని జేరుట • కెగయు చున్న
దీని లాగుటచేతనే • దీనినడక
తొందర యడంగె నిసుమంత; • దొంగగొడ్లు
దాఁటులు గుదియచేఁ గొంత • తగ్గినట్లు.

అయినను నే నెంత నిర్భాగ్యుఁడను!

గీ॥ కనఁబడకయుండ వీరి దుష్కార్యచయము
యిచట నిల్చి యూఁపఁగ శక్తి నెనయక శ్రమ
మున గణింపవలసెఁ, బ్రాణు లొనరఁజేయు
కుటిలకృతుల వ్రాసెడు చిత్రగుప్తులట్లు.

వసం—కోకిలా! నేత్రపర్వముగ నొక్కయడుగు ముందునకు వైచితివి! అడుగున కొక్కప్రాణము నాకు లేచి వచ్చుచున్నట్లున్నది.

మో—(తనలో) నా కొక్కప్రాణము గతించుచున్న ట్లున్నది.

భ్ర—సఖి! నీవును, నేనును సమవయస్కుల మగుటచే నీవు చిన్నతనములో విద్దెములఁ జేయుచుండఁ జూచువేడుక నాకు లభించక పోయెను. కాని, యాలోపము నాకు లేకుండ నీ విప్పుడు నన్నానంద పెట్టుచున్నావు. ఏదీ! ఏదీ! ఇంకొక్క తప్పటడుగు ఏదీ?

కో—చాలు! చాలు! నీ వెంత గడుసుదానవు! నేను వెనుకకుఁ బోఁదలఁచినఁ బోనీయకుండ నాఁపితివి. ఆఁగియున్న నాఁగు టేల? యని ముందునకు లాగితివి. ముందునకుఁ బోవుచున్న విద్దెములఁ జేయుచుంటి వని యధిక్షేపించితివి నన్నింక నేమిచేయు మంటివి? (కారాగృహమునొద్దకుఁ బోవును.)

భ్ర—ఇందుకొఱకే నేను నిన్ను బలవంత పెట్టుటయు, నీనాథుఁడు ప్రార్థించుటయును. అయ్యో! నీపైకము నీ కిచ్చి ఋణము దీర్చుకొంటిని.

వసం—భ్రమరికా! నీవు నా కింక నెంత మహోపకృతిఁ జేయవలసి యున్నదో యెఱుఁగుదువా?

మో—(తనలో) వద్దికిరింద భ్రమరిక నపేక్షించుచున్నాఁడా యేమి? హా! కోకిలా! నంగనాచివై యింతవఱకుఁ దెగసాఁగి బిఱ్ఱబిగిసి యిప్పు డీట్టె బుడుఁగుబుడుగున నీతనిపాదములఁ బడుటకు వచ్చితివా?

ఆ॥ వె॥ మనుజుఁ డధముఁడైన ♦ ధనహీనుఁ డైనఁ గు
రూపుఁడైన దుష్ట♦రోగుఁడైనఁ
బిటికిపండ్లమైన ♦ వెలఁదికి నచ్చిన
నతఁడె గురుఁడు మరుఁడు ♦ నతఁడె వరుఁడు.

గీ॥ పాత్రిదానంబు సేయుని ♦ పత్రిభుని జనులు
తిట్టుదురు; దైవమా! యీతఁ ♦ డెట్టిపాత్రి
మనుచుఁ గోకిల నిచ్చితి! ♦ కనులఁబడవు
కాని నిన్నేమి చేసినఁ ♦ గలదె తప్పు?

హా! వసంతా! మహాదృష్టశాలివి గదా! నీ సౌఖ్యమును
నా పాపపు నేత్రిములతోఁ జూడవలసి వచ్చెను.

వసం——గీ॥ ఘనతరానంద మాకస్మి♦కముగ మృదుల
హృదయమును జేర నతిశోక ♦ మొనసినట్లు
చిత్తము తపించు, జడతను ♦ జెందుఁ, జంద్రి
కలిత మగు కన్ను మండి నీ♦ర్గ్రిమ్ముగాదె!

కావునఁ గోకిలా! ఇంతసేపటినుండియు మాటలాడలేకుంటిని,
క్షమింపుము.

మో——(తనలో) ఇంతసేపటినుండి దేవులాడుచుండియు నాకస్మికమోద
మేమిటో! మృదులహృదయు మని యాత్మస్తుతిఁగూడఁ జేసికో
నుచున్నాఁడు. ఇతని హృదయమున కాజన్మజడిమ గాని యానఁ
దజడిమ గాదు.

వసం——కోకిలా! నీకింత కాలమునకుఁగదా నాయందు దయ గలిగినది!
నీ విప్పటికిఁగదా, నా కత్యంతసన్నిహితబంధు వైతివి!

మో——(తనలో) ఇప్పటికి మాత్రి మత్యంతసన్నిహితత్వ మెచ్చటిది!
ఓ కారాగృహాయసస్తంభములారా! అస్మదీయప్రాణరక్షక
దేవతలారా!

గీ॥ నాదుప్రార్థన మీరు కర్ణముల నిడుఁడు
మిడుతు మిడుఁతని వట్టిచూపులకు మాత్ర
మంతరం బీయవలె వీరి కంతెకాని
చేయి చేయియుఁ గలియఁగాఁ జేయకుండి.

ఓ వసంతా!

గీ॥ ఉవిద దరిఁజేరె నని పొంగుచుంటి వేమొ?
ఇప్పు డేమి చేసెదవొ వీక్షింతుఁగాక!
బిట్టుకౌఁగిలి కందని యట్టిదూర
మంగుళంబైన యోజనాయతముగాదె!

భ్ర—మహానుభావా! మాచెలిని మీరుదయతోఁబరిగ్రహింపవలయు.

వసం—విపరీతముగఁ బలుకుచుంటి వేమి? నన్ను మీచెలి దయతోఁ బరిగ్రహింపవలయు నని నాప్రార్థనము.

భ్ర—బాగుగనే పలికితివి? అయినను, ఎన్నిబింకములైన, నెన్నిపట్టుదల మాటలైన, నెన్నిగర్వోక్తులైన, నెన్నిధిక్కృతులైన, నెన్నియధిక్షేపణములైన, నెన్నినిర్లక్ష్యతలైనఁ గాంతలు పురుషులకు మన సీయకున్నంతవఱకె; ఇచ్చిన యుత్తరక్షణమునఁ దూలముకంటె లఘుతరలై, యతిదీనలై, పరివర్జితసర్వస్వాతంత్ర్యలై సర్వథా కింకరగణమై—

మా—(తనలో) యమకింకరగణమై—

భ్ర—పాదపరాగలేశాభలై యుండుటఁ దఱచుఁగ నాచారమై యున్న దికదా!

వసం—ఎట్టికఠినోక్తులు పలికితివి! ఈమె మహారాజపుత్త్రిక. నేను దత్తాసామంతరాజపుత్త్రుఁడను. నే నెప్పు డీమెకు విధేయుఁడనై యుండవలసినవాఁడనేకదా! ఆమాట యటుంచుము. ఇ దేమి? పురుషుని కర్థ్వామైన యాధిక్యమును స్త్రీకనంబద్ధమైన నైచ్యము నారోపించితివి! సృష్టిలో స్త్రీకిఁ బురుషునకు భేద మేమున్నది? స్త్రీకంటెఁ బురుషుఁ డధికుఁ డెట్లగును?

మో—(తనలో) మాయకంటె బ్రహ్మ మధిక మైనట్లు.

వసం—గీ॥ సహజముగ మగవాఁడు పా♦షాణహృదయుఁ
డబ్జలోచనాసాహచ♦ర్యమునఁ గాని
వానిహృదయము మృదులత ♦ వడయు, దమృత
కరకరస్పర్శరహితాబ్జ♦కాంతమట్లు.

గీ॥ మగలమనసుల మృదురీతిఁ ♦ దగనిపనుల
నుండి మఱలించి సుగుణబు ♦ లొందవఁ జేసి
వారి శుభదేవతలుగాఁగ ♦ వరలుచుండు
కొమ్మలను నెత్తిపైఁ బెట్టు♦కొనుట తగదె?

గీ॥ ప్రబలసత్యావనాది శుం♦భద్గుణాళి
కమితయశ మొందు పూర్వర♦సాధినాథు
లందఱును స్త్రీలమహిమచే ♦ నట్లు లైరి
చంద్రమతి గలుగని హరి♦శ్చంద్రుఁ డెంత?

గీ॥ మగలకీర్తియు, విత్తము, ♦ మనసు, దేహ,
మసువు, లాత్మయు స్త్రీలవై ♦ యలరుచుండు
వారి వీ రేలవలయునో? ♦ వీరి నేల
వలయు వారో? యెవ్వరు చెప్ప♦వలయు నింక!

మో—(తనలో) ఆహా! విచిత్రోపన్యాసము. ఆఁడుది పురుషునకు విధేయయై యున్నఁ బురుషునికి ఘనతయుఁ, దద్వ్యతిరేకయై యున్న నీచతయు నెంతయైన నున్నవి!

గీ॥ పడఁతి వెలలేని దీశు స♦వ్యస్థయైన
దశగుణాధికుఁగాఁ జేయుఁ, ♦ దద్విధాన్య
యైన శతగుణాధమునిగా ♦ నాచరించు,
నొకటి ముందు, వెనుక సున్న ♦ యున్నయట్లు.

వసం—ఇది గాక—

గీ॥ సరససహధర్మచారిణీ♦సాహచర్య
సంపదయె లేక పురుషుఁడు ♦ సత్క్రియాచ

రణ మెటులు కాంచు, జ్ఞానసామ్రాజ్యపదవి
యెట్లు లభియించు, భవముఁ దరించు టెట్లు?

గీ॥ తత్ప్రవిమలోపకారనిస్తంద్రభావ
లట్టివారల నే రీతి నాదరింప
వలయునో చెప్పవలయునె వస్తుతత్వ
మునను బురుషునికంటెను ముదిత యధిక.

కోకిలా! నే నదృష్టవంతుఁడనై నారాష్ట్రమును బొందుట తటస్థపడినను,

గీ॥ ఉర్విజనులకు ముదమిచ్చి యున్నతగతి
నుండ నేను, నాపైని నీ వుండి, నాకు
సౌఖ్య మిడు; భువి నలరించు చందమామ
కళకుఁ గళనిచ్చు దినమణికాంతిఁబోలె.

మో—(తనలో)

గీ॥ బ్రతుకు బద్ధత, గొందిలోపల నతంబు;
పలుకు లవిచూడ రాజ్యంబు లిలయుఁ జంద్ర
తరణి మండలములు గూడ దాఁటె; వ్యర్థు
నాశలకుఁ జోటుగలదె బ్రహ్మాండమందు?

కో—వసంతా! రాష్ట్రమును బొందఁగలనను ధైర్యము నీ కున్నదా?

వసం—మన బుద్ధు లెంత! మన ప్రయత్నము లెంత! మన ధైర్యము లెంత! బద్ధుఁడనైన నేను నీ కొఱ కేమి ప్రయత్న మొనర్చితిని? నే నే మంత యున్నతధైర్యుఁడనై యుంటి నని యీ యంద రాని కొమ్మ నాచేతి కిట్టె యందినది!

(కోకిల కుడిచేయిని యినుప స్తంభములగుండ గ్రహించును.)

మో—(తనలో) ఆహా! ప్రమాదము సంభవించినది. ఈతఁడు కోకిలాహస్తము నయోమయశలాకల మధ్యముననుండి లాగి గ్రహించినాడు. ఆహా! ఇది యెంత టక్కులాఁడితనముఁ గనఁబఱచుచున్నది!

గీ॥ మొగ మెడమ కిట్టు త్రిప్ప జా♦ఱ్ముడి కుడిబుజ
మునను వ్రేల శ్రవణపుష్ప♦ములు నటింప
నెడమచేతను గుడిచేతి ♦ నొడిసి లాగు
కొనుమిషమున ముందునకె తాఁ ♦ జొనుపుచుండె.

హా! నే నెట్టి మందభాగ్యుఁడను! నా కర్హమైన యానందమును వేఱొకఁడనుభవింప గుడ్లు మిడుకరించుకొనుచుఁ జూడవలసి వచ్చెను. హా! ప్రారబ్ధము. కోకిలా!

గీ॥ నీకరం బాతఁ డదుముఁగ ♦ నీవు నతఁడు
మోదభూమోదయమున నుప్పొంగుచుంద్రు,
మీఁదు చేతులే కవగూడి ♦ నాదు గొంతు
నొక్కినట్లుండ నుక్కిరి♦బిక్కి రగుదు.

వసం—కోకిలా! నావంటి మందభాగ్యుని గోరుటచే నీహస్తమున కింత వఱకుఁ గారాప్రవేశయోగము తటస్థించెను.

కో—(తనలో) ఇప్పటివఱకు నా దేహమున ధన్యమైన భాగ మదియే.

వసం—క్రూరములైన యీ యాయస స్తంభముల నిరోధమున నీ చెక్కుల ముద్దుఁగొనఁజాలను. ఈ చేతినే చుంబింతును. క్షమింపుము. (అట్లు చేయును.)

మో—(తనలో) హా! అదృష్టదేవతా! ఎంత విపరీతచర్యఁ గలదానవు!

వసం—మంగళరేఖాకలితమైన నీ పాణిపుండరీకమును గ్రహించుటకు నే నెంత తగనివాఁడనయ్యు నఘటనాఘటనచణుఁడైన పరమాత్మునియాజ్ఞ యిటు లున్నది. ఇదియే పాణిగ్రహణ మంగళ మహోత్సవము. (చేతిని హృదయమున నుంచుకొని)

గీ॥ హృదయమ! శమించు మీవు వ♦రించుదాని
పాణిచే హాయిగా స్పృశిం♦పంగఁ బడితి!
ఏది లభియింపరానిది ♦ యెంచినావొ
యదియె నీపాలిదైవమె ♦ యాదుకొనియె.

కో—(తనలో) ఆనందముచే నవశత నొందుచుంటిని.

భ్రి—కోకిలా! మీ యిద్దరి సమాగమము నాకు సంతోష మిచ్చుటకు మాఱుగ దుఃఖమొసఁగుచున్నది.

మో—(తనలో) భ్రమరికా! వీరి యనుబంధ మింతమట్టునకైన నేల వచ్చిన దని నే నేడ్చుచున్నాను. ఇంతకంటెను హెచ్చుట కవకాశము లేకపోయె నని నీ వేడ్చుచున్నావా?

వసం—వెఱ్ఱిదానా! దైవాభిసంధి యిప్పటి కింతయే. ఎక్కడ కక్కడకే సంతోషింపవలయును. ఈమాత్రమైన లభించు నని నే ననుకొంటినా?

మో—(తనలో) కా కేమి? దొంగకు దొరకినంతతోడనే తృప్తి.

భ్రి—మీ రిద్దఱు వేఱువేఱుగ—

వసం—మీరు—ఇద్దఱు—వేఱు—అని చెప్పకుము.

గీ॥ ఏ మొకటియె, యీ యుద్దుచే • నిద్దఱముగ
దోచుచున్నార; మద్దు పోఁ•దోయ వస్తు
వొక్కటియె; ద్వంద్వవిభ్రాంతి•నొసఁగు మాయ
మాయమైన నున్న దొక బ్ర•హ్మంబుగాదె!

మో—(తనలో) హా హా! ఎన్నిరసములు! శృంగారములో వేదాంతము! అమితాశలో సంతుష్టి! స్త్రీవాంఛలో నింద్రియనిగ్రహము.

కో—వసంతా!

భ్రి—అమ్మా! ఇఁక నాథా యని పిలువవచ్చును.

కో—ఈ కారాబంధవిముక్తి నీ కెట్లు కలుగు నని యున్నది.

వసం—దైవసాహాయ్యముచేత—

కో—నా కొక్క యాలోచనము తోఁచినది. చెప్పనా?

వసం—అభ్యంతర మేమి?

మో—(తనలో) అ దేదియో సావధానముగ వినవలయును.

కో—రా జార్బకుఁడవు నుదారగుణుఁడవు నగు నీ కీ బంధము తగదని నీభంధవిమోచనమునకై నే నిదివఱకే యాలోచించితిని. ఒక తాళ్లనిచ్చెనఁ జేయించి యుంచితిని. అది యొకకొనను దక్షిణ పుదిశనున్న గవాక్షమునకుఁ గట్టి, రెండవది యీనీపవృక్షశాఖకు గట్టవలయును. దానిమీఁదుగ నీ వవలీలఁగ వెలుపలికి రావచ్చును. దానిని తేవు నీకుఁ బంపెదను. దాని రెండవ కొనను జెట్టునకు నేను గట్టింతును.

వసం—కోకిలా! నే నొక్కఁడనే పోవలసినదా?

కో—బంధవిముక్తి నీకుఁగాక నా కేమి?

వసం— ఆ బంధవిముక్తితో నా కీ బంధవిముక్తి కూడనా? అటులైన నాకుఁ గారామోచనము వలదు. నీవు కూడ నాతో నారాష్ట్రమునకు వచ్చునెడలఁ గలిసి పోవుదము నీ కెప్పు డవకాశముండునో నాకుఁ దెలియఁజేసిన నే నప్పుడా తాళ్లనిచ్చెన నుపయోగించెదను. కోకిలా! దయయుంచి రమ్ము. వచ్చెదవా? మాటలాడ వేమి? భ్రమరికా! నీవు దాని "నూ" యని పింపవా?

భ్ర—ఒక రనిపింపనక్కఱలేదు. తా నన నక్కఱలేదు. అనినట్లే. నే నందులకుఁ బూఁటగా నుందును.

మో—(తనలో) హా! వినఁదగినమాటలు వినఁబడినవి. కోకిలా! నిన్నెట్లు స్వాధీనగఁ జేసికొందు నని యింతవఱకుఁ దపించుచుంటిని. ఇఁక నీజుట్టు నాచేతఁ జిక్కినది. వసంతుఁ డేమో మాటలాడఁబోవునట్లున్నాఁడు.

వసం—ఏమి? కోకిలా! అంగీకరించినట్లేనా?

కో—భ్రమరికా! నీవు గూడ వచ్చెదవా?

వసం—సెబాస్!

గీ॥ కాంత! నీతండ్రిచే నాకుఁ గల్గినట్టి
బంధసంక్షోభ మింక నీవలన శాంతిఁ
బడయుఁ, గర్మముచేఁ గల్గు బంధబాధ
జ్ఞానకళను బటాపంచలైనయట్లు.

మో—(తనలో) ఎవని కర్మమువలనఁ గలిగిన జ్ఞానము వానిబంధమోక్షణమునకుఁ గారణమై యుండఁగ నిట్టు లనుచున్నాఁ డేమి? తనకు నొకనికి భేదములేని యద్వైతముగదా!

భ్రి—అమ్మా! నీ కనురూపయౌవనసంపన్నుఁ డగు పతి లభించెను; కనుక నీ వతని రాష్ట్రమునకుఁ బోవుచున్నావు. నా కే మున్న దని రావలసినది?

మో—(తనలో) పరరాష్ట్రమందైన బానిసకుఁ బతియును, వాయసమున కన్నమును దొరకక పోవునా? నీవుకూడ నడువుము.

కో—భ్రమరికా! నీవు రాక తప్పదు. నిన్ను వదలి యుండఁగలనా?

భ్రి—నే ననఁదగిన మాటలు మీ రనుచున్నా రేమి?

కో—సంతోషమే! నాథా! ఎల్లుండి రాత్రి యీనపక్షిపుండల మామిచెట్టుమీఁదికి వచ్చినపుడు నే నీ కడిమిచెట్టుక్రింద నీకొఱకుఁ గనిపెట్టి యుందును. భ్రమరికా! నీవు నాయొద్ద నుండవలదు. గ్రామదేవతయాలయమునకుఁ దూర్పున నుండు తాళవనమున నీ వుండవలయును. నిన్ను మేము గలిసికొందుము. ఏమార్గమునఁ బోవలయునో మనము తరువాత మాటలాడుకొందము. వసంతా! నా కిప్పటికి సెలవా?

వసం—కాని, దొంగతనమునఁ బారిపోవుట నాకు గౌరవహానికాదా!

మో—(తనలో) ఇది యొక రసభేదము. బింకములు పలుకుచున్నాఁడు.

కో—నీ నెఱుఁగకుండ నిన్ను నాతఁడ్రి యిక్కడి కెట్లు తీసికొని వచ్చెనో, నాతండ్రి యెఱుఁగకుండ నన్ను నీ వట్లే తీసికొని పోవుటలోఁ దప్పు లేదు.

వసం—నీయిష్టానుసార మాచరింపుము.

కో—సరే! నేను పోవలయును.

వసం—వెళ్ళెదవా? తిరిగి నీ దర్శన మెప్పుడు?

కో—ఎల్లుండి రాత్రి.

మో—(తనలో) కాదు. పునర్జన్మమునసేమో!

వసం—నీ చేతి నొకసారి ముద్దుగొందును. దుఃఖమునఁ జిరకాలము నుండి తపించిన నాకన్నుల కమృతాంజన మగునట్లు నీచేతిని గనుల కద్దుకొందును. (అట్లుచేయును.)

కో—నేను బోయెదను. ఎల్లుండిరాత్రి—

వసం—మఱతునేమో యని తిరిగి చెప్పుచుంటివా? ఇదివఱకు జరిగిన సంవత్సరము లెంతదీర్ఘములో యంతకంటె నీపరిమితి దీర్ఘతరము గనుండునుగదా! ఈరాత్రి—రేపు—రేపురాత్రి—ఎల్లుండి—ఎల్లుండి రాత్రి—అబ్బ!

మో—(తనలో) ఇదివఱ కమితశాంతము నోర్పును గనఁబఱచిన యీతఁ డిప్పుడు సంభ్రమపడుచున్నాఁ డేమి?

కో—ఇదిగో! వెళ్ళుచున్నాను. ఇదివఱకే యాలస్యమైనది. నీవుకూడ రా! (భ్రమరిక; కోకిల నిష్క్రమింతురు.)

వసం—హా! ఇఁక నాకన్నులకుఁ జీకటియే; పోయి శయనింతును.
(నిష్క్రమించును.)

మో—ఆకడిమిచెట్టు తోట్రులో డాఁగి యెల్లుఁడిరాత్రి కోకిల వచ్చు వెంటనే యామెను గ్రహించుకొని పోదును. కాని నేను వలచినది—కాదు. నన్నువలచినది బుద్ధిమతి యను నొక కన్య గలదు. దానిని వదలిపెట్టిపోయెదను. వదలిపెట్ట నేల? నేను గోకిలను గ్రహించి వెడలిన తరువాత నాతోటి నిచ్చెనను గదుపుమని దానితోఁ జెప్పెదను. దానిని జూచి చీఁకటిచాటునఁ గోకిల యనుకొని వసంతుఁడు దానితోఁ బోవును. ఇంకను మఱి

కొన్ని యావశ్యకములైన సంగతులను బుద్ధిమతితోఁ జెప్ప వలయును.

గీ॥ తనదు విద్య నొకని కిచ్చి • తా గ్రహింప
వలె నొకని విద్య యందు రసికులగు నాదు
వనిత నతని కిచ్చి యతని • వనిత నేను
సరసమోహనరణిని • సంగ్రహింతు.

ఈరీతిగా నాకుఁ బ్రియాగ్రజమే కాక పీడావిసర్జనము కూడఁ గాఁగలదు. కోకిల కసహ్యుఁడైన వసంతునిపైఁ బ్రేమము. నాకుఁ గోకిలపై ననురాగము. నన్నుఁ గోకిల యెఱుఁగదు. బుద్ధిమతికి నాపై ననురాగము. నాకు దానిపై నుదాసీనత. ఆహా! దైవదుర్విపాకదార్ఢ్యము! కాని యేమగునో చూచెదను. అల స్యమైనది. పోవలయును. ఇదివఱకుఁ గోకిలావసంతసంబంధ మైనది. ఇఁకముందుఁ గోకిలామోహనసంబంధము గావలసి యున్నది.

(నిష్క్రమించుచున్నాఁడు.)

ఇది ప్రథమాంకము.



శ్రీ

# కోకిల.

## ద్వితీయాంకము.

[ప్రదేశము — అరణ్యము.]

[ప్రవేశము — కోకిలామోహనులు.]

కో—ఇది నీకుఁ దగదు.

మో—నీవు తగినపని జేసినపుడుగదా, నీవు న న్నధిక్షేపించవలసినది!

కో—నేను దగనిపని నేమి యొనర్చితిని?

మో—అంతఃపురములలో నుండఁదగిన మహారాజపుత్రికవైన నీ వీ మహారణ్యమున కేల వచ్చితివి!

కో—నీవు తీసికొని వచ్చుటచేత.

మో—అసత్య మాడుచున్నావు. నేను నిన్ను రమ్మంటినా?

కో—రమ్మంటి వని నేనుమాత్ర మంటినా? నీవు నన్నుఁ దీసికొని రాలేదా?

మో—నేను నిన్నుఁ దీసికొని వచ్చితినా? ఈచేయిపట్టుకొని, ఈచేల చెఱఁగు గ్రహించి 'రా' యని తీసికొని వచ్చితినా? తెల్ల వాఱులోపల మన ప్రయాణములో నొక్కమాటనైన నాడి తినా? న న్నేల నిందింతువు?

కో—నీవు మౌనకాఁడవై మాట లాడకుండ నాముం దేల నడచుచు దారిఁ జూపవలయును?

మో—నీవు వెనుక వచ్చుచుంటివికాన నేను ముందు నడచుచుంటిని. నీకు దారి తెలియ దని నేను జూపితిని. ఇది నాదోషమా? కాని, నీవు నావెనుక నేల వచ్చితివి?

కో—నీవు మంచివాఁడ వనుకొని—

మో—అనఁగ?

కో—నా కిష్టమైనవాఁడ వనుకొని—

మో—ఇష్టుఁడైనవాని ననుసరించుట నీ కెట్టు లుచితమో, నా కిష్టమైన ని న్నాశ్రయించుట నా కట్టు లుచితము కాదా?

కో—నీకు నాపై నిష్ఠతయుండునేమోకాని నీపై నాకు మనసు లేదని నీ వెఱుఁగవా?

మో—నీస్వభావము నే నెఱుఁగనా? ఉన్న నున్నదని చెప్పుదువా?

గీ॥ ఆఁడువారి కాదనుట కౌ ♦ ననుచు, వలద
నుటకు వలయు ననుచుఁ, బొమ్మ♦నుటకు రమ్మ
టంచు, నూహుఞ్హనుట కూఁ ♦ యటంచు నర్థ
మని యెఱుఁగనె? స్త్రీమర్మజ్ఞుఁ♦డైన నేను.

కో—ఎందుల కట్టులు బహుమానించుకొందువు? నేను ద్రికరణశుద్ధిగఁ జెప్పుచున్నాను. ఈసూర్యనారాయణమూర్తితోఁడు; నాయనురాగము నీపై లేదు.

మో—ఇది న్యాయమా!

కో—కా కేమి?

మో—ఒకఁ డొకనికి ధన మిచ్చినాఁడు. వినుచున్నావా? ధనగ్రాహియగువాఁడు ధనదాతకుఁ దిరిగి ధన మీయ నక్కఱలేదా? మాటలాడ వేమి?

కో—అయిన నేమి?

మో—నాయనురాగము నీ కిచ్చితిని గాదా?

కో—నే నిమ్మంటినా?

మో—లేదులే. ఇచ్చితినిగాదా? తిరిగి నీయనురాగము నా కీయ నక్కఱలేదా?

కో—నేఁగోరకుండ నీవిచ్చినయనురాగ మిదుగో! గిరదిరఁ ద్రిప్పి నీమొగమున వైచుచున్నాను, పో! మోసకాఁడా! నీదారిని నీవుపో! హా దైవమా! నాగతి! యిట్లు చేసితివా?

మో—అదే మంచిది. ఆతలఁపే సర్వోత్కృష్టమైనది. నీవు వసంతుని తోఁ బోవుటకుఁ యత్నింప నది భగవంతుని కంగీకారము గాక నిన్ను నాతో నిటకుఁ బంపినాఁడు. నాయిచ్ఛయు దైవేచ్ఛయు నేకీభవింపని దీవు నేను నేల యేభకీవింపరాదు?

కో—మూర్ఖుఁడా! వసంతుని సహధర్మచారిణినైన నన్నిట్టిమాట లాడఁదగునా?

మో—హా! హా! పరదార వని సందేహింపు మంటివా? ఏమి! అతని సహధర్మచారిణివా? అబ్బ! నిన్నరాత్రి రెండుయామముల వఱకుఁ గారాబద్ధుఁడైనవానికి ధర్మదార వెట్లయితివి?

కో—ఎటులా? పాణిగ్రహణముచేత.

మో—నీకు నతనికిఁ బాణిగ్రహణమా? నీచేతిని భ్రమరిక యెన్నివ్రాలులు గ్రహింపలేదు. దానికి నీవు భార్యవైతివా? పద్మభ్రాంతి నీచేతిపై భ్రమరము వ్రాలిన నది నీకు భర్తయగునా? అటులే—

కో—అటులే యెటులు?

మో—నీచుఁడైన వసంతుఁడు—

కో—రాజబాలకుఁడు నీచుఁ డెట్లగును?

మో—కారాబద్ధుఁడు కాఁడా?

కో—అయిన నేమి? ఆతనిదోషమున నతఁడు బద్ధుఁ డయ్యెనా?

మో—ఆతఁడు నిర్దోషుఁడై యుండవచ్చును.

కో—ఉండవచ్చు నన్నసందేహ మేమి? ఆతఁడు నిశ్చయముగ నిర్దోషుఁడు. సర్వవిద్యాపారంగతుఁ డగు రాజాంభోజుఁడు నేనుఁ బరిశుద్ధనైన కన్యను; రాజపుత్రికను. 'నీకు నతనికిఁ బాణిగ్రహణమా?' యని యధిక్షేపించితి వేల? ఇందున దక్షేపించు మున్నది?

మో—గీ॥ అతఁడు నీవు నిర్దోషులై • యలరవచ్చుఁ
గాని మీకలయిక దోష•కలితమె యు
న పరిమళసారజనకనీ•రానిలములు
గలసి దుర్గంధివస్తువు • గాఁగఁ గావె?

కాని కోకిలా! మీసమాగమము దోషమని నీకుఁ దోఁచకుండినయెడల నర్ధరాత్రమున నేమి? పుష్పవనముల విహారములేమి? తస్కరసంభాషణము లేమి? జాల కట్టులమధ్యమున నుండి పాణిగ్రహణము లేమి? రజ్జునిశ్శ్రేణికాబంధము లేమి? పగలు లేదా? కార్తాంతికు లగు బ్రాహ్మణులు లేరా! సామ్రాజ్యధురంధరు లగు వరులు లేరా? నివాసమున కంతఃపురము లేదా? ని న్నొకని కిచ్చుటకు నీతండ్రి లేఁడా? మంగళవాద్యములు లేవా? దీపావళీశోభ లేదా? మహదాశీర్వచనములు లేవా? జీబు రని భయంకరమగు చీఁకటిలో గుడ్లగూబలు తోఁట్టలలోఁ గూయఁ, జీకురువాళ్ళు చెవులుపగుల రొదఁ బెట్ట, మీరు కిచకిచ లాడుచు నినుపకణికెలగుండఁ జుంబనములా? ఇది తప్పని నీ వెఱుఁగ వేమి? ఎంతముద్దరాలవు!! మహాసన్నిపాతరోగికి నడుమ నడుమ తెలివి వచ్చిన ట్లప్పుడప్పుడు వెలుతురు నిచ్చు మిడుఁగురుఁబురుగులగముల సాహాయ్యమున మీ విచిత్రచరిత్ర మంతయు నేను నాలుగుదినములక్రిందటఁ గనిపెట్టలేదా?

కో—హా! వజ్రహృదయా! దొంగతనమున నాయుపవనముఁ జేరి, మేమాడుకొనినమాటలను దొంగతనమున విని, మాసంకేతస్థలమున దొంగతనమునఁ బొంచియుండి నేను నాప్రాణనాథునికొఱకు రాఁగా దొంగవేసమున నన్ను మోసపుచ్చి దొంగలలో నగ్రగణ్యుఁడై నదొంగవై యుండియు నేను దొంగ నని దూషించుచుంటివా? నీ వింతతప్పుఁ జేసియు నేఁ దప్పుఁ జేసితి నని నన్ను నిందించుచుంటివా?

మో—పోనిమ్ము. నీదియుఁ దప్పే, నాదియుఁ దప్పే. నీదియు దొంగతనమే, నాదియు దొంగతనమే. నేను నిన్ను నిందింపవలదు. నీవు నన్ను దూషింపవలదు.

ఆ॥ వె॥ నీదుదొంగతనము ♦ నీ తప్పు, దోషంబు,
నేను జేయువాని ♦ నెనసి యడఁగె;
నట్టితప్పుఁజేసి♦నట్టివారము మన
మేల కూడి శాంతి ♦ నెనయరాదు ?

కో—హా! ద్రోహీ! నాకొంప నిల్లు తీసితివా?

మో—కొంపఁ దీయలేదే? అసత్య మాడుచున్నావు. నిన్నొక్కయింటి దానిఁ జేసి నీకొంప నిలువఁబెట్టి నీభృత్యుఁడనై నీసన్నిధిని నే నుండి—

కో—ఇఁకఁ జాలింపుము. హా! ఎంతపాపమున కొడిఁగట్టితివి? భార్యాభర్తల నెడఁబాపితివి కదా!

మో—నే నిక్కడ, నీ వక్కడ నుండఁగ నెడఁబా టేమున్నది? ఈమాత్రపుదూరమే నీ కెడఁబాటుగఁ దోఁచునంతటి యనుగ్రహము నీకు నాపై నుండ, నిదిగో సమీపించుచుంటిని.

కో—ఏమి యసందర్భప్రలాపములు! నీకు భార్య యెవతె?

మో—ఏమీ! నిన్ను నీవే యెఱుఁగవా?

కో—ఓ యున్మత్తుఁడా! నీకు నేను భార్య నగుదునా?

మో—నాప్రార్థన మందులకే కద! నేను వల దందునా?

కో—నోటికి వచ్చిన ట్లేల వదరెదవు? నేను నీకు భార్య నగుదునను వ్రాఁతయైన నీ కెవ్వ[illegible]న నున్నదా?

మో—ఎప్పటికో యన నేల! దైవానుగ్రహ మున్నయెడల నిప్పుడు కాఁగూడదా! నీదయ యున్నయెడల నిప్పుడు కాఁగూడదా! నాయదృష్ట మున్నఁ గాఁగూడదా! అదిగాక నీవు నా కిదివఱకే భార్య వైతివి.

కో—ఛీ! ఛీ! అ దెట్లు?

మో—కృష్ణునకు రుక్మిణి భార్య యైనట్లు.

కో—రాక్షస వివాహముచేతనా?

మో—కా కేమి?

కో—ఇది రాక్షసకృత్యమే కాని యిందు రాక్షసవివాహ మేమున్నది? రుక్మిణీకృష్ణుల కన్యోన్యానురాగము కలదు. తన్ను రాక్షస వివాహమున గ్రహింపు మని రుక్మిణి శ్రీకృష్ణునికి సందేశముఁ గూడఁ బంపెను. అందుచేతఁ గృష్ణుఁ డట్లు చేసెను. ఇక్కడ నీ రాక్షసకార్య మెట్లున్నదో చూడుము. నీపై నా కనురాగము లేదు. నన్నుఁ దీసికొని పొమ్మని నానాథుఁ డైన వసంతునికి నేను సందేశముఁ బంపితిని. అది నీవు దొంగతనమున విని నా నాథుఁ డుండఁదగినస్థలమున నిలిచి నీవే నానాథుఁడ వని—

మో—సెబాస్! కర్ణములు పవిత్రములైనవి. ఏ మంటివి? నీవే నా నాథుఁడ వని—

కో—నేను భ్రమించునట్లు—

మో—భ్రమించునట్లు కాదు. రమించునట్లు—

కో—నటించి—

మో—నటించుట యేమి? మనఃపూర్వక గంభీరానురాగమునకు నటన మేమి? కావున, 'నీవే నానాథుఁడ వని భ్రమించునట్లు నటించి' యని పలుకుట న్యాయమా? నీవే నానాథుఁడవై యను సుధా మధురాలాపముల వచియింపవలయును.

కో—పరమనీచుఁడ వైన నీ వెక్కడ! అత్యున్నతాంతఃకరణపవిత్రుఁ డగు వసంతుఁ డెక్కడ! నానాథు డైన వసంతుఁడుగ నీవు కాఁగలవా?

మో—అగుట కేమి? అసాధ్యమా! నీనాథుఁ డుదారహృదయుఁడే కానిమ్ము. నేను నీచుఁడనే కానిమ్ము అయినను,

గీ॥ చల్లచల్లఁగ దరిఁజేరి ♦ చాన నీదు
వరునిస్థానంబు నెపుడు నేఁ ♦ బడసినానో?
భర్త నవుడె నీ కైతిని; ♦ బంటు ప్రాఁకి
మంత్రిగడిలోని కేగి తా ♦ మంత్రి గాఁడె?

కో—ఓయవివేకీ! మంత్రి కాఁగలఁడు కాని, రాజుకాఁగలఁడా? పరసతి నిట్లు పరాభవింపవచ్చునా?

మో—నీ కింకఁ బతియే లేనప్పుడు నీవు పరసతి వె ట్లగుదువు? నాకు స్వసతియే లేనప్పుడు నీవు పరసతి వె ట్లగుదువు? నేను వరుఁడను. నీవు కన్యవు. నిన్నుఁ బరాభవముసేయుటకు నే రాలేను, పరిరంభమును జేసికొనుటకు—పరాభవించుటకు రాలేను, అనుభవించుటకు—వింటివా?

(మీఁదిమీఁదికి రాఁగఁ గోకిల దూరముగఁ బోవును.)

కో—ఆఁ! ఆఁ! దూరముగఁ బొమ్ము.

మో—(తనలో)

గీ॥ పైఁట బిగియించికొని పాణిపంకజముల
కత్తెలను గుచాభోగఁబుఁ • గప్పి, కాంచి
గల్లుమన వెన్క కడు గిడు • కాంతవిభ్ర
మమును గన దానిపైఁ బడ • మనసువుట్టు.

(ప్రకాశముగా) కోకిలా! ప్రాణప్రియా! దూరముగ నన్నుఁ బొమ్మంటివి. కాని, నీవే పోవుచుంటి వేమి?

కో—నీవు పోకపోయిన నేనైనఁ బోవలదా?

మో—ఇది న్యాయమేనా?

కో—సందేహ మేమి?

మో—సరే. కోకిలా! నీవు నన్నుఁ గౌఁగిలించుకొనుము.

కో—వంశనాశన మగు మాటల నాడకుము.

మో—వంశనాశన మగుమాటలుకావు. వంశవృద్ధి యగు చేష్టలు. నీవు నన్నుఁ గౌఁగిలించుకొనక పోయిన, నేనైన నిన్నుఁ గౌఁగిలించుకొనవలదా? (ముందునకుఁ బోవును.)

కో—ఆఁ! ఆఁ! బాలిశాధమా! ఇది యేమి?

మో—ఇది నీవు చెప్పిననీతియేకద ! నీవు చేయునిపనిని నేను జేయువల యును గాదా ? అయిన నేమి ? అది నీవు చేసినట్లే.

గీ॥ అస్మదోష్ఠముద్రను నీదు ♦ నధరపుటము
నందు 'చో' యని నే నంటింప ♦ నట్టిముద్ర
నీదె కాదె ! మత్పరిరంభ♦నిబిడగాఢ
తామహత్వము నీదె కాఁదా ? మృగాక్షి !

(తనలో) ఆహా !

గీ॥ పసిమితళతళ లొలికెడు ♦ వనితవదన
మందు మృదులారుణచ్ఛవి ♦ వ్యక్తమయ్యె ;
స్వర్ణముఖనీరమందునఁ ♦ బ్రతిఫలించు
తరుణరవికాంతి మంజుమం♦జరిని పోలె.

ఇట్టిరక్తి నాపై ననురక్తివలనఁ గలిగియుండునా ? లేక కోపమువలనఁ గలిగియుండునా ?

గీ॥ సత్రపాంగీకృతికిఁ, గోప♦జనిత మగు తి
రస్కృతికి నేకలాంఛన♦రాజి గలుగు
వరుని కేతత్పరీక్ష దు♦ష్కరము, వైద్యు
నకును మృతనాడియును శోష♦నాడిఁ బోలె.

కో—ఓ మందుఁడా ! నీకుఁ బ్రపంచమునఁ గన్యకలే లేకపోయిరా ? విలాసినులే లేకపోయిరా ! ఇది యేమి పాపము ? వసంతుని కర్త్రైన నన్ను నీ విట్లు వరించుట న్యాయమా ?

మో—(తనలో)

గీ॥ అచ్ఛమగు నీశ్వరకు లొంగ♦నట్టి త్రాఁచు,
పైనకును బడికాపులు ♦ వడని బంటు,
సతికి లొంగని మగవాఁడు, ♦ స్తుతికి వశ్య
గాని యోఁడుది యిఁకముందు ♦ గలుగవలయు.

కావున, నీమెను గొంచెము స్తోత్ర మొనరింతును. (ప్రకాశ ముగ) కోకిలా ! 'ప్రపంచమున నీకు విలాసినులే లేక పోయిరా!'

అని యంటివి. అత్యంతలావణ్యవతి యగు నీ కీర్తి యనౌద్ధత్య మతీతమైన యౌచిత్యమును సూచించుచున్నది కదా!

గీ॥ ధనము గలచోటఁ ద్యాగంబు ♦ తఱచు సున్న;
శౌర్య ముండుచోట వివేక♦సరణి మిథ్య;
విద్య గలచోట నిలువదు ♦ వినయ మల్లె;
గర్వశూన్యత చక్కని ♦ కాంత కరుదు.

ఆ॥ వె॥ సుమము లెన్నొ కలవు, ♦ సుమములలోఁ జాల
నందమైనది యరు, ♦ దందులోన
సరససురభిళములు ♦ మఱి మృగ్యములుగదా!
యటులె నీవు కాంత♦లందు భువిని.

కో—ఇఁకఁ జాలింపుము. నాసహానసౌందర్యాదులు నీవు స్తుతి సేయ వలదు.

మో—ఉన్నది యున్నట్లు చెప్పఁజాలనే! ఇఁక స్తుతి నెట్లు చేయఁ గలను? సృష్టిమహావైచిత్ర్యమువలనఁ గలిగిన యీసర్వసంపూర్ణసమిద్ధలక్షణసమన్వితావయవస్ఫురణమునకు వేఱ స్తుతి కావలయునా! స్తుతి సాధ్య మగునా!

గీ॥ ఒక్కమాదిరియౌపాట ♦ కోహహో హోలు,
తలల నూఁపుటలు, సకిలిం♦పులు, సెబాసు
లెక్కు వగు; మంచిపాటకుఁ ♦ గిక్కురనక,
కదల, కొడ లెఱుంగక యుండు♦గతియెకాదె!

గీ॥ మనసు రక్తిచే నిండ ర♦సన గదలదు,
ప్రమిద నూనెచే నిండ దీ♦పంబుఁ బోలె;
మన సటులు నిండకున్న ర♦సన గదలును
గడుపు నిండని కుక్క తోఁ♦కవలె మిగుల.

అదిగాక,

గీ॥ పూర్ణచంద్రుని మఱియింత • పొంకముగను
వట్రువగఁ జేయఁ దర మౌనె? • పక్వబింబ
మునకు మృదులత మఱియింత • మురుకావి
నొదవఁజేయుట వెఱ్ఱికాదో? మృగాక్షి!

ఇన్నిమాట లేల? కోకిలా! నేను నిన్ను సంపూర్ణముగ వలచితిని. నీవు నన్నుఁ బరిగ్రహింపక తప్పదు.

కో—ఏ మంత మీఁదిమీఁదికి వచ్చెదవు? జాగ్రత్త!

మో—జాగ్రత్త యనెద వేల? శపింతువా యేమి? (నవ్వును.)

కో—నా కట్టిశక్తి యుండినయెడల ని న్నీసరికి రూపుమాపకుందునా?

మో—నీకుఁ బాతివ్రత్యధర్మము తక్కువగుటవలననే నీ కట్టిశక్తి చాలదు.

కో—అనఁగ?

మో—ఒకపతి పేరున కుఁడినను నీవు రెండవపతిని గ్రహింపవచ్చును.

కో—హా! వసంతా! నిన్ను నమ్మికొనిన నా కెట్టిగతి తటస్థించెను?

మో—ఎట్టిగతి తటస్థించెను గాదు! ఎట్టిపతి తటస్థించె ననుము! ఓసి వెఱ్ఱిదానా! ఆతఁడు క్షత్రియుఁడు, నేనును క్షత్రియుఁడను. ఆతఁడు వసంతుఁడు, నేను మోహనుఁడను. నీవు వలచినది పేరు కాదుకదా! అయినను నీసంతుష్టికొఱకు నాపేరును విసర్జించి వసంతుఁ డను నామమును ధరించితిని. స్వచ్ఛమైన యనురాగము గల నీ వాతని తుచ్ఛమై క్షణభంగురమైన శరీరమును వరించియుం డవుకదా! ఇఁక దేనిని వరించియుందువు? నిత్యమైన యాతని యాత్మనేకదా! అట్టిచో నాత్మస్వరూపమునకు భేద మేమున్నది? ఆతఁడైన నేమి? నేనైన నేమి?

కో—ఓ పాపాత్ముఁడా! నీకుఁ దల్లికిని భార్యకును భేదమే లేదా? సోదరికి పిల్లాలికి భేదమే లేదా? ఓ యసందర్భప్రలాపా! తుచ్ఛమై, హేయమైన శరీరసౌఖ్యమునకే కానియెడల నీ వింతవాంఛాసంభ్రముఁడవై మీఁదిమీఁది కేల వచ్చెదవు?

మో.—నీ వనుమాట నేల కా దనవలయును? నాది స్వచ్ఛమైన యను రాగము కాదు; తుచ్ఛమైన కామము.

గీ॥ మనసుచేఁ జూచు రాగము, ♦ కనులచేతఁ
జూచుఁ గామ మాలస్య మో♦ర్చుకొను నద్ది;
యోర్చుకొన దిది; మృదులమా ♦ నుష్ణముగల
దది; బుసబుస పొంగి పొగగ♦లది యిదిగద!

గీ॥ ఆశను భుజించునది; లల♦నాస్థిమాంస
భోజి యిది; రాత్రి నిశ్చల♦తేజముగల
దది; పగలు రాత్రి మండెడు ♦ నిది; బిడియము
గౌరవముగల దద్ది; త♦ద్దూర మిద్ది.

గీ॥ ఆపదలనైనఁ జల్లాఱ♦నట్టి తేజ
మద్ది; వర్షార్ద్రఖద్యోత♦జాగ్నిఁ బోలె
నాపదలు రాఁగఁ జుంయిమం ♦ చాఱు నిద్ది;
మబ్బు పైఁబడఁ ద్రాటాకు♦మంటఁ బోలె.

కో.—హా! దైవమా! ఇట్టిసిగ్గుమాలిన దోషస్వభావుఁడు నీసృష్టిలోని వాఁడేనా?

మో.—కోకిలా! కామమార్గము దైవానుగ్రహప్రతిరోధక మైనది కాదు.

ఆ॥ వె॥ శాంతి నెనయుకొలఁది ♦ సంవత్సరంబులు
జరుగుకొలఁది రాగ♦సరణి హెచ్చుఁ
గాన, రాగయుతుఁడు ♦ జ్ఞానదూరుం డౌచు
నధమగతిని బ్రాఁకు♦లాడు నెపుడు.

ఆ॥ వె॥ పడుచుఁదనము జారి ♦ వాంఛలన్నియుఁ దీఱి
యంగపటిమ తగ్గి♦నప్పుడైనఁ
గామసరణి నీఱు♦గాక మానదు గానఁ
గామి జ్ఞానమోక్ష♦గామి యగును.

కావున నైహికాముష్మికాధికారమున నేను వసంతునికంటె నధికుఁడను. నా కందులకుఁ దోడ్పడిన నీకుఁ బుణ్యమేకాని పాపము లేదు. నేను మదనబాధాపరితప్తుఁడనై యుంటిని. త్వరపడు.

కో—మూఢుఁడా! నీవు నన్నిచ్చటికిఁ దీసికొని వచ్చినందువలన వసంతుఁ డెంత విచారించుచున్నాఁడో! నీవు కామించినదానిని మఱెవ్వఁడైన నిట్లు చేసినచో నీ కెంతబాధ యుండునో యాలోచించుకొనలేవా?

మో—ఆ విషయమున నా కెంతమాత్రమును బాధ లేదు. నేను వలచిన దొకకన్య గలదు.

కో—పశుప్రాయుఁడ వైన నీకు వలపుగూడనా?

మో—కాదు. నన్నే యది వలచెను.

ఆ॥ వె॥ అట్టిసతి వసంతు ♦ నంకెకు నేఁ దార్చి,
యతనికాంత నిట్టు ♦ లందినాఁడ;
సతులనైనఁ దార్చి ♦ స్వకీయాలాభ సం
ప్రాప్తిఁగనుట చిత్ర♦రాజనీతి.

కో—ఛీ! సిగ్గుమాలినవాఁడా! ఏమి పనిఁ జేసితివి! నిన్ను వలచినకాంత నట్లు త్యజించితివా?

మో—నా కుపదేశించుజ్ఞానము నీ కేల యుండఁగూడదు? నిన్ను వలచిన నన్నిట్లు నిరాకరించుట నీతికాదు. వసంతుఁ డచ్చట బుద్ధిమతితో సుఖపరవశుఁడై యుండును. మన మిద్దఱ మిచ్చట—
(మీఁదికిఁ బోవును.)

కో—(దూరముగఁ బోయి) నీవు నన్నపేక్షించినట్లే వసంతుఁడు నీకాంత నపేక్షించు ననుకొంటివా? ఆతఁ డెంతబుద్ధిశాలి! ఎట్టిజ్ఞానసంపన్నుఁడు! ఎట్టిసుగుణసమన్వితుఁడు!

మో—ఆహా! ఏమి మాట లాడుచుంటివి?

ఆ॥ వె॥ ఎట్టిబుద్ధియైన, ♦ నెట్టిపాండితి యైన,
నెట్టి జ్ఞాన మైన, ♦ నెట్టిసుగుణ
మైన నాఁడువారి♦యువలోకనాశుగ
ములను దూసిపోక ♦ నిలువఁగలదె?

ఆ॥ వె॥ తగినకాలమందుఁ ♦ దగినస్థలంబునఁ
దగినరీతిఁ దగిన♦తరుణి తగుల
వేల్పులుకుండలాల ♦ విద్వాంసుఁ డైనను
గక్కుఱితిని బడక ♦ కదలిపోఁడు.

కో—ఛీ! నీదార్జన్యమును లోకమున కెల్ల నారోపించు చుంటివా?

మో—నాకు నీవుతప్ప లోకమే లేదు. నావలపును నాయనురాగము ను నీ కారోపించు చుంటిని. (కౌఁగిలించుకొనఁబోవును.) నా యోష్ఠపుటమును నీచెక్కులకుఁ కానుక నిచ్చుచుంటిని. (కోకిల తప్పించుకొనును.) నాశిరమును నీపాదపంకజాధీనమును జేయు చుంటిని. (సాష్టాంగపడును.)

కో—(తనలో) హా! ఈనిర్భాగ్యుని మొలలో నున్న కత్తి యిపుడు నాచేతిలో నుండినయెడల వీనిశిరము ఖండించి నామానమును గాపాడుకొందును గదా?

మో—ఏమో గొణఁగుకొనుచున్నా వేమి? ఇంకను దయరాదా? (లేచును.)

కో—నీకు మరణ మేరీతి వచ్చునో యని యూహించు చున్నాను.

మో—అటు లడుగుము, చెప్పెదను. నీపైఁట చెఱఁగు నాచేతి కిమ్ము. అది నాగొంతుకకు బిగియించుకొని లోకానందమూర్తియైన నిన్నుఁ జూచుచుఁ బ్రాణముల విడుతును. (పైఁట గ్రహింపఁ బోవును.) పోకు! పోకు! వసంతునిసమాగమము నీ కిఁ జన్మము నకుఁ గాదు. ఇది మహారణ్యము. నీవు మదధీన వైతివి. నీకు ది క్కెవ్వరును లేరు.

కో—లే కేమి? పరిపాలించు భగవంతుఁడు లేఁడా?

మో—భగవంతుఁడా? ఉన్నాఁడు, ఉన్నాఁడని మాత్రము రికామాటలనోం దుటకు. మనకర్మమే మనల నాడించుచుండ భగవంతునిఁ దలఁచెద వేల? పూర్వజన్మమున నీవు నన్ను బలాత్కరించితివి. ఆ ఋణముఁ దీర్చుకొనఁగ నే నిప్పుడు నిన్ను బలాత్కరించుచుంటిని. ప్రారబ్ధమున కనుభవమునఁ గాని నాశనము లేదు. అంతే కాని భగవంతుఁ డేమి చేయును? ఆతఁడు మనకుఁ గనఁబడునా? కాలికి సాహాయ్య మగునా? చేతి కగునా? రమ్మనిన వచ్చునా? పొమ్మనినఁ బోవునా? ఆతఁ డెవ తెమాన మైన నిట్టి యవస్థలోఁ గాచినట్లు నీవు వినియుంటివా?

కో—శ్రీకృష్ణభగవానుఁడు ద్రౌపదీమానరక్షణమును జేసి యుండలేదా?

మో—ఆమాట నిజ మగునో కాదో కాని, సుభద్రామానహరణమును జేసినాఁడు. అనేక శతసహస్రగోపికామానచోరుఁ డైన జారాగ్రేసరుండు కోకిలామానసంరక్షణ మొనర్చునా? వెఱ్ఱియాన లేల పెట్టుకొందువు? నీవు న న్నంగీకరింపక తప్పదు. ఒక్క నిమిషము నా కొక్కయుగమువలె నున్నది. అది గాక నీకు మాత్ర మే మంత మంచిది? నీ ప్రాయము క్షణక్షణము ముదురుట లేదా?

ఆ॥ వె॥ ఉవిద! మాటలాడు♦చుండఁ జూచుచు నుండఁ
గాన తెలియకుండఁ ♦ గాంతవయసు
క్రమముగాఁగ జారు ♦ గడియారమందలి
నన్నయిసుకధార♦సరణిగాఁక!

ఆ॥ వె॥ ఇట్టి మొగ్గ పుట్టి ♦ యిట్టె పుష్పంబయి
యట్టె పరిమళంబు ♦ నంది యవుడె
వాడిపోదె? యబల♦ప్రాయము నట్టిదే
వృథగ క్షణమునైన ♦ విడువరాదు.

ఏదీ! ఒక్కముద్దిమ్ము! పాణిపద్మమును గ్రహింపనిమ్ము. పోనీ! పైఁట చెఱఁగును బట్టనిమ్ము. అబ్బ! అటు పోకు! చెప్పినమాట

విను. నీ కెంతమాత్రమును నష్టము లేదు. నాకు మహాసార్వ భౌమత యబ్బినట్లు. ఊఁ! (మీఁదికిఁ బోవును.)

కో—కాఱులు పేలకుము. ఇది నీకు నీతి గాదు. ఒంటరిగ నుంటి నని ధైర్యపడుచున్నావు. మీఁదిమీఁదికి వచ్చుచున్నావు. నీమగ తనము నావంటి దిక్కుమాలినదానిమీఁదనే యుపయోగపడ వలసినదా? నీవు తల్లికడుపునఁ బుట్టలేదా? నీకుఁ దోఁబుట్టువులే లేరా? ఎగిరి యెగిరి పడెద వేమి? ఛీ! నీపౌరుషము మండినట్లే యున్నది. పో! దూరముగఁ బో!

మో—వేఁటయం దనేకభయంకరాటవికమృగములఁ జంపుట పౌరుష ముగాదు. బాణానలజ్వాలలకు లక్ష్యపెట్టక, ఫిరంగిగుండ్లకు జం కక యుద్ధములో శత్రుసంహారణ మొనర్చుట పౌరుషముగాదు. ఎంత కోపదృష్టిఁ బఱపినను, ఎన్నితిట్లు తిట్టినను, ఎన్ని కేకలు వేసినను నీవంటి మహాసౌందర్యవతిని, నీవంటి యాభిజాత్యసం-పన్నను, నీవంటి మహాభిమానధన నిట్టె బాహుబంధమునఁ జిక్కించుకొనుట పౌరుషము చూడు! చూడు! ఇక్కడ నెవ్వరును లేరు. ఈలతలు చూడలేవు ఆ నికుంజములు మాట లాడలేవు ఆవృక్షములు మనకు నీడ నిచ్చును. ఈ పుష్పములు శయ్యాసౌఖ్యమిచ్చును. అనుగ్రహింపుము.

కో—సర్వాంతర్యామి యగు పరమాత్ముఁడే మనలఁ జూచుచుండుట లేదా? ఆతడు నీపై నాగ్రహింపఁడా? నీపాపమును గుర్తెఱుఁ గఁడా? నిన్ను నరకమునఁ దోయఁడా? శాశ్వతశిక్షకుఁ బాలు సేయఁడా? ఏల యింత యవివేకి వగుదువు?

మో—ఆ॥ వె॥ అనుభవింపఁదగిన ♦ యబల సన్నిధినుండ
గ్రుడ్లు మిడుకరించు♦కొనుచు నూర
కుంటకంటె నరక♦ముండునే వేరొండు
నితరనరకలోక♦మే గణింప.

గీ॥ మఱుఁగునూనెను దాఁపుదు ♦ మూఢ్వియత్నము;
తప్తశోణాయసాగ్రపు ♦ త్రళికనైనఁ
గౌఁగిలించెద నిట్టుల; ♦ కాని, ముందు
బాధలకు జంకి నిన్ను నే ♦ వదల నిపుడు.

(మీఁదికిఁ బోవును.)

కో—(అటునిటు తప్పించుకొనుచు) హా! కృష్ణా! అనాథనాథా! పాంచాలీమానధనావనధురీణ! రక్షింపవా? రక్షింపవా? హావసంతా! ప్రాణనాథా! ఎచ్చట నుంటివోయి? నీ కర్హ్వానైన నా కీర్తియపవిత్రత రానైయున్నది. ఓసూర్యభగవానుఁడా! లోకచక్షువైన నీ వీఘోరకృత్యమును జూచుచుంటివికదా! ఓమేఘమా! ఆకస్మికముగ నీ వొక్కపిడుగు నాపై రాల్పవా? ఓ నల్లకీవృక్షమా! ఫెళ్ళున నొకసారి విఱిగి నాపైఁ బడరాదా?

మో—పైఁబడఁదలఁచి యింతసేపటినుండి ప్రార్థించుచున్న నన్నుఁ జూడక, వానిని బ్రార్థింతు వేల? (మీఁదఁ బడఁబోవును.)

కో—(మొగముపై నుమిసి) ఛీ! మూఢుఁడా! ఛీ! శుంఠా! ఛీ! పశువా! నాగొంతుఁ గోయుము. నన్ను ముక్కముక్కలక్రింద ఖండింపుము. నాప్రాణము పోయినఁగాని నామానము నీకుఁ దక్కదు. శూరుఁడవైన మనుజునకే పుట్టినవాఁడవైన, నన్ను ఖండింపుము.

మో—ఆఁ! ఆఁ! అదెంతపని? (కత్తిని దూయును.)

కో—సెబాస్! ఇప్పుడు నీవు పురుషుఁడవై ప్రకాశించుచున్నావు. కానీ! సందేహింపకు. ఇదిగో! నాకంఠము నఱుకుము. విను. విను. నీకత్తిమాత్రమే కాని నీగాత్రమెంతమాత్రమును నాకు దగులఁగూడఁదు. కానీ! (రెండుచేతులు జోడించుకొని) హా వసంతా! ఇఁక నీకు నాకు నింతే! హా నారాయణా! దీనరక్షామణీ! హా రామచంద్రప్రభో! హా పార్థసారథీ!

(తెరలో) నాపేరు పార్థసారథి కాదు; విజయసారథి. ఇదిగో వచ్చుచున్నాను.

మో—(కత్తి నొఱలో వైచికొనఁబోయి తొట్రుపాటు నొందును.)

కో—(తనలో) నే నింకఁ బారిపోవుదును. హా! కృష్ణా! హా! వసంతా!
(నిష్క్రమించును.)

[విజయసారథి ప్రవేశించును.]

విజ—(మోహానుని బట్టుకొని) చెలికాఁడా! జగన్నాథా! ఇటురా! నీ వుమాత్రమే రమ్ము. భటుల నందఱ నచ్చటనే యుండు మని చెప్పుము.

మో—(తనలో)

గీ॥ రమణి కోకిల పోయె; గౌరవము పోయె;
హృదయమోద మంతయుఁ బోయె; స్వేచ్ఛ పోయె;
మగువమానంబు హరియించు మగని కిపుడు
సర్వహరుఁ డైన మగఁ డొండు సంభవించె.

[జగన్నాథుఁడు ప్రవేశించును.]

విజ—ఇంతకు ముందు బిగ్గఱగఁ బిలచినవా రెవ్వరు?

జగ—ఇప్పుడు నన్నుఁ బిలిచినది మీరేనండి.

విజ—అబ్బ! ని న్నడుగలేదు. అయ్యా! నన్ను నీవేనా పిలిచితివి?

మో—ఔను. నేనే.

విజ—కాదు. నే నెఱుఁగుదును. నీ వసత్యమాడుచున్నావు ఫిరంగిధ్వని యేదో, వింటినారిచప్పు డేదో నే నెఱుఁగ ననుకొంటివా? హాహాహా! అనేకయుద్ధములలో నవలీలగ జయ మొందిన నేను—తుపాకిగుండ్లు వర్షింప వడగండ్లవానలో దిరుగు—

జగ—దున్నపోతువలె—

విజ—మహిషరాజ మనిన నంతకంటె మృదుతరముగ నుండునుగాదా? మహిషరాజమువలె జెరలాడిన నేను—బాణపరంపరలకంటె శీఘ్రతరముగఁ బరువెత్తెడు నేను—

జగ—(తనలో) ఇంటికి—

విజ—ఏమి? జగన్నాథా! ఊరకుందు వేల? అట్టి నేను—స్త్రీపురుష కంఠభేదమే యెఱుఁగ కుందునా! యోధాగ్రేసరు లసత్యమాడువారు కారు. ఒక రసత్య మాడిన సహించువారు కారు. ఒకరిని మోసపెట్టువారు కారు. ఒకరిచే మోసపెట్టఁబడువారు కారు. వినుచున్నావా? జగన్నాథా! నిశ్చయమేకదా? కావున నీవు యథార్థమును వచింపవలయును. జాగ్రత్త! నన్నెవ్వరు పిలిచిరి?

మో—నేనే యని చెప్పితినిగాదా?

జగ—అయ్యా! దుష్టికి నాసికాపుటద్వయముగాక శ్వాసరంధ్రద్వయము మఱియొకటి యున్నట్లితనికిఁ బురుషకంఠముగా స్త్రీకంఠముగూడ నొకటి యున్న దేమో?

విజ—హాహాహా! జోడునాళికుల తుపాకివలెనా? ఎవతెయో దుఃఖాక్రాంతయైనది—ఆపత్పరిరక్షణమును గోరి యాక్రోశించునది—అట్టి కాంత నన్నుచ్చైకంఠయై పిలిచినది కాదా? అది యెవతె? చెప్పెదవా లేదా? ఇదిగో! కత్తి. చూచితివా? అనేకసహస్రశిరఃపరికర్తనప్రవీణము. జాగ్రత్త!

మో—అదియే నాభార్య.

జగ—నీభార్య పిలిచియుండఁగ నేనే పిలిచితి నని యేల పలికితివి?

మో—నాకును నాభార్యకును భేద మే మున్నది?

విజ—హాహాహా! దంపతులా? దంపతు లనఁగ నెట్టివా రనుకొంటివి? జగన్నాథా! విల్లును నారియువంటివారు. ఏకగాత్రసహితులు. ఎవరిభార్యను వారు మందలించుకొనిన మనయాక్షేపణ మే మున్నది? సేనాధిపతికైన సతిపై మగనికంటె నెక్కువయధికార మున్నదా? కాన నీతని విడువవలసినదే.

జగ—అయ్యా! తొందరపడకుఁడు. సతి మగనిసన్నిధి నాపన్నయై యుండునా? మగువకు మగనికంటె సంరక్షకుఁ డెవ్వఁడు? ఆమె భా

ర్యమే యైనయెడల మగని విడిచి యేల పారిపోయి యుండును? కాన భార్యయని యాతఁడు వచించుమాట యసత్యము. దేనినో యంకించుకొని వచ్చి యీమహారణ్యమున బలాత్కరించుటకు యత్నింప నామె దిక్కుమాలినదై మొఱ వెట్టినది. మీరు రాఁగ నా యాపత్తునుండి విడుదలయై బ్రతికినది కావునఁ గాలుకొలఁది పారిపోయెను.

విజ—హాహాహా! బాగుగఁ జెప్పితివి. నేను వచ్చునరి కీతఁడు తొట్రుపాటుతో నటునిటు పలాయనమై పోవుటకు యత్నించుచు నదివఱ కొఱనుండి పెఱుకఁబడినకత్తిని దొందరతో నొఱలో నిముడ్చుచుండెను. మిత్రమా! కాంతాబలాత్కార మెప్పుడు కర్తవ్యమో నీ వెఱుఁగుదువా?

జగ—అంగీకరింపనప్పుడు—

విజ—అది సరిలే. యుద్ధానంతర మది యంత దోషము కాదు. అది మాకును మాభటులకును గొంత యలవాటే. కాని యిది యేమి? ఇప్పు డేమి? బల్లెములు గోడలఁ బట్టుకలుదీర్చియుండఁ, గత్తు లలంకారములకై యవలగ్నబంధముల వ్రేలాడఁ, దుపాకులు మూఁగలై యుండ, శతఘ్నులవదనములందుఁ బిచ్చుకలు గూండ్లువెట్ట, నిప్పు డేమి? స్త్రీలకు బలాత్కారము లేమి? ఆఁ! తను వెఱుఁగని తాండవము లైపోయెను. మాటలాడ వేమి? నీ వేల బలాత్కరించితివి?

జగ—బలాత్కరించినకారణ మేదియో తెలిసియే యున్నది. బలాత్కరించినఫల మేదియో యింకఁ దెలియఁదగి యున్నది.

విజ—ఈతఁడు మాటలాడఁ డేమి?

జగ—ఈతనికిఁ జేఁపకువలె నోరు తెరచి యుంచినయెడల నూపిరి యాడక మరణము సంభవించునేమో?

విజ—మిత్రమా! ఈతని మనరాజధానిని గారాబద్ధునిఁ జేయవలయును. ఆచెట్టుక్రింద నిలిచియుండు నిద్దరుభటు లీతని మనపురమ

నకుఁ గొనిపోవలయును. ఈతనిని నీవు వారియొద్దకుఁ గొనిపో వారికి నొప్పఁ జెప్పుము. సేనాధిపతి యాజ్ఞ యని చెప్పుము.

జగ—సరే!

మో—(తనలో)

గీ॥ సతిని బలవంతముగఁ బట్టి ♦ సాహసించు
నేను బలవంతముగ గ్రహి♦యింపఁబడితి,
బంధ మెడబాసిన వసంతుఁ ♦ బాడుసేయఁ
దలఁచి బద్ధుఁడనై పాడు♦పడితి నిపుడు.

గీ॥ మత్కరనిగాఢబద్ధయా ♦ మగువ యబల
యట్టె యెగిరిపోయెఁ; బటుదృ♦ఢాంగుఁడ నగు
నేను జిక్కితి; భాగ్యంబు♦లేనియప్పు
డబల యెవ్వతె? సుబలాఢ్యుఁ ♦ డనఁగ నెవఁడు?

గీ॥ కాకశూన్యమా కాటికిఁ ♦ గాంతఁ దెచ్చి
కవయఁగోరి బద్ధుఁడనైతిఁ; ♦ గాంతపోయె;
నహహా! దిక్కులేనట్టి న♦ట్టడవినైన
సత్యము జయించు; మిథ్య శి♦క్షణము నొందు.

జగ—విఫలితమనోరథుండ నైతి నని యోచించుచుంటివా? చాలు?

గీ॥ హృదయమునఁ బుట్టు నన్ని కో♦ర్కెలు ఫలింప
నిలువఁ దర మౌనె? యన్ని తేఁ♦గలును త్రొళ్ల
యిన వసుధ గ్రుంకదే?, యన్ని♦యీళ్లు పేలు
గాఁ బరిణమింప బ్రిదుకంగఁ♦గలమె! మనము.
రా! రా! (చేయి పట్టుకొని లాగును.)

విజ—ఆకాంత యెవ్వతెయో వెదకుచు నే నాకొండగోఁగు చెల్లతో పున నుందును. నీ వచ్చుట నన్నుఁ గలసికొనుము.

(విజయసారథి నిష్క్రమించును.)

జగ—చిత్తము.

(జగన్నాథుఁడు, మోహనుఁడు నిష్క్రమించుచున్నారు.)

(బుద్ధిమతి మఱియొకవైపున దూరమునుండి ప్రవేశించును.)

బుద్ధిమతి—వసంతా! ఒక్క మాట విని మఱి పొమ్ము.

వసం—(ప్రవేశించి)

గీ॥ ఎటులొ యెవరిమోసమునన్నొ ♦ యీవు, నేనుఁ
కలిసితిమి? నీవు నాకు న♦క్కరకు రావు,
నేను నీ కటులె?; బధిరుఁ♦డైన ప్రభుఁడు
కర్మగతి గాయకమణియుఁ ♦ గలిసినట్లు.

బు—న న్నింతవరకుఁ దీసికొనివచ్చినవాఁడవు నామోహనుని నాకుఁ
గనఁబఱచి మరి పొమ్ము.

వసం—నీవు కోకిల వని నన్ను భ్రమింపఁజేసినందులకు నాకోకిలను నాకుఁ
గనఁబఱచి పుణ్యమేల కట్టుకొనరాదు?

బు—హా! ప్రాణనాథా! మోహనా! హా! లోకమోహనరూపా! ఎచ్చట
నుంటివి?

వసం—హా! ప్రాణప్రియా! హా! సుగుణరాశీ! హా! కోకిలా! ఎచ్చ
టికిఁబోయితివి?

గీ॥ బంధమున నైన నీముఖ♦పద్మ మేను
గన్నులకఱవుదీర సు♦ఖమున నుండ;
నాదుప్రారబ్ధ మేమి? హా! ♦ నళిననేత్ర!
నట్టడవిపాలు సేసితి ♦ నన్ను నేఁడు.

బుద్ధిమతీ! మఱియొకసారి యడుగుచుంటిని. నిన్ను మోహ
నుఁ డెచ్చట నుండు మని చెప్పెను?

బు—నీకు నేను గనఁబడిన వృక్షముక్రిందనే.

వసం—తా నచ్చటికి వచ్చి నిన్నుఁ దీసికొనిపోవుద నని మోహనుఁడు
నీతోఁ జెప్పెనుగాదా?

బు—ఔను.

వసం—స్వేచ్ఛాశూన్యులమైన మా కితరరాష్ట్రములకుఁ బోవలసిన యావశ్యకత గాని, మీ కేల?

బు—నే నాప్రశ్న మొనరింప, నాతఁడు మాఱువలుక కూరకుండెను. ఆతని యాజ్ఞయే మహాభాగ్య మని నే నచ్చట వేచి యుంటిని.

వసం—(తనలో) మాఱు వలుకకుండెనట! ఆతఁడు మారహస్య ప్రయాణము నెఱిఁగి నాప్రాణకాంతను సంగ్రహించుకొని పోవుట కిట్లు చేసెనేమో? అట్లు చేసినఁ జేయుఁగాక! తాను వలచినదానిని నాకంటగట్టి యేల పోవలయును? (ప్రకాశముగ) నిన్ను మోహనుఁ డెంతకాలమునుండి వలచి యుండెను?

బు—నాకు జ్ఞానము వచ్చినప్పటినుండియు.

వసం—ఆతనివలపు దృఢమైనది, యథార్థమైనదేనా?

బు—మొదలే యేడ్చుచున్న న న్నిట్టిప్రశ్న మడిగి మఱింత యేల యేడ్పించెదవు?

వసం—ఆతఁడు కోకిల నెప్పుడైనఁ జూచితి నని నీతోఁ జెప్పెనా?

బు—లేదు.

వసం—నీవు కోకిల నెప్పుఁడైన జూచితివా?

బు—లేదు.

వసం—నీవు న న్నిదివఱ కెన్నఁడైనఁ జూచితివా?

బు—లేదు. నీవు మోహను నెన్నఁడైనఁ జూచితివా?

వసం—లేదు. మనకు జరిగినపొరపాటే కోకిలామోహనులకును జరిగి యుండవచ్చును. నీకు, నాకు; మోహనునకు, గోకిల కీ విపత్పరంపరను దెచ్చిపెట్టినవాఁడను నేనే.

బు—ఏలాగున?

వసం—సప్తర్షిమండలము కడిమిచెట్టుపైకి వచ్చునరికి మేడదిగు మని కోకిల నా కానతిచ్చెను. అప్పటికింకను నన్నుఁ గావు గాయుభటు

లు విదురింపకుంటచే నేను గొంత యాలస్యముఁ జేయవలసి వచ్చెను. అంతలో నీవిపరీతచరిత్ర జరిగియుండును. నీకు మోహనునితోఁగలయిక యారాత్రియే యాగడియయందే యాసంకేతస్థలమందే యని నేను గలఁగంటినా? ఇంతకు నాకర్మము! నే నాలస్య మేల చేయవలయును?

గీ॥ రమ్యబహులాచ్ఛసద్గుణ♦రాజినైన
నెట్లు గర్వము నింద్యమౌ♦నట్లు సేయు;
నల్లె యెట్టిక్రియాకౌశ♦లాధికతను
నైన నలసత ధ్వంసమౌ♦నట్లు సేయు.

గీ॥ అదను గనిపెట్టి పనిసేయు ♦ నతఁడు శ్రీయు
తుండు, లేనిచో మందభా♦గ్యుండు నిజము;
తగినకార్తిని గృషిసేయ ♦ ధాన్య మొందు,
కానిచో గడ్డిఁ గఱచును ♦ గర్షకుండు.

బుద్ధిమతీ! మనము నలుఁగురము గొంచెము ముందువెనుక బయలు దేర నెంచితిమి.

గీ॥ అజ్ఞుఁడను నేను నలుగురి♦యందు నుండ
మిగులు మువ్వురకును బాధ♦దగిలె నిట్టు;
లొక్క చక్రంబునకుఁ బట్టు ♦ యూడ, మిగులు
మూఁడు బండిచక్రము లెట్లు ♦ పోవఁగలవు?

బు—వసంతా! కోకిలామోహనులు మనవలెనే భ్రమ మొంది వేరు మార్గమునఁ బోయి రనియే నీ యభిప్రాయము కాదా?

వసం—గీ॥ దంపతులు మీరు మేమును ♦ దారసిల్ల
నీవరుఁడు గోకిలను బట్టె, ♦ నేను నిన్నుఁ
బట్టితిని; తప్తలోహంబు ♦ వారిఁ జేర
నినుము వాఃప్రాణమారుతా♦లిని గ్రహించు,
జలపవన మాయసోష్ణతఁ ♦ జెలఁగిపోవు.

చెలీ! నిన్నొక్కసంగతి నడిగెదను. నీకుఁ గోపము రాదుకదా!

బు——కోపము నీరువలెఁ గ్రిందినుండి పైకెక్క లేనిదికదా!

వసం——హెచ్చుతగ్గు లేల నిర్ణయించెదవు? చూడు! నీకంటెఁ జక్కని దానిని జూచినయెడల మోహనుఁడు దానిపై మనసుదగులునట్టి యస్థిరానురాగయుతుఁడు కాఁడుగదా!

బు——నాకంటెఁ గోకిల చక్కనిదా? నీకంటె కది యెట్లుగుపడునో నానాథునికంటికి నేను నట్లు కానపడుదు నని నీ వెఱుఁగవా? నీకంటె గుణవంతుని జూచినయెడలఁ గోకిల యాతని మోహించునంతటి చంచలచిత్త కాదుగద?

వసం—క్షమింపుము. నీనాథుఁడు గుణవత్తరుఁడై నందులకు సంతసించితిని.

బు——నీకాంత నాకంటెఁ జక్కనిదై నందులకు మఱింత సంతసించితిని.

వసం——నన్ను క్షమియింపుము.

బు——ఆఁడుది మగవాఁడు నిర్జనాటవిలో నేకాంతముగనుండినను వారైక్య మొందుదురా? మన మిచ్చట నన్నియుఁ జెల్లెలువలె వేఱు వేఱుగ నుంటిమి కాదా? అటులే కోకిలామోహనులును——

వసం——క్షమింపుము. నీవు పలికినది యథార్థమే.

గీ॥ ఉవిద పురుషుఁ డెంతయుఁ గూడి యున్ననైనఁ
గంతుకోఁఱ కంచు తగుల కైక్యంబు గారు;
ప్రాణనీరానిలము లెంత బాయకున్న
విద్యుదగ్ని లేకయె మేళవింపఁగలవె?

నాకు సెల విమ్ము. పోయెదను. ఎక్కడకుఁ బోవలయునో, యేమి సేయవలయునో, యెట్లు కోకిల లభించునో యేమియు నెఱుఁగను.

గీ॥ ఏ విడీఁతఁ గొట్టుకొనుచుఁ బోవువాఁడ,
నారితో నొక్క రేవునేఁ జేరి సుఖప
డినను మంచిదే, లేకయుండినను మంచి
దే; విరహబాధఁ బాసి సుఖింతు మిగుల.

హా! కోకిలా! ప్రాణకాంతా!

బు—నీవు మగవాఁడవు. బుద్ధిమంతుఁడవు. ఎట్లైన శ్రమమొంది కోకిలను నీవు గ్రహింపఁగలవు. అప్పుడామెవలన నామోహానుని జాడలను గ్రహింపఁగొని యవకాశ మున్న నాకుఁ దెలిపి పుణ్యము గట్టుకొనుము.

వసం—మగవాఁడును, బుద్ధిమంతుఁడును నీకు మోహానుఁ డున్నాఁడు కదా! ఆతఁడు నిన్నుఁ జేరుటకు శ్రమ మొందకుండునా? ఇఁక మన మొకరితో నొకరు గలిసికొనుట కవకాశ ముండు నని నాకుఁ దోఁచదు.

గీ॥ ఏటివడిఁ గొట్టుకొని మన ♦ మిటకు వచ్చి
నార; మిపుడు మార్వడిచేత ♦ వేఁగుపడుచు
నుంటిమి; కలియుటకును వేఁ♦డుంటకైనఁ
గాని మనశక్తి యిసుమంత ♦ గలదె? యబల!

గీ॥ దుష్టుఁ డగు మరు నవిలంఘ్య♦దుర్విపాక
పాటవం బిది; నీకు నేఁ ♦ బనికిరాను,
నాకుఁ బనికిరా వీవు; హా! ♦ నాలిముచ్చు
మరుఁడు మనలను గూర్చి గో♦మహిమరీతి.

నే నింకఁ బోయెదను. హా! ప్రాణనాయికా! కోకిలా!

బు—హా! ప్రాణనాథా! మోహానా!

వసం—నీ వటు పొమ్ము, నే నిటు పోయెదను.

గీ॥ సతి యె టేగెనో? యని యి టేఁ♦డుతును నేను,
బతి యె టేగెనో? యని య టేఁ♦డ్వఁదగు నీవు;
నింతికై నలకూబరుఁ ♦ డిచట, మగని
కొఱకు మందోదరి యచటఁ ♦ గుందునట్లు.

బు—నీకాంత రంభయే కావచ్చును గాని, నాకాంతుడు రావణుఁడు మాత్రము కాఁడు.

వసం—అట్లైన మఱింత సంతోషమే. హా! కోకిలా!

(నిష్క్రమించును.)

బు—నట్టడవిలో నొంటరినై నిలువవలసివచ్చెను. హా! మోహనా! నిన్ను నమ్ముకొని యిట్లు వచ్చితినిగదా! ఎప్పటికైన నీవు నేను గలిసిన నదృష్టవంతులమే. లేనియెడల నీయడవిలోని మృగము లకు నాదేహము నాహారముగ నొసంగుదును. ఆకలిచేతను, నిద్రలేమిచేతను బడలియుంటిని. ఆచెట్టుక్రింద శయనింతును. బ్రతికి లేచినయెడలఁ దరువాతఁ జూచుకొనవచ్చును. హా! మోహనా! మోహనా! (శయనించి నిదురించును.)

(తెర వెనుక) జగన్నాథా! ఇటు. ఇటు. ఆచెట్టునకుఁ గొంత యీ ప్రక్క నొకకాంత నిదురించుచున్న ట్లున్నది.

(మఱలఁ దెరవెను:)

ఔను. నే నీవైపుననుండి వచ్చెదను. నీ వాప్రక్కనుండి రమ్ము.

(జగన్నాథుఁడు, విజయసారథి యట్లు ప్రవేశింతురు.)

విజ—ఆ॥వె॥ అదిగో! వృక్షమునకు • నటు చిఱుగంటల
కాంచి యలర బట్ట•గాలి కూఁగ
చెలువ యుండు దెబ్బ•చే నూడి యరదంబు
ప్రక్కఁ బడిన కేతు•పటముఁ బోలె.

జగ—మనము నిమ్మళముగ సమీపింతము. రమ్ము. ఈమెకన్నులు తెఱచియే నిద్రఁ బోవుచున్నది. చెవులపిల్లివలె నీమెకు ఱెప్పలు లేవా యేమి?

విజ—ఇంతకు ముందు నాచే బద్ధుఁడై మనపురమునకుఁ బంపఁబడినవా నిచే బలాత్కరింపఁబడకుండఁ బారిపోయి మానరక్షణమును జేసికొనినకాంత యిదియే దీనికొఱకే మనము వెదకుచుంటిమి కదా!

జగ—ఆమెయే యీామె యని నీ వెట్లు చెప్పఁగలవు?

విజ—నీకుఁ దెలియదు కాని, నాకుఁ దెలియదా?

గీ॥ ముంగురులు ద్రెస్సెను జడ లా•గంగఁబడిన
యలుఁగు టీఁకెలలీల: హా•రాళి, చిక్క

వడియె జానకిత్రాళ్ళచుట్టలనుబోలె;
మో మరుణమయ్యెను ఫిరంగిమోమువలెను.
అదిగాక యీమె క్షత్రియకన్యవలె నున్నది.

జగ—అది మీ కెట్లు తెలిసినది?

విజ—హాహా! నాకుఁ దెలియక పోవుట కూడనా?

గీ॥ వంగియుంగరాల్గట్టు జుల్పములు గ్రాలు,
పొడుగుకంటె నెక్కుడు వెడల్పుగల యడ్డ
ఫాన ముక్కునవ్రేలు, నిష్పవననిలయ
బంధమున గాత్ర మొక్కింత పాలిపోవు.

జగ—ఈమెకు వయ సెంతయుండునో!

విజ—ఆసంగతి యీమె లేచినఁగాని చెప్పఁజాలను.

జగ—అ దెట్లు?

విజ—నేను యుద్ధాశ్వముల వయస్సును బండ్లనుబట్టి కనిపెట్టఁగలను.

జగ—నేను మనుజుల బుద్ధిని నాలుకవలనఁ గనిపెట్టఁగలను.

విజ—చూడు! ఆమె లేచుచున్నది.

జగ—గీ॥ తనువు విఱిచి, కాళ్లుబిగియఁదన్ని, కరయు
గ్మము వెనుక సాఁచి, పిడికిళ్లు గదియఁబట్టి,
నడుము పైకెత్తి, బిగువుగఁ గుడికెడమకు
నాస్యముఁ గదల్చి, బొమలెత్తి యావులించు.

బుద్ధి—హా! మోహనా! (లేచును.)

విజ—హాహా! నాపేరు మోహనుఁడు కాదు. విజయసారథి. అయినను నీ వనుమాట యేల కాదనవలయును! యుద్ధమున నేను శత్రుమోహనుఁడను.

బుద్ధి—ఆర్యులారా! మీర లెవ్వరు?

విజ—మే మెవ్వరమైన నేమి? మాసంగతి నీకుఁ దెలియవలసిన యావ

శ్యకత లేదు: నీసంగతి నేను బూర్ణముగ నెఱుఁగుదును. ని న్నిక్కడ కీడ్చుకొని వచ్చుటయు, బలాత్కరింపఁబోవుటయు, నీవు కేకలు వైచి నరుగెత్తుటయు—

బు—అది అంతయు నసత్యము.

విజ—నీ వసత్య మనునంతమాత్రమున నే యసత్యమగునా? సత్యమేది యో నే నెఱుంగనా? జిహ్వఁ గోసినసరే సేనాధిపతు లసత్య మాడువారా? తుపాకి పేల్చి దానిపిక్క యెక్కడ పడునో అక్కడ కేగి దాని నిట్టె తీసికొనిరాఁగల నేను, నాకంటియెదుటఁ బారిపోయి దాఁగిన నిన్నుఁ బట్టుకొనలేకుందునా?

బు—మీకంటియెదుట నేను బారిపోయితినా? అసత్యము.

విజ—హాహా! అసత్యమో సత్యమో! నే నెఱుఁగనా?

జగ—ఆమె చెప్పున దేదో తిన్నఁగ వినరాదా?

విజ—హాహా! ఇఁకఁ జెప్ప నక్కఱ లేదు. విన నక్కఱలేదు. ఆమె సంగతి నాకంటె నామెకు బాగుగఁ దెలియునా? ఈమెను మన రాజాంతఃపురములోనికి నేను బంపఁ దలఁచుకొంటిని. నలుగురు భటు లీమెను బ్రాణపదముగఁ దీసికొని పోవలయును. వింటివా? ఆజ్ఞోల్లంఘనమును సేనాధిపతు లెన్నఁడును సహింపరు. నీవు మాఱుమాటాడక యీమెను నాభటులయొద్దకుఁ దీసికొని పొమ్ము.

జగ—తమయిష్టానుసారమే. మన మనుకొనిన కాంతమాత్ర మీమె కాదు. మీ రింక నామెను గొన్ని ప్రశ్నముల నడిగి సత్యమును గ్రహింపవలయును.

విజ—సత్యము, జయము మాకుఁ గరతలామలకములు. వేఱు గ్రహింప నేల? నీవు నోరు మూసికొని యూరకుండుము.

జగ—(తనలో) మొండిముండకొడుకు.

విజ—అమ్మాయీ! మారాజేంద్రునకు సంతతిలేదు. ని న్నాతఁడు పెంచుకొనును. నీ కేమియు భయము లేదు. నిన్ను జాగ్రత్తగ

నాతనియొద్ద కంపెదను. పొమ్ము. (లేఖను వ్రాయుట నభినయించి) హాహాహా! కత్తితో నక్షరనాశనముసేయు వీరునకుఁ గలముతో నక్షరసృష్టి కష్టముగదా! జగన్నాథా! ఈలేఖను రాజునకిమ్మని భటులతోఁ జెప్పుము.

బుద్ధి—మహానుభావా! నామోహనుఁ డచ్చట నున్నాఁడా?

విజ—ఎవనినో కాని యుటకుఁ బంపితిమి చూడుము! జగన్నాథా! ఇదివఱకు మనము రాజధాని కంపిన యాతనిపేరును గనుఁగొన మఱచితిమిసుమా! అయిన నేమి? ఈమెను దీసికొని పొమ్ము. చూడుఁ! భటుల కీమె నొప్పఁజెప్పి వెంటనే రమ్ము. నే నిటనే యుందును. సార్వభౌమునికిఁ గప్ప మిచ్చి వేగ మన మింటికిఁ బోవలయును.

జగ—చిత్తము.

బుద్ధి—హా! మోహనా!

(జగన్నాథుఁడు, బుద్ధిమతి నిష్క్రమింతురు.)

విజ—జగన్నాథా! శీఘ్రముగ రా వేమి?

జగ—(ప్రవేశించి) అయ్యా! వచ్చితిని.

విజ—ఇఁక మనము పోవుదము. (పరిక్రమింతురు.)

జగ—ఈదినమున నీయడవి యాఁడుపడుచుల నీనిన ట్లున్న దేమి?

విజ—అ దేమి?

జగ—అటు చూడుము. (తనలో)

సీ॥ గాఁగరాపైఁ గలం♦కారిపువ్వులగముల్
విపిన పుష్పములతో ♦ వియ్యమంద
అవికపై జలతారు ♦ జవతీవరవణింపు
గహనవల్లరులఁ జీ♦కాకుపఱుపఁ
గొంగుపక్కల హాస్తు♦కొనుచును ల్వైనకోక
ములతోడ దాఁగిలి♦మూఁత లాడ

నెడమమూపునఁ దూఁగి • పడు జాఱుముడి యాట
విక భృంగపఙ్క్తిని • వెక్కిరింప
కంకణములు గల్లు • గల్లు మనంగను
జెవుల దుద్దుజోడు • జిగజిగ మన
నంబరంబు పెటపెటాడ నీతనికనుల్
చిటచిటాడ వచ్చుఁ • జెలువ యదిగో!

విజ—ఆహా! ఎవతెయోకదా!

గీ॥ గట్టిదగు బిట్టు బిగియొడ • లగ్గలి, నున్న
నయి మిగుల గుండ్రనగు మొగ • మలరుచుండ,
రివ్వు మను వేగమున నాదు • హృదిని దూర
నిక్కడకు వచ్చును దుపాకి • పిక్కవలెను.

జగ—మీరు జంకుచుంటి రేమో! నేను మీకును దానికి నడ్డు
వడనా?

విజ—హాహాహా! యోధాగ్రేసరుఁడైన నాకు భయమా?

జగ—నిశ్చయమే.

గీ॥ వణిజునకు యథార్థత, న్యాయ • వాదికి మొగ
మోటమియు, విదూషకునకు • మాటకొంకు,
తోత్తునకు లజ్జ, సమరయో • ధునకు భయము
లేవు; గల్గినయెడ నెగ్గ • లేరు వారు.

విజ—చూడు! ఇది యుత్తమజాతికన్యవలె నాకేమో కానిపింపదు.
ఏమి కారణమో గ్రహించితివా?

జగ—మీకు దానిపై వలపు గలుగుటయే కారణము.

విజ—హాహాహా! నిజమే. ఇంతకుముం దిచ్చట శయనించిన క్షత్రియ
కన్యను జూడ నాకేమో యమితగౌరవమును, దూరమున నుండ
వలయు నను బుద్ధియు నుదయించెను. ఆమెతో సమానమైన
సౌందర్యముగలదైనను దీనిని జూడ నాకనుభవింపవలయు నను
కోర్కె వొడముచున్నది.

గీ॥ చంపకము దివ్యవాసనాసంభరితము;
దానిరీతిగ నుండు శీతఫలసుమము
కల్లువాసనగలది; తత్కారణమునఁ
జీమ దాని జేరక దీని జేరుఁగాదె!

(భ్రమరిక ప్రవేశించును.)

విజ—ఇది యెవ్వతె యని నీ యభిప్రాయము?

జగ—ఇది మగవానికంటె భిన్నమైన వ్యక్తి.

విజ—హాహా! కాదు. మగవానితో నేకీభవింపఁదగినవ్యక్తి యనుము.

భ్రమ—ఆర్యులారా! మ్రొక్కుచున్నాను.

విజ—హాహా! శౌర్యవంతుఁడైన పతి నొందుదువుగాక! (అపవారించి) హాహా! మిత్రమా! బాగుగ దీవించితినా?

జగ—(అప) ఇందున నాత్మాశీర్వచన ముండుటచేత—

విజ—(అప) శౌర్యవంతు లగుయోధు లెప్పుడు నాత్మరక్షణముఁ జేసికొనుచుఁ బరుల స్వాధీనులుగఁ జేసికొందురు. అది మా కల వాటు. అటు లేల దీవించితి ననఁగఁ బురుషుఁడు స్త్రీయందలిసద్గుణములకాసించును. స్త్రీ పురుషునందలి శౌర్యగుణమున కాశించును. కాంతలకనులకు యోధులకంటె సర్వోత్తరులు మఱెవ్వరును లేరు.

జగ—(అప) ఈజాతిమాత్రము పురుషునిశౌర్యము నపేక్షించునది కాదు.

విజ—(అప) ఏల?

జగ—(అప) ఇది దాసి; వ్యభిచారిణి.

విజ—(అప) కావున ధన మపేక్షించునా? వ్యభిచారిణి యైన మఱింత మంచిది కాదా? (ప్రకాశముగ) నీపే రేది?

భ్ర—భ్రమరిక.

విజ—నీ వృత్తి యేది?

భ్రి—నేను శుద్ధాంతకాంతాపరిచారికను; దాసిని.

విజ—హాహా! మిత్రమా! నీ పనినట్లే యయినది. భ్రమరికా! దగ్గఱగ రమ్మి!

జగ—(అపవారించి)

గీ॥ పైకి బండారము, మఱి లోపల లొటారు
ముందు దాసిని దవ్వుననుండి చూడఁ
దగును; దరిఁజేర నసహ్యమగును; నాట
కమును రంగంబునను నిల్చి కాంచినట్లు.

విజ—(అప) అది దూరమున నుండుటచే నాకు దృష్టి బాగుగ నానుట లేదు.

జగ—(అప) మీా కలవాటే కాదా? ఒంటికంటిని గురిపెట్టిచూడుఁడు.

విజ—(అప) నాకుఁ గొంచెము వయస్సుమళ్లినను దీనినిజూడ మిగుల నుత్సాహముగ నున్నదిసుమా!

జగ—(అప) మెంతికూర కెండినకొలఁది వాసనకదా! సేనాధిపతికిఁ, జేవతాఁటికి ముసలితన మేమి?

విజ—(అప) మేము యోధుల మగుటచే వీరరసప్రధానులము. మాకు శృంగారరస మూరక నంజుడునకుమాత్రమే కాని, యంతకంటెఁ గాదు. నేను వలచితి నని దానితోఁ జెప్పుట, అది కొంత బిగియుట, వాక్యోపవాక్యము లూరక తీఁగసాఁగుట నా కిష్టము కాదు. రంజక మంటింప 'ధామ్మ' మని ప్రేలుతుపాకివలె నే యతిలఘువుగ దీనిని నాకు సమకూర్పవలయును.

జగ—(అప) ఎంతసేపు! ఘటకమువలె మూడుముక్కలలోఁ గడ తేర్తును.

విజ—(అప) ఘటక మను నాయుధవిశేషము నే నెప్పు డుపయోగింప లేదే?

జగ—(అప) అది ఆయుధవిశేషము గాదు. ఆభ్రికశేషము. భ్రమరికా! నీవు మాసేనాధిపతిగారివంక నొకసారి చూడఁదగును.

భ్ర—(తల వంచుకొనును.)

జగ—(అప) బొమ్మజెముడు వలె నిర్భేద్యముగఁ బెరిగిన మీాబుగ్గ మీాసములఁ జూచి యది బెదరుచున్నది.

విజ—(మీాసములు దువ్వుచు) హాహాహా!

ఆ॥ వె॥ పెద్దపులికిఁ జిన్న•పిల్లిగడ్డంబును,
గనదుదారసింహ•మునకు జూలు,
యోధులకును ధరణి•నాథులకును బుగ్గ
మీాస లసమశౌర్య•భానకములు.

వీనివలన నరులకు భయముగాని, నారులకుఁ బ్రణయమేకదా! భయ మెఱుఁగని నన్నుఁ జేరుటకు నీకు భయ మేల? (అపవారించి మిత్రమా! త్వరగఁ దెమల్చుము.

జగ—భ్రమరికా! నీవు మాసేనానాయకుని బరిణయ మాడవలయును.

విజ—సెబాస్! బాగుగ నడిగితివి. యోధులకుఁ బాముమెలికనంభాషణము గిట్టదు. టక్కున నూటిగ సంభాషించుటయే మాకిష్టము.

భ్ర—అయ్యా! నేను బరిణియమాడుదానను గాను.

జగ—ఆఁడుదానవు కావుననే పరిణయ మాడు మంటిని.

విజ—దానియభిప్రాయ మేమి?

జగ—ఏ మున్నది? కూటసాక్ష్యములచే బ్రతుకువానివలె స్వచ్ఛంద వ్యాపారమున జీవింతు నను చున్నది.

విజ—వివాహమగువాఁడు లేకుండినయెడల నట్టియావశ్యకతగాని, యున్నయెడల నింక బాధ యేమి?

భ్ర—కులవృత్తిని దాఁటరాదు.

విజ—స్వైరిణీకుల మనునొకకుల మున్నదా? స్వచ్ఛందత కులాచారమై యున్నదా? మిత్రమా! ఈ యాచారము బాగుగ నున్నది కాదు సుమా! ఇట్టికులము మగవారిలోఁగూడ నున్నదా?

జగ—లే కేమి?

విజ—ఏ దది?

జగ—సానిమ్ము; నీకుఁ గోపము వచ్చునేమో?

విజ—చెప్పుము.

జగ—మీకులమే.

విజ—ఆఁ! ఆఁ! మాది వ్యభిచారకులమా? ఎట్లు?

జగ—గీ॥ భృతికిఁ బురుషమానధనాసు • తతి హరింత్రు
వారు, మీరు; కోపమే లేక • మీరు, రాగ
మొందరయె వారు; మందు చే•నంది మీరు,
మందుచే వారు; భేద మే • మందు నయ్య!

విజ—ఆఁ! మాకు శౌర్య మున్నది. మఱి వారి కే మున్నది?

జగ—మీశౌర్యమును మించిన మోస మున్నది.

భ్రి—అయ్యా! మే మెవ్వరిని మోసము చేయుదుము? ఒకరిసొమ్ము తస్కరించుకొని రాము. ఒకరి ధనమును మేము బలవంతముగఁ దీసికొనుట కబలలము. శుద్ధాంతకాంతలయొద్ద సదా పరిచర్య చేసి వారిచేఁ బోషింపఁబడుచుందుము.

విజ—మహాపతివ్రత లగు నవరోధవధువులయొద్ద నిట్టిస్వైరిణులు పరిచారికలుగ నుండు నాచారము నా కేమో బాగుగ నున్నదికాదు సుమా! సంసారిస్త్రీ లుండిన నెంత బాగుగనుండును?

జగ—సందేహముకూడనా? అందుచేతనే మనరాజాంతఃపురమున నిప్పుడందఱును సంసారిణులే యున్నారు.

విజ—ఆఁ! అలాగున లేరే! అ దెట్లు?

జగ—వార్ధకమునఁ గొందఱు, వికృతరూప లగుటచేఁ గొందఱు సంసారిణులకంటెఁ బరిశుద్ధలై యుండిరికాదా ?

విజ—హాహాహా ! కాని, వీరివలన బాధ లెక్కువగ నున్న దనుమాట నిశ్చయమేనా ?

జగ—ఇంక శంక యేల ?

ఆ॥ వె॥ అంతిపురములోన ♦ నామూల గోడచా
టునను జెవుల నూదు♦కొనఁగఁబడిన
ప్రాణపదరహస్య♦మైన నప్పుడె సంత
పాటి కెక్కు వీరి♦వలనఁ గాదె !

ఆ॥ వె॥ కాగితంబు నలుపు ♦ గావించి జీవించు
కోటలోని చుట్ట♦నోటివారి
ప్రాతకొంపగమిటో♦పారంబుసైఁ జండ
వీతిహోత్రకీల ♦ వీరిలీల.

తే॥ గీ॥ మొలను జరకత్తి, కుడిచేతఁ ♦ బొన్నగఱ్ఱ,
వెడదనుదురు బొట్టుదిగువ ♦ విభూతిచ్చ
కట్టు మెలిసిగ గల దొర♦గముల శుద్ధ
తేజమునకు వీరలసేవ ♦ దిడ్డితోవ.

విజ—ఏమైన సరే. మన మతిశీఘ్రముగ నీ దురాచారమును మానుపవలయును.

జగ—చిరకాలమునుండి వేళ్లుపెరిగియున్న దురాచారము నొక్కసారి పెఱుక మన తరమగునా? అది క్రమక్రమముగ జరుగఁదగినపని. ఎవ్వరైన మహాబుద్ధిసాహసము గలవాఁడు మార్గదర్శియై—

విజ—ఎవరో యన నేల ? నేనే మార్గదర్శి నయ్యెదను. మహాకార్యము లన్నియు మొట్టమొదట యోధులవలన నాచరింపఁబడినవే. నేను దీనిని బెండ్లాడి సంసారిణిని జేసి మా రాజకాంతయొద్దఁ బరిచర్య కుంచెదను. ఏమి ? భ్రమరికా, నీవు నన్నుఁ బెండ్లియాడెదవా? లేదా ?

భట్రి—ఆసంగతి నే నిప్పు డాకస్మికముగ నెట్లు చెప్పఁగలను?

విజ—ఎందుచేతఁ జెప్పలేవు?

భట్రి—నారాజ్ఞి మెచ్చుటి కేగెనో కానఁబడదు. ఆమె నాకనులఁబడినఁ గాని నావివాహముమాట తలపెట్టుకొనను.

విజ—అట్లైన మంచిదే! మీరాజ్ఞిని నే నిప్పుడే చూచి మారాజాంతఃపురమునకుఁ బంపితిని.

భట్రి—ఆలాగా! సంతోషమే. ఆమెసన్నిధి నొకరాజపురుషుని గూడఁ జూచితిరా!

విజ—ఆఁ! అతనిగూడ మాగ్రామమునకే పంపితిని.

భట్రి—నా కిప్పుడు మనస్సు నిర్వ్యాకుల మైనది. నారాజ్ఞిని నేను దర్శించిన వెనుక—

విజ—సెబాస్! ఆలాగే. మిత్రమా! చూడు!

గీ॥ మొగము మకమకలాడెడు • మగువ కింతఁ
దనుక, నిప్పు డానందవర్ధనత వెలిఁగె,
దుప్పు డులువంగఁబడు డాలు • నొప్పునఁ గొడి
రాలునట్టి దీపకళిక•లీల గాఁగ.

జగ—భట్రిమరికా! మీకాంతపే రేది?

భట్రి—ఆమెపేరుతో నీ కేమిపని యున్నది?

జగ—నీవు రాజకాంతతో నరణ్యమున కేల వచ్చితివి?

భట్రి—ప్రారబ్ధవశమున—

విజ—జగన్నాథా! నీదొలుపుచుబుద్ధి పోనిచ్చుకొనవుగదా! మనకు వారిరహస్యములతోఁ బని యేమి? మనకుఁ బ్రత్యక్షముగ నెదుటఁబడినదానితో మన మొకచేయి చూడవలయునుగాని, రంధ్రాన్వేషణము శూరధర్మము కాదు. నీవు దీని నటకుఁ దీసికొని పోయి నలుగురుభటుల నీమెసంరక్షణార్థముగ నియమించి మన

గ్రామమునకుఁ బంపుము. ఈమెను మాయింటియొద్ద భద్రముగ నొప్పఁజెప్పుఁ డని భటులతో నాయాజ్ఞగా నీవు చెప్పుము. పోయి వెంటనే రమ్ము. భ్రమరికా! పొమ్ము.

(జగన్నాథుఁడు భ్రమరిక నిష్క్రమింతురు.)

జగ—(పోయి తిరిగి వచ్చును.)

విజ—చెలికాఁడా! ఆలస్యమైనది. మన మిఁకఁ బోవలయును. మన వృద్ధరాజేంద్రునకు వ్యాధి హెచ్చుగ నున్నది. కావున మనము గప్పము సార్వభౌమునకు వేగ నర్పించి వెంటనే మనరాష్ట్రమును జేరవలయును.

జగ—చిత్తము. (ఇద్దఱును నిష్క్రమింతురు.)

ఇది ద్వితీయాంకము.



(శ్రీ)

# కోకిల.

## తృతీయాంకము.

[ప్రదేశము—శ్రీపురమునందలి వీథి]

(ప్రవేశము—కృష్ణుఁడు.)

కృ—అబ్బ! అబ్బ! ఇప్పటికి అజీర్ణబాధ కొంత శాంతించినది. ఏమి భోజనములు! ఏమి పిండివంటలు! ఏమి ఫలాహారములు! ఏమి పానకములు! ఏమి త్రేపులు! ఏమి కడుపునొక్కులు! ఏమి సొంటిపొడిపిడచలు! ఏమి మిరియాలకషాయములు! ఏమి యేకభుక్తములు! ఏమి యెంగిలిలంఘనములు! అబ్బ! ఏమి వైద్యులతెగనీలుగుటలు! ఏమి నిద్రలేకపోవుటలు! ఏమి గుండెబరువులు! ఏమి స్వప్నరోదనములు! అబ్బ! ఇక్కడ కన్నియుఁ గడతేరినవి. (ఆవులించుచుఁ జిటిక వైచుచు) శంకరా! శంకరా!

(తెరవెనుక) అయ్యా! ఇదిగో! వచ్చుచున్నాను.

కృ—ఈతఁ డెవ్వఁడు?

ఆ॥ వె॥ అంగవస్త్రమునకు ♦ నటిటొటు జారి మృ
గాజినమును గట్టి ♦ యద్ది యెడమ
చేతఁ గొని వలపలి♦చేఁ గఱ్ఱ నూఁదికొం
చదుగో! శివశివా యం♦టంచు వచ్చు.

(శంకరుఁడు ప్రవేశించును.)

కృ—అయ్యా! నమస్కారము.

శం—మీ రెవ్వ రయ్యా?

కృ—నే నెవ్వఁడనైన నేమి? నమస్కార మర్పించితిని; గ్రహింపరాదా?

శం—మీ రెవరో తెలియకుండ నెట్లు గ్రహింపఁగలను. మీకుఁ దిరిగి నమస్కరింపవలయునో యాశీర్వదించినఁజాలునో తెలిసికొన వలదా?

కృ—మీవంటి పెద్దలు మాకుఁ బ్రతినమస్కారము కూడనా?

శం—అటులైన దీర్ఘాయుష్యమస్తు! నాయనా! మీ రెవ్వరు?

కృ—ఆశీర్వాద మైనది కాదా? ఇఁక నే నెవఁడనైన నేమి?

శం—ప్రభుసంస్థానములో మీ కేమైనఁ బని యున్న దేమో తెలిసికొనుట కడిగితిని.

కృ—ఆఁ! స్వల్పముగ నున్నది.

శం—చాలు. మావంటివారి కుపకారముచేయుట కంతియే చాలును. బీదబ్రాహ్మణుఁడను; కుటుంబికుఁడను; వేదాధ్యయనపరుఁడను; వృద్ధుఁడను; దురన్నదుర్దానములకుఁ బోవువాఁడను గాను. నాయనా! కొంచెము పుణ్యము కట్టుకొని—

కృ—న న్నిప్పు డేమి చేయు మని మీయభిప్రాయము?

శం—ఈయుత్సవములలో నేమైన సత్కార మపేక్షించి వచ్చితిని—

కృ—ఏయుత్సవములు?

శం—ఇప్పుడు జరుగుచున్న యుత్సవములు.

కృ—ఇప్పుడు జరుగుచున్నవి కావు, వెనుక జరిగిన వనుము. రెండు మాసముల క్రిందటు పూర్తియైనవి. మీ రింత యాలస్యముగ నేల వచ్చితిరి?

శం—దురదృష్టముచేత. వేడుక లన్నియు నప్పుడే ముగిసినవా?

కృ—మఱిలేదా?

శం—లేనిసంభావన లేనే లేదు. నాయనా! ఇక్కడ నేమి యుత్సవములు జరిగినవో చెప్పుము. చెవులార విని సంతసింతును.

కృ—అటులైన వినుము.

శం—ఊఁ!

కృ—మొదటివేడుక మావృద్ధరాజేంద్రుని మరణము.

శం—హరహరా! అటు లందు వేల ?

కృ—చచ్చినతరువాత చావలే దని నే నెట్లు చెప్పఁగలను ?

శం—నిన్ను నత్య మాడు మని నాయభిప్రాయము గాదు. వృద్ధరాజేంద్రుని మరణము వేడుక యంటివికాదా!

కృ—అనినఁ ద ప్పేమున్నది ? తొంబదిమూఁడు సంవత్సరములు జీవించి శీఘ్రముగ మరణించుటకై కోరిన వృద్ధరాజేంద్రుని మరణ మత నికి, లోకమునకుఁ గూడ వేడుక కాదా ?

శం—పూర్ణాయుర్దాయము! తొంబదిమూఁడు సంవత్సరములు జీవించె నేమి!

కృ—తెలివితేటలులేనివాని కాయున్సునకు లోప మేమి ?

శం—వారు ప్రభువులు, అమిత్తైశ్వర్యసహితులు, అనేక ప్రజాపోష కులు. వారికిఁ తెలివితేట లేమిటికి ? నాయనా! నాలుగుముక్క లు వచ్చినఁగాని జీవనము జరుగ దన్న భయముగల్గిన మనవంటి దరిద్రులకు విద్యలు, తెలివి కాని, యందఱికంటె నధికులగు వారికిఁ దెలివితేట లేల ?

కృ—అందుకొఱకే వారికి మఱింత కావలయును. మీకు నాకు విద్యా బుద్ధులు లేకపోయిన లోకమునకు లోప మేమి ? మనకు మాత్ర మేమి లోపము ? కాకివలె నొక్కపొట్ట పోసికొన లేకుందుమా ? అనుగ్రహము వచ్చిన ననేకకుటుంబములఁ బోషించువారు, ఆగ్రహము గల్గిన నశింపఁజేయువారు అట్టి ప్రజారక్షణ శిక్షణ మహాకార్యము మీఁదఁబడినవారికే యుక్తాయుక్త విచక్షణత యుండనియెడల నెంత వైపరీత్య మున్నది!

శం—ఆ వృద్ధరాజేంద్రుఁ డంత తెలివితక్కువవాఁడా ?

కృ—కాఁడా ?

గీ॥ ఎంతో వచ్చిన నంతకు • నెక్కుడు సెల
వు నొనరించురా జెటుచెడి•పోక యుండు ?

నెంతో యెన్నిమాఱులో తిని • యెంతో త్రాగు
చుండు నతిమాత్రరోగి చా•కుండు నెటులు?

ఆ॥ వె॥ ప్రభుఁడు మందుఁగోటఁ • బ్రతిభచే లక్షనే
యంగఁగల్గు నాతఁ • డధముఁ డయ్యె
నధముఁడైన యాతఁ • డట్టె లక్షాధ్యక్షుఁ
డయ్యె నధికవిభవుఁ • డయ్యె నకట!

శం—పోనిమ్ము. ఇఁకఁ జెప్పకుము. మరణించినవారి సుగుణములనే పేర్కొనవలయును. ఆయనకుఁ బుత్రు లెవ్వరైన నున్నారా?

కృ—లేరు.

శం—అట్లైన నీరాజ్యము నెవరు పాలించుచున్నారు?

కృ—ఆయనభార్య

శం—ఆయన భార్యకు దత్తతాధికారము నిచ్చెనా?

కృ—లేదు. కాని యాయన జీవించియుండగనే వారకాంతవలె నొక కన్యను దత్తతఁ జేసికొనెను...అదే దగ్గఱదీసికొనెను. ఆనిర్భాగ్యురా లీయనగుమ్మములోఁ గాలుపెట్టఁగనే యాయన కాలుని గుమ్మములోఁ గాలుపెట్టెను.

శం—పాపము!

కృ—పాపము కాదు. లోకులపుణ్యముచేతనే యట్లు జరిగినది.

శం—అ దేల?

కృ—ఆరాజు మరణింపఁబోవుచు నొకయాజ్ఞ చేసెను.

శం—ఏ మని?

కృ—తాను మరణించిన తరువాత రెండుమాసములలోపుగఁ బట్టపుటేనుఁగునకు జలకలశమును బూలమాలయు నిచ్చి యూరంతయుఁ ద్రిప్పవలసిన దనియును, దత్కలశజల మది యెవనికాళ్ళఁబోసి యెవనిమెడ నాపుష్పమాలవేయునో యాతని నాగజయుపై నెక్కించి తీసికొనివచ్చి రాజ్యమునఁ బట్టాభిషిక్తుని జేయవలయు

నని—

శం—సమంజసమై సర్వోత్కృష్టమైన యీపూర్వాచారమును రాజు గౌరవించినందులకు సంతసించితిని.

కృ—అంతకంటె మే మొకందులకు సంతసించితిమి.

శం—మ దెందులకు?

కృ—అందువలన మా కమితప్రతిభాశాలి యగు మహారాజబాలకుఁడు లభించెను.

శం—లభింపఁడా? పురుషప్రయత్నపటుత్వమున నహంకారము నుంచుకొని చేయఁబడిన కార్యము సుష్ఠుగ నెఱవేఱదు కాని, నిరహంకారతచేఁ గేవలదైవాధీనముగఁ జేయఁబడినకార్య మసామ్యశోభావంతముగ ఫలింపదా? వెనుకటిరాజునకు నీతనికి హాస్తిమశకాంతర మున్నది కాఁబోలు నేమి?

కృ—మశకహస్త్యంతర మున్నది.

శం—ఈయనకుఁ బట్టాభిషేక మయ్యెనా?

కృ—పెండ్లి కానిదే పట్టాభిషేకమా?

శం—పెండ్లియే యింకఁ గాలేదా? అటులైన నీనడుమను జరిగినయుత్సవము లేవి?

కృ—ఇట్టి మహాపురుషుఁడు పరిపాలకుఁడుగా లభించుటవలన జనులత్యానందమున మూఁడుమాసము లొక్కరీతిగ నపరిమితోత్సవము లొనర్చిరి. పట్టాభిషేకము పర్యంతము జను లీ రీతిగనే వేడుకలు నలుపఁ దలఁచిరి. కాని, యొక్కయంతరాయము గలిగినది.

శం—అది యేది?

కృ—మారాజబాలకునికి సార్వభౌమునితో యుద్ధము సంభవించెను.

శం—అయ్యో! అసమకక్షయే. కారణ మేమి?

కృ—ఈనడుమ మరణించె నని చెప్పితినే! ఆవృద్ధరాజున కొక్క కుమారుఁ డుండెను.

శం—నిర్వంశముగ మరణించె నని చెప్పితివి కాదా?

కృ—అక్కఅకు రాని పుత్రుఁ డున్న నట్టిదియేకదా?

శం—అక్కఅకు రాకపోవుట యేమి?

కృ—ఆచిన్నవాని మూఁడేండ్లవయసుననే యచ్చటినుండి సార్వభౌముఁ డుగ్రహించి తనయూర బందీకృతుని జేసినాఁడు.

శం—ఆతని దోష మేమి?

కృ—ఆతనిది కాదు, తండ్రిది. తండ్రియొక్క విధేయతావిచ్ఛిన్నత కీ చిన్నవానిని బూఁటకాఁపుగఁ దీసికొనిపోయినాఁడు.

శం—సరే. ఇప్పుడు యుద్ధకారణ మేమి?

కృ—ఆబాలుఁ డిప్పుడు పందొమ్మిదేండ్లవాఁడయి తనకూఁతును వలచి దానితోఁ గూడఁ బలాయన మొనర్చెనాఁడనియును, వారి నిద్దఱును దనకు నొప్పఁజెప్పినఁగాని యుద్ధమొనరింతు ననియును సార్వ భౌముఁడు మారాజుగారికి వార్త నంపెను.

శం—తరువాత?

కృ—తరువాత నే మున్నది? వారు గానఁబడకపోవుటచేత యుద్ధమా రంభమయ్యెను. అదివఱకే కప్పమిచ్చుటకుఁ బోయిన సేనాధిపతి భటులతో సార్వభౌమరాజధానిలోనే యున్నాఁడు. కావున నిప్పుడు యుద్ధము భయంకరముగ జరుగుచున్నది.

శం—ఆచిన్నవాఁడు నాచిన్నదియు నీగ్రామమునకే వచ్చియుందు రేమో! బాగుగ వెదకింపలేక పోయితిరా?

కృ—సత్యకాలపుమాటలఁ జెప్పుచున్నావు. ఆచిన్నవాఁడు పారిపోలేదు; ఆచిన్నదాని నాతఁ డెత్తుకొని పోలేదు. మావృద్ధరాజుమరణ మున మారాజ్య మరాజక మగుటచే మారాజపుత్రుని మాకుఁ బంపు మని మే మడిగిపోవుదు మని యీవంకఁ గల్పించి యరాజ కమగు నీరాష్ట్రమును దా నపహరింపవలయు నని యెంచి కలహ మునకు సార్వభౌముఁడు గాలు దువ్వినాఁడు.

శం.—అలాగా! అంతమోసము చేసినాఁడా?

కృ.—కాక యేలా గనుకొంటివి? రాజ్యతంత్రమునకుఁ, గట్టుమోతు మంత్రమునకు భేద మేమున్నది? మాబాలప్రభునిసంగతి విని సార్వభౌముఁడు మఱింత యుగ్రుఁడై యున్నాఁడు.

శం.—పోనీ! ఈగాధ కేమి కాని, మీరాజుగారిపెండ్లి యెప్పు డగును?

కృ.—వర్తార మపేక్షించిన నీకంతకంటెఁ గావలసిన దేమి? శీఘ్రములోనే.

శం.—పెండ్లికూఁతు రెవ తెయో స్థిరపడినదా?

కృ.—ఇంటిలోనే యున్నదానికి స్థిరపఱుప నేల?

శం.—అ దేలాగున?

కృ.—మావృద్ధరాజేంద్రునిచే నాదరింపఁబడినకన్య యొకతె యున్న దని చెప్పలేదా?

శం.—ఆపిల్ల నిచ్చి పెండ్లి సేయుదురా?

కృ.—కా కేమి?

శం.—ఆచిన్నది వృద్ధరాజుచేఁ బెంపఁబడినది కాదా? వివాహ మెట్లు?

కృ.—ఆచిన్న దనుమాట యేమి? మేమందఱము వానిచేఁ బెంపఁబడిన వారము కామా? దిక్కులేక యెక్కడనో దొరకుటచే నంతఃపురములో భోజనము పెట్టించుచు నాదరించుచున్నారు. ఇంటిలోఁ బ్రవేశించిన వెంటనే వృద్ధరాజును గడతేర్చిన యీామె మగడగు నీ బాలరాజు నేమి చేయునో యని భయముగ నున్నది.

శం.—ఆపిల్లయందు మీరాజున కిష్టత యున్నదా?

కృ.—లే దని నాయభిప్రాయము.

శం.—ఆపిల్లదాని కీతనియందో?

కృ.—లేనట్లే వినికి.

శం.—అటులైన వివాహ మెట్లగును?

కృ.—తల్లిగారి బలాత్కారముచేత—

శం—పాపము! దాంపత్య మనుకూలముగ నుండునా?

కృ—దక్షిణకువచ్చిన నీకు దాంపత్యపుగొడవ యేల? దినమునకు రెండు మూఁడుపర్యాయము లీచిన్నదాని నాతనిపై ననుకొల్పి, యాతని నీకన్యపైఁ బురికొల్పి మారాజ్ఞిగారు వారి కన్యోన్యాను రాగము గలిగింపఁ బ్రయత్నించుచున్నారు.

శం—అటులు బలవంతపెట్టిన వలపు గలుగునా?

కృ—సానపైఁ జెక్కను బడనరగఁదీయఁగ వలపుపుట్టుటలేదా? ఆలాగు రాపాడించగఁ రాపాడించఁగ గ్రమక్రమముగఁ గలుగఁ గూడదా?

(నేపథ్యమున)

కృష్ణా! తిండివేళ యైనది. కోటలోనికిఁ బోవలదా?

కృ—మిత్రమా! ఇదిగో! వచ్చుచున్నాను. అయ్యా! ఇఁక నొక్క మాటఁ జెప్పెదను. ఇదే సమయము ఈనరికి వారిద్దఱును—పెండ్లికొడుకుఁ బెండ్లికూఁతురును—గ్రొత్తరీతిగ నొండొరులఁ బ్రేమించుటకుఁ బ్రయత్నింతురు. నే నింకఁ బోయెదను.

శం—ఈదినమున నేను బ్రభువువారిసత్రమున భుజింతును.

(ఇద్దఱును నిష్క్రమింతురు.)

ఇది విష్కంభము.

[ప్రదేశము—శ్రీపురములో నంతఃపురము.]

(ప్రవేశము—పురుషరూపధారిణి యగు కోకిల, బుద్ధిమతి.)

కో—బుద్ధిమతీ! ఏ మంటివి?

బు—(చేతులు జోడించుకొని) నన్నను గ్రహింపు మంటిని.

కో—నిన్ననుగ్రహించుటకే కాదా మాప్రయత్నము?

బు—ఈప్రయత్నమును మీరు వదలి నన్ననుగ్రహింపవలయును.

కో—అభ్యంతర మేమి? ఈప్రయత్నముతో మా కేమి పని యున్నది? అంగీకరించితి ననుము. సర్వప్రయత్నమును వదలి నిన్ననుగ్రహింతును: నీపాణిని గ్రహింతును.

బు—మహాప్రభూ! నన్నెన్నిసారు లనుమంటిరి?

కో—నన్నెన్నిసారులు నిన్ను వేఁడు మంటివి ?

బు—మహారాజులరు మీరు నన్నింతగా వేడుట తగునా?

కో—ప్రార్థించినను వ్యతిరేకించుట నీకుమాత్రము తగునా?

బు—రాజేంద్రా! నే నింక నేమి సేయఁగలను?

కో—బుద్ధిమతీ! నే నేమి సేయఁగలను?

బు—మహారాజా! మీ కేమి?

కో—నీకుమాత్ర మేమి?

బు—నన్ను వలచినవాఁడు, నన్ను వలపింపఁజేసినవాఁడు, నన్నుఁ గోరుకొనినవాఁడు, నాచేతఁ గోరుకొనఁబడినవాఁడు, నన్నుఁ బ్రతిగ్రహించినవాఁడు, తన్ను నా కిచ్చినవాఁడు మోహనుఁ డని మనవి చేసికొంటినికదా!

కో—(తనలో) నీకు మోహనుఁ డెట్లని బహుమానించుకొనుచుంటివో నాకు వసంతుఁడు యథార్థముగ నట్లేకదా! మోహనుఁడు నా కెట్టిదుర్ణయ మొనర్పఁదలఁచెనో నీ వెఱుఁగకపోవుటచేత నిట్లు లనుకొను చుంటివి.

గీ॥ పతి పరస్త్రీగతుండైన • సతి యెఱుంగ
కుండిన సుఖంచు; సుఖమొంద • నున్న కాంత
పతిని శోధింపఁగూడ; ద•జ్ఞతయె తెలుచు
నరులకు సుఖకారణము, జ్ఞా•నంబు కాదు.

గీ॥ తెలివి హెచ్చినకొలఁది శో•ధించుకొలఁది
కష్టసంకోచహేతువుల్ • ఘనము లగును;
మంచిజాతద్దమునఁ బరీ•క్షించుకొలఁది
శుద్ధమగునీటఁ గ్రిమితతి • వృద్ధికాదె?

(ప్రకాశముగ) బుద్ధిమతీ! మోహనుఁ డిప్పు డెక్కడ నున్నాఁడు?

బు—ఇక్కడనే యున్నాఁడు.

కో—ఎక్కడ?

బు—(హృదయమునఁ జేవైచి) ఇక్కడ బద్ధుఁడై యున్నాఁడు.

కో—(తనలో) ఆహా! భగవానుఁడా!

గీ॥ పితను బాసి, రాజ్యము వీడి, ♦ పతిని వదలి,
సుఖము త్యజియించి, సిగ్గును ♦ నున్నఁజేసి,
యోఁడుగతిఁగూడఁ బోనాఁడి, ♦ యంగనలకు
భర్తఁగా నుంటి నెంత ని♦ర్భాగ్య నైతి?

మోహనుఁ డిటనే కారాగృహమున నున్నాఁడు. బుద్ధిమతి యిటనే నాయిల్లా లగుటకు వేఁడఁబడుచున్నది. దైవోపహత యగు కోకిల బట్టతలకు మోకాలికి ముడిఁబెట్టఁదలఁచి యిటనే యున్నది. నలుగురిలో ముగ్గుర మిటకే చేరితిమి.

గీ॥ మహితపురుషార్థముల మోక్ష♦మార్గ మెట్లో
సాధనములలోనఁ బ్రపత్తి♦సరణి యెట్లో
తత్వములలోఁ బరబ్రహ్మ♦తత్వ మెట్లో
మానగణములో వసంతుండు ♦ మాన్యుఁ డట్లె.

ఆ॥ వె॥ అట్టిపాణకాంతు ♦ నట్టడవిని ద్రోచి
యిటులె యతనిరాజ్య ♦ మేల నుంటి;
నన్ను, నాకు వచ్చు ♦ సవ్యరాజ్యము నేలఁ
దగిన పతికి నిట్టి♦దాన నైతి.

(నేపథ్యమున)

మహాప్రభూ! సార్వభౌమునిరాజ్యము మీచేతఁ జిక్కినది. యుద్ధమున మీకు సంపూర్ణవిజయము తటస్థించినది. సేనాధిపతి భటులందఱితో వచ్చినాఁడు. మఱింత సంతోషకరమగు వార్త యేమనఁగ సార్వభౌముఁడు సేనాధిపతికిఁ జిక్కి యిటకుఁ

దీసికొని రాఁబడినాఁడు. ఈసంగతులు మీయమ్మగారు మీతోఁ జెప్పు మనినారు.

కో—(తనలో) ఎట్టిదుర్వార్తలు కర్ణములఁ బడినవి! (ప్రకాశముగ) మిక్కిలి సంతసించితి నని మాయమ్మగారితో మనవి సేయుము. సార్వభౌము నవమానింపక తగినగౌరవమున, నుచితస్థలమున నుంచు మని చెప్పుము. ఏల యన,

ఆ॥ వె॥ మనకు వశ్యుఁ డగు నరుని కెంత మాన్యత
గనఁబఱతుమొ యంత • ఘనత మనకు;
నావువెన్నతోడ • నడు గెంత మర్దింతుర
కంటి కంత చలువ • గలుగుఁగాదె!

సరే. పొమ్ము.

(నేపథ్యమున) చిత్తము.

కో—(తనలో) హా! తండ్రి!

గీ॥ కూఁతు రొక్కతె లేచిపోఁ • గుంది, యుద్ధ
మందు నోడి, రాజ్యము వీడి, • యడుగుల కిను
పగొలుసులు గట్టఁబడు నిన్నుఁ • బట్టి నాడు
ముందు నిలఁబెట్ట నెట్లు నేఁ • గందు నయ్య!

హా తండ్రీ! నీవు బందీకృతుఁడవై తీసికొని రాఁబడితివనియు, నీరాజ్యము మదధీన మైన దనియు నాకు వార్త నంపిన మా యమ్మకు సంతసించితి నని ప్రతివార్తఁ బంపవలసివచ్చెను! ఈకన్య నుద్వాహము చేసికొను మని మాతల్లి నన్నుఁ బ్రేరేప, నందులకుఁగూడ మహాభాగ్య మనవలసివచ్చెను! హా!

గీ॥ ప్రభువు లని పెద్ద లోకప్రవాద ముండు,
వారికంటెను బద్ధులు • వసుధఁ గలరె?
నవ్వు వచ్చిన నోరార • నవ్వరాదు,
ఏడ్పు వచ్చినఁ గన్నార • నేడ్వరాదు.

గీ॥ అధికముగఁ బల్కి లఘుచిత్తుఁ • డండ్రు, మూతి
ముడుచుకొనియుండ గర్వసం•పూర్ణుఁ డండ్రు,
మధ్యరీతిగ నుండ సా•మాన్యుఁ డితఁ
డెట్లు ప్రభు వయ్యె నని వెక్కి•రింత్రు జనులు.

ఆ॥ వె॥ మాటలాడునపుడు • మనసీయఁగాఁగూడ,
దీయనట్లు కాని•పింపరాదు;
పలికి పలుకనట్లు • పలుకంగవలయును,
జేసి చేయనట్లు • చేయవలయు.

గీ॥ నవ్వు రాకయే యొకపుడు • నవ్వవలయు,
వగవు రాకయే యొకపుడు • వగవవలయుఁ;
గట్టిమకుటంబు, ముచ్చిబం•గారు గద్దె,
కల్లకత్తియుఁ గల నటు•కరణిఁగాఁగ.

గీ॥ రాజపదమా! మహాధికా•రంబ! యెట్టి
చిత్రనటనల జనుల వం•చించుచుంటి,
నీవె సుఖ వను వాడుక • నీవెలుపలి
డంబముల దడబడల గ•డ్బడలఁ గలిగె.

హా! జరిగిన దేదో జరిగినది. వగచిన లాభము లేదు, కాని యి దేమి?

గీ॥ చెలియకుఁ బురుషుఁడు పతి గా•వలయు నంచు
నాజగన్మాతయాజ్ఞ సృ•ష్ట్యాదినుండి;
చెలియకును జెల్వ మగఁడు గా•వలయు నంచు
నిపుడు మాతృదేవతయాజ్ఞ • యే మొనర్తు?

(నేపథ్యమున) రాజేంద్రా! మీయమ్మగారు మీయొద్దకు వచ్చెద మనుచున్నారు.

కో—సరే. (తనలో)

గీ॥ అమ్మయైనను, మముఁ జేయు • బమ్మయైనఁ
గొమ్మ నొకకొమ్మతో నెట్లు • కూర్పఁగలుగు?

నేకజాతీయుమై ద్యుతా♦హీనశ క్తి
సంయుతపదార్థములఁ గూర్పఁ♦జాలు నెవఁడు?

(చంద్రిక, స్త్రీరూపధారి యగు వసంతునితోఁ బ్రవేశించును)

కో—అమ్మా! నమస్కారము.

చం—చిరంజీవి వగుము.

బు—అమ్మా! నమస్కారము.

చం—నీవుకూడ 'నమ్మ' యని పిలచెద వేమి? అత్త యనుము.

కో—(తనలో) అత్త యని పిలువఁదగినదానను నేనే కదా!

వసం—(తనలో)బుద్ధిమతీ! మహారణ్యమునఁ గొట్టుకొనివచ్చి యెట్టులో యంతఃపురమును జేరి మారుమగనికై ప్రయత్నించుచుంటివా?

గీ॥ ఇట్టులే నాదు కోకిల ♦ యేపురంబుఁ
జేరి, యేరాణిసేవను ♦ జేసి, నాదు
రాకపై నాశ వీడి యే♦రాజు నొంద
నున్నదో? యూవనం బూర♦కుండఁగలదె?

చం—అబ్బాయీ! నీవు శీఘ్రముగ దీని నంగీకరింపఁజేయవలయును. బుద్ధిమతీ! నీవు వీనిని వరియింపక తప్పదు. మీరిద్దఱు దంపతులు గాఁగఁ జూచుభాగ్యము నాకు లభింపఁజేయవలయును. వింటిరా? కొడుకు, కోడ లని మిమ్ములను జూచుకొని దినములు గడుపుకొని యుందును. లేనికొడుకు లేనే లేఁడు.

వసం—(తనలో) అమ్మా! నీకొడుకు మొద్దులాగున నిచ్చట నున్నాడు. అయినను నీకొడు కని చెప్పుకొనునట్టిస్థితిలో లేఁడు. నీవు పెంచుకొన్న కొడుకునకు ముందు కాఁబోవుభార్యకు దాసిగా నుండఁదగిన వేషమున నున్నాఁడు.

చం—ఏదీ! మీ రొండొరులఁ బల్కరించుకొనుఁడు. మీయను రాగాంకుర మేమాత్రము చిగిర్చెనో కనిపెట్టుదును. "పదునాలుగేండ్ల కన్యకుఁ బదునాఱేండ్లవరుఁ డేమి? వరహీనత కాదా" యని

యూరనున్న యమ్మలక్కల బుగ్గలు నొక్కుకొన్నను వీరిద్దఱు నాయాజ్ఞానువర్తులై యుందు రని యాసపడి యిట్లు కోరితిని. నాయాశ వ్యర్థము సేయకుఁడు. బుద్ధిమతీ! మాఅబ్బాయి మెత్తనివాఁడే. నీవే కఱకుపడనుగయ్యాళివి. జాగ్రత్త! అబ్బాయి! కానీ!

కో—(బుద్ధిమతిదరిఁ జేరి) బుద్ధిమతీ! ప్రాణప్రియా!

చం—సరే! మాటలు బాగుగనే యున్నవి. కాని ముఖమందు రస మొప్పుట లేదు. రసోదయముకానిపాత్రమువలెఁ బారము నొప్పఁ జెప్పినతోఁడనే పసిమైన దనుకొంటివా? అందుచేతనే నీ వింతకాలమునుండి దీనిమనసును గరఁగింప లేకపోయితిని.

కో—(తనలో)

గీ॥ ఉవిద పురుషరూపము నొందియున్న నైన
స్వస్వభావవైఖరులు మాఱ్పంగఁబడుట
గలదె? కవిత భాషాంతరీకరణ మొంది
నను గథార్థాదు లన్ని వెంటఁ దెవికావె?

చం—ఊరకుంటి వేమి? మఱియొకసారి యనుము.

కో—బుద్ధిమతీ! ప్రాణప్రియా!

చం—ఛీ! ఛీ! ఈసారి మఱింత పాడైన దేమి?

కో—(తనలో)

గీ॥ మొదలె చేతగానితనము, పిదప సంభ్ర
మం బమరఁ గార్య మెట్లు ధ్వంసంబుగాక
తీరు? మొదలె నత్తి, పిదపఁ దీవ్రకోప
కలన గలుగఁగ మాట రాఁగలదె పైకి.

చం—(బుద్ధిమతివంక దిరిగి) నీనాథుఁడు పిల్చుచున్నాఁడు. నీ వే మందువు? కానీ! సిగ్గుపడకు.

బు—(కోకిలవంక దిరిగి) నేను నీకుఁ బ్రాణప్రియను గాను.

చం—ఓసీ! కొఱుకరానికొయ్యా! ఇ దేమే? ఈన్నాళ్ళనుండి చెప్పినచదువునకు ఫల మిదేనా? ఇంక నేలయుంటుయొద్దనే యేడ్చుచుంటివా? ఆఁ! అటులు గ్రుడ్లు వెట్టుకొని గూచెద వేమి? 'ప్రాణప్రియను గాను' యనినదానవు 'కాఁగల' నని యన లేవా? అతఁడు నీవు కొంచె మెచ్చుతగ్గుగ సమవయస్కు లేకద! అతని జూచి యైనను సిగ్గు దెచ్చుకొనరాదా? అతఁ డెంత చొరవగ మాటలాడుచున్నాఁడో చూడు!

కో—(తనలో) బుద్ధిమతీ!

గీ॥ నీ యనిష్టతచేతనే ♦ నేను మొండి
బారి తగఁదు నంచును సిద్ధ♦పడితి; నీవె
నన్ను వరియించునటులైన ♦ నాదు మగత
నంపుఁబస పైటఁబడి తల♦వంపు గాదె?

గీ॥ పుట్టముల బిట్టుకట్టుచేఁ ♦ బురుషుఁడును, ద
దితరసకలవైఖరులచే ♦ నింతి యగు; మ
గమ్మ లిల నెంద ఱున్నారొ? ♦ యట్టివోతు
ము త్తయిదువులందున నొక్క♦ముదిత నేను.

చం—బుద్ధిమతీ! తిన్నఁగ మాటలాడెదవా? బుగ్గపై బొడుపుమంటివా?

వసం—అమ్మా! తొందరపడకుము. పిల్లది. కసుగాయ. అన్నియు నసఁగలదు. అన్నియుఁ జేయఁగలదు. సమస్త మిప్పుడే కావలయు నని తొందరపడిన నగునా? శాంతింపుము.

చం—మగఁడు పెండ్లా మనుచు వీరిద్దఱుఁ నాకన్నులయెదుట శ్రవణానందముగ మాటలాడుకొందు రేమో చూడవలె నని నాకుఁ గొండంత యాశ యున్నది. పెద్దదానను; ఆమాత్ర(పు) వేడుక నా కంటియెదుట జరుగుటకు నేను నోచుకొనఁగూడదా?

వసం—అమ్మా! సిగ్గువదలి చెప్పుచున్నాను. మాతృదేవతవైన నీ యెదుట వారే మాటలైన మాటలాడుకొందురు; కాని శృంగారపుమాటల నాడుకొందురా? ఉపనయనములు, వివాహములు

కోవెలలో దైవసన్నిధిని జరిగింపవచ్చును గాని గర్భాధానము లట్లు జరుగనీయవచ్చునా?

చం—సరి, సరి. నీవుగూడ మాపెద్దమ్మకుఁ దగినదానవే దాఁపరించితివి!

వసం—అమ్మా! క్షమియింపుము. క్రమక్రమముగా నామెయే యొప్పుకొనును.

చం—క్రమక్రమ మనఁగ నేమి? నామొగము! నీమొగము! ఇదివఱ కెన్నియో నెలలనుండి చిలుకకుఁ జెప్పినట్లు చెప్పిచెప్పి ప్రాణములు విసిగిపోయినవి ఏమే, యనఁగ నెప్పటిమాటయే అబ్బబ్బ! ఈ కొంకనక్క నానెత్తురు నావార పోయుచున్నది! నామొముకలు కటకట కొఱుకుచున్నది! బుద్ధిపూర్వకముగఁ గానితెచ్చికొనిన పీడ. ఏమే? ముంగివలె మూతి ముడుచుకొని యూరకుంటి వేమి? పశువా! పశువా! పదునాలుగేండ్లు పడుచవు; పతి యక్కఱలేదా? బ్రహ్మచారిణి వగుదువా?

వసం—ఆమెకుఁ బతి యక్కఱలేకపోవుట కాదు. మఱియొకనిపై నామె యనురాగము లగ్నమైన దేమో?

చం—ఆఁ! ఆఁ! మఱి యెవ్వఁ డున్నాఁడు? ఓసీ! నిర్భాగ్యురాలా! ఆతఁడు నీకుఁ బ్రాణనాథుఁడు గానియెడల నీకు మగఁడు మఱి యెవ్వఁడు?

వసం—ఇప్పుడు మీరా రామె నడిగినప్రశ్నము నామెకుఁ బతిగావలసిన యబ్బాయిగారిచేతనే యడిగించిన మంచిది.

చం—(కోకిలవంక దిరిగి) ఊఁ. ఊఁ! కానీ! నీకు మగఁ డెవ్వఁడు? ఊఁ.

కో—(తనలో)

గీ॥ ఎవఁడు సార్వభౌముని కల్లుఁ ♦ డవునొ? యెవ్వఁ
డేకపుత్త్రుఁడు నీ కౌనొ? ♦ యెవ్వఁడు మన
రాష్ట్రయుగమును మ మ్మేలు♦రా జగునొ? య
తఁడు వసంతుఁడు నాకు భ♦ ర్త యగుఁగాదె?

చం—కాని! అబ్బాయీ! ఊరకుంటి వేమి? నీకు మగఁ డెవ్వఁ
డని దాని నడుగుము.

కో—(తనలో) బుద్ధిమతీ!

గీ॥ నీవు నన్నొల్లకుంటచే ♦ నీ వదృష్ట
వతి వగుటె కాక నన్నాడఁ ♦ బరమభాగ్య
యుక్తఁగాఁ జేసినావు; లేఁకున్నఁ గట్టఁ
గట్టుకొని దిగవలయును ♦ గంగ మనము.

(ప్రకాశముగ) బుద్ధిమతీ!

గీ॥ ఎవనినామము స్మరణీయ ♦ మవునొ నీకు?
నీకటాక్షాళి కర్హుఁడై ♦ నెగడియుంట
నెవఁడు నాకంటె ఘనతరా♦దృష్టయుతుఁడొ?
యట్టి నావైరి యెవ్వఁడో? ♦ యాన తీవె.

చం—నాయనా! నీలోప మేమియు లేదు. నీవు బాగుగనే యడుగు
చుంటివి. మొగము కొంచెము పేలవముగ నున్నది కాని—

బు—ఎన్నిసారులు చెప్పుమంటివి? నాపతి మోహనుఁడు.

చం—ఈచిలుకపలు కెప్పుడు నాయొద్దఁ బలుకలేదే! ఆఁ! ఆ మోహనుఁ
డెవ్వడు? ఏ మోహనుఁడు?

కో—మన కారాగృహములో నున్న మోహనుఁడు.

బు—(తనలో) అయ్యయ్యో! నాపతికిఁ గారాగృహనివాసయోగము
తటస్థించినదా? హా! మోహనుఁడా! నీవు కారయందు బద్ధుఁడవై
యుంటివి. నేను నగరునందు నీకొఱకేడ్చుచు బద్ధురాలనై
యుంటిని కాని నాకంటె నీవె యదృష్టవంతుఁడవు. అక్కడ నీ
కత్తగారిపోరును, మాఱుమనువుబాధయు లేకున్నవి.

చం—ఆఁ! ఆఁ? వాఁడే? ఆ మోహనుఁడే? ఆ నిర్భాగ్యుఁడే? ఆ నీచుఁడే?
ఏమి! బుద్ధిమతీ! ఇంత బుద్ధిలేనిదానవా? నీకుఁ గన్నులులేవా?
మన సున్నదా? యుక్తాయుక్తవిచక్షణత గలదా? గుణగ్రహణ
మున్నదా? మంచిచెడ్డలకు భేద మెఱుఁగుదువా? ఉర్వీనాథుఁ

డెక్కడ; ఉపగ్రహముఁ డెక్కడ? ఆఖండలవైభవుఁ డెక్కడ; అధమాధముఁ డెక్కడ? సర్వజనపరిపాలనదీక్షాదక్షుఁ డెక్కడ; శాశ్వతాభీలశిక్షాపాత్రుఁ డెక్కడ? చీ!చీ! ముడుచుకొని మూలగూరుచుండి మూడుసోలల మొక్కజొన్నలు మెక్కు మోహనుఁడు నీకు ముద్దులమగఁడా? ఓసీ! అపవిత్రురాలా! ఆచార మక్కఱ లేదా? అన్వయమర్యాద యక్కఱలేదా! అవమానభయముతో నీకుఁ బనిలేదా? ఆఁ! ఆఁ! కారాగృహమునం దున్న దుర్మార్గునే వలచితివా?

కో—(తనలో) అమ్మా! అమ్మా! తిట్టకుము. నేనుగూడఁ గారాగృహమం దున్నవానినే వలచితిని.

వసం—అమ్మా! కారాగృహమం దుండువారందఱును దుర్మార్గు లగుదురా?

చం—నాకొడుకు వసంతుఁడు తప్పకాని, యీచండాలునకు నీమోహమునకుఁ గారాగృహప్రాప్తి యేల యయ్యెనో నీ వెఱుఁగుదువా?

వసం—అమ్మా! సెలవిచ్చెదవుగాక! (తనలో) హృదయమా! నీవు భయపడినట్లే జరిగియుండునా? అటులే యైనయెడల శీఘ్రముగఁ బగిలిపొమ్ము.

చం—ఎవతెనో బలాత్కరింపఁ బ్రయత్నించెనఁట!

కో—(తనలో) ఎవతెనో యన నేల? నన్నే.

వసం—ప్రయత్నించుటయే కద!

కో—(తనలో) అంతకంటె వానితర మగునా? నేను రాజకులోద్భవను కానా? అభిమానధనను కానా? క్షాత్రలీలాకాంతను గానా? ఆపత్సమయమున నభిమానావనముఁ జేసికొనలేక పోయిన యాఁడుదాని బ్రదు కేల?

చం—ప్రయత్నించుట కాకపోయిన నాపాపి సఫలితమనోరథుఁ డగునా! ఆమె యేమహానుభావురాలో! యే మహాపతివ్రతయో—

కో—(తనలో) నీ కోడలే.

వసం—(తనలో)

గీ॥ హృదయమా! గిట్టు మని త్రిప్పి ♦ యిలను గొట్టఁ
బడితి వింతకు ముందు; నీ ♦ వడఁగి యాఱి
పోయి తనుకొంటి తడిమఁటి♦గుడ్డలాగు;
కెరలి కందుకము ట్టుబి♦కితివి మఱల.

బు—(తనలో) నానాథుఁడు కోకిలను బలాత్కరింపఁ బ్రియత్నించి యుండెనుగాఁబోలు! ఆతఁడు మిగుల మంచివాఁడే. కాని, పూర్వకర్మపరిపాకమునుబట్టి యీజన్మమున నాతని కీదుర్యోగము తటస్థించెను. ఆతనిబుద్ధి యింక నితరకాంతలపైఁ దగిలిన సరే, యింక నాతని కధమాధమస్థితులు లభియించినసరే, యాతఁడే నానాథుఁడు. ఆతని గాదని మహేంద్రుఁడైన నొల్లను. అట్టిచో నీరా జన నా కెంత?

చం—అబ్బాయి! ఈదాసి యెవతెయో యెఱుఁగుదువా?

కో—ఇంతసేపటినుండియు దానివంకనే చూచుచుంటిని. ఇట్టి మొగము గలదానిని మఱియెక్కడనో చూచినట్లున్నది.

వసం—ఎచ్చటఁ గాంచినట్లున్నదో జ్ఞప్తి తెచ్చుకొనఁగలరా?

కో— గీ॥ కాంత, జ్ఞప్తి, సౌఖ్యము, తమ♦యంత తామె
దేని దగు పురస్కృతినొ సి♦ద్ధింపవలయుఁ
గాక రావలయు నని యా♦కర్షణం బొ
నర్పఁ గవితమాదిరిని వె♦న్కకును బోవు.

బు—ఈనీతి యెఱిఁగినవాఁడవు న న్నేల యాకర్షింపఁ దలఁచితివి?

చం—పండ్లూడఁగొట్టెదను. నోరు మూసికొనుము. నీ దొకజన్మమే యని సిగ్గులేక మాట లాడుచుంటివా?

కో—(తనలో) ఓసీ! వెఱ్ఱిబుద్ధిమతీ!

గీ॥ ఏను నీవంటిదాన నం ♦ చెఱుఁగ వీవు,
నీకు మోహానుపై బుద్ధి, ♦ నాకు నల వ

సంతుష్టి; మనలను జోడు ♦ నలుపఁదలఁచె
నమ్మ! ఱోటిని దిరుగలి♦దిమ్మనట్లు.

చం—నాయనా! ఈదాసిని నీ వెప్పుడు చూచి యుండలేదు.

కో—దీనిని జూచితి నని చెప్పియుండ లేదు. దీనివంటిదాసిని.

వసం—(తనలో) నావంటిదాసిని నీవేకావు, ప్రపంచమున నెవ్వరు చూచియుండరు.

గీ॥ లోన మగవాఁడు, రాజబా♦లుండు; పైకి
నాఁడుపడుచు, బానిస; యెంత ♦ యంతరంబొ
పైకి, లోనికి; షండతా♦భావమునను
గొజ్జకంటెను ఖరతరా♦ఘుండ నేన.

కో—మొగముతీ రిదియే, రాత్రిభాగము కావున బాగుగఁ జెప్పఁజాలను.

చం—దాని నెక్కడఁ జూచితివో? ఎప్పుడు చూచితివో? అదిమాత్రమిది కాదు. ఏలన—ఇది మాపుట్టింటివారిచే నా కరణమీయఁబడిన ముసలిదాసికి సన్నిహితబంధువఁట. అదియే దీనిని బాగుగా నెఱుఁగదు. నిన్ననే వచ్చినది. తెలివిగలది. నాకు విశ్వాస మగు స్థానమునుండి వచ్చుటచే దీనిని నీవుకూడ నమ్మవచ్చును. చిన్నరాణికిఁ జిన్నదాసి యుండుట యావశ్యక మని బుద్ధిమతికొఱకు దీని నుంచితిని. ఏదీ? ఆనిర్భాగ్యురాలికి రాజ్ఞియోగముకూడనా? నిక్షేపమువంటి చక్రవర్తిపుత్త్రుఁడు—రూపవంతుఁడు—యౌవనసంపన్నుఁడు—విద్యావంతుఁడు—ధీశాలి—వాక్చతురుఁడు—వినయధురీణుఁడు— సుగుణసంపన్నుఁడు— మాతృవిధేయుఁడు—వరింప మూతిబిగించుకొని, యెడమొగము పెడమొగముఁ బెట్టుకొని, కన్నులు చిట్లించుకొని, పెదవి విరుచుకొని, కోతివలె నిగిలించుచు, సిగ్గులేక—మర్యాదలేక—దౌర్భాగ్యుని—అధముని—ఎందఱు చెలులనో చెఱఁబట్టి, తాఁజెఱఁబడిన పాపాత్ముని—వలచి—వలచి—ఛీ! దిక్కుమాలినదానా! నీ వెక్కడనుండి వచ్చితివే? నీబుద్ధి బుగ్గియగువఱకు మాఱునా?

వసం—అమ్మా! శాంతింపుము.

చం—ఇదివఱకు శాంతించితిని. ఇప్పు డెక్కడి శాంతి! ఆమహారాజే గినాఁడు; శాంతినొందలేదా? ముద్దుముద్దుగ నొడిలోఁ బాలుద్రావు మూఁడేండ్లకొడుకు ముక్కలై పోవఁగ శాంతినొందియుండలేదా? అయిన దేదో యైనది. ఈపైన వానిమూలముగఁ గాపురమీఁదఁ దలఁచియుండి వాని నొక్కయింటివానిని జేయఁబ్రియత్నింప, నందుల కీ బానిస యంగీకరింపక పోవలయునా? నిర్దాక్షిణ్యముగఁ దిరస్కరింపవలయునా? పెంచిన పెద్దతన మైనఁ జూపవలదా? ఇఁక నే నెట్లు శాంతింతును?

కో—అమ్మా! మూఁడేండ్లకొడుకు ముక్కలై పోవఁగ నంటివి—అ దేమి? ఆతఁడు సార్వభౌమరాష్ట్రమునఁ గారాగృహబద్ధుఁడై యున్నాఁడుకదా!

చం—ఉన్నాఁడు; ఏ పులివాతనో! ఏ నీటిగోఁతనో!

వసం—(తనలో)ఇచ్చటనే నీవ్రక్కనే యీ నిర్భాగ్యుఁ డున్నాఁడు.

కో—అమ్మా! ఆతఁడు మరణించినట్లు యథార్థవార్త లేవియు రాలేదుగద!

వసం—(తనలో) ఒకసారి మరణించినట్లు కాదు.

గీ॥ ఎపుడు నాప్రాణ మగు కాంత • యేగె నపుడె
చచ్చితినీ; తల్లి ననుఁ జేరి • చచ్చె కొడుక
టంచు విలపింపఁ జచ్చితి; • నకట! మఱల
జగతికే మొట్టమొదటనే • చచ్చినాఁడ.

చం—ఇఁక నెక్కడి కొడుకు? ఎవు డడ్డాలనుండి జారిపోయెనో యప్పుడే యాన వదలు కొంటిని. ఇంక నీ వెత్తే యేమి?

వసం—(తనలో) బుద్ధిమతీ! నేను జీవించియున్నట్లు నీ వెఱుఁగుదువుగదా! నీవైనఁ జెప్పరాదా?

చం—ఈయువకాశమును దీసికొని మనరాష్ట్రమున కానఁబడి 'నేనే వసంతుఁడ, నేనే వసంతుఁడ' నని దొంగవేషములు వైచుకొని యింక

నెవ్వారైన నిటకు వత్తురు. ఇప్పుడు రెండవరాష్ట్రముకూడ మనకు సిద్ధించిన దాటచే మఱింత యాసపడి వత్తురు. నేనే వసంతుఁడ నని వచ్చినవానిని, వాఁడు వసంతుఁ డని స్థిరపఱుచువానిని నాసెల వక్కఱ లేకయే తుపాకిని వేయు మని నేను నిన్ననే ద్వితీయసేనాధిపతికి నాజ్ఞయిడితిని.

వసం—(తనలో) అందుచేతనే నే నీ సిగ్గుమాలిన వేసమును ధరించి రూపుమాపుకొని యి ట్లుంటిని.

కో—హరిహరీ! అంత దారుణమైనయాజ్ఞ నేల సేయవలయును?

వసం—(తనలో) సెబాస్! రాజపుత్రా!

ఆ॥ వె॥ నాకు వైరి వీవు; ♦ నాతల్లి యగు నీమె;
యంతకంటె నీవె ♦ యధికకృపను
గల్గువాఁడ వైతి! ♦ కాలమా! నీచర్య
లింత వైపరీత్య ♦ మొనెసె నేమి?

ఆ॥ వె॥ తల్లియైన నేమి? ♦ తండ్రియైనను నేమి?
పుత్త్రుఁ డధికుఁడైన ♦ మఱియుచుండు;
కాకయున్న సుతుఁడు ♦ గాఁడు; మా కను మహా
కలియుగంబు వచ్చెఁ♦గాదె? యిపుడు.

చం—అబ్బాయీ! దారుణమైనయాజ్ఞ యని నీ విప్పు డంటివి! అట్టివాఁడు తటస్థించినయెడల రాజ్య మెంత కల్లోల మగునో చిన్నవాఁడవైన నీ కేమి తెలియును? ఊరకుండుము.

వసం—(తనలో) అట్టివాఁ డిప్పు డిచ్చుటనే తటస్థించినాఁడుకదా? ఏమి యగునో చూచెదముగాక!

కో—(తనలో) రాజ్యము కల్లోలమైన సరే, ప్రపంచము తలక్రిందైన సరే, ఏది యేమైన సరే, నాకు వసంతుఁడే కావలయును.

చం—వాహినీ! చూడు! మన మేదో పిచ్చి, పాటి, కష్టము, సుఖము మాటలాడుకొనఁగఁ—జూడు! తాను మూతి ముడిఁబెట్టుకొని సరోనలాడుచుఁ బ్రపంచమునంతను దానే యుద్ధరించున ట్లున్నది.

అబ్బ! ఇంత యొంటరిమొత్తుదాని నే నెచ్చటను జూచియుండ లేదు.

వసం—బుద్ధిమతీ! ఏల సిగ్గు! ఇక్కడ నీమగఁడు తప్ప మన మంద అము కాంతలమే కద! నీకు సందేహ మేఁల?

కో—(తనలో) మగనిగూడ మగువలలోనే చేర్చుకొనుము.

చం—సిగ్గందు వేల? తగుమాత్రపుసిగ్గు నగయే. సిగ్గు కాదు. నాలిముచ్చుఁదనము—పెంకిశ్రుతి—కట్టుపడి—మొండివేసము—ఎందులకు? ఎందులకు? ఇఁకను నే నేదో తెగతెంపులు చేసికొనఁ దలఁచుకొంటిని. నాయనా! ఈ బండను మఱియొకసారి కదిపి చూడు. ఇటో యటో స్థిరపఱుచుకొని మఱి పోయెదను.

వసం—అమ్మా! ఈ బొమ్మలపెండ్లితో నీ కేమి ప్రయోజనము?

చం—బొమ్మలపెండ్లి యైనఁ, గావలసిన దే మున్నది? మన యిష్టత వచ్చిన బొమ్మను మరియొక బొమ్మతోఁ గూర్తుము. ఇక్కడ నట్టి యవకాశ మే మున్నది? అమ్మయ్యో! ఈ గయ్యాళి నేను జెప్పినట్లు వినునా? ఈరాకాసి నామాట లక్ష్యముసేయునా? ఇటు చూడుమన్న నటు చూచును. ఇటు తిరుగు మన్న నటు మూతి త్రిప్పును. ఎంత స్వతంత్రత! ఎంత చండితనము! ఎంత మూర్ఖత! ఎంత మోటపాకము!

వసం—అమ్మా! నాకుఁ దెలియక యడుగుచుంటిని. ఈవివాహమువలన సుఖ మెవరికి?

చం—నాకు. మఱ యెవ్వరికి? నీకు మతి లేదా? అటు లడిగెద వేల?

వసం—అమ్మా! అసందర్భముగ లేదా? అటు లనెద వేల?

చం—ఆఁ! ఆఁ! అసందర్భమా! నావయసు వల్లకాదై, నాదాంపత్యము దగ్ధపటలమై, కాటికిఁ గాళ్ళుచాఁచుకొని యదిగో! యిదిగో! యన నున్న నాకుఁ జిలుక, గోరువంకవలెఁ బలుకులాడుకొనుచు, ముద్దుముద్దుగ ముఱియుచు, "కీ, కా" యని కెరలాడుచు వీ రిద్దఱుండఁగ నేను జూడఁగోరుట యసందర్భమా?

వీరి యాలాపములు, అల్లరులు, 'ఆఁ ఊఁ' లు విని నే నామో దింప వాంఛించుట యసందర్భమా ?

వసం—అమ్మా! కోపపడకుము. భార్యాభర్తల సమాగమము ముందుగా మూలనున్న ముసలిదాని ముచ్చటకా ?

చం—సరి. సరి. కొడుకు, కోడలు గూడి రని మేము కొంతుక కురిపోసి కొని చావవలసినదా యేమి? ఈపాటికి నోరుకట్టిపెట్టుకొనుము.

వసం—అమ్మా ! కోపము వలదు. అన్యోన్యానురాగము లేని సతీపురు షులఁ గూర్చుట తప్పుపని.

చం—అన్యోన్యానురాగ మని యిపు డొకకొత్తమాట దాపురించినది. మా అబ్బనాఁ డెఱుఁగము. మాతాతనాఁ డెఱుఁగము. ఈ విచిత్రము—ఈవిపరీతము—ఈలోకవిరుద్ధత—"పెండ్లిచేసుకో" యనుసరికి నోరుమూసికొని, కిక్కురు మనక, చచ్చినట్లు చేసికొనుటయేకాక యెప్పుడైన నెఱుఁగుదుమా ? ఈశవభివలు—ఈజాణతనములు—ఈయన్యోన్యానురాగములు—ఈయభినవ నాగరికతలు ! అన్యోన్యానురాగము లానక యాపోసన మైన తరువాత కలుగఁ గూడదా ? ఒకరిద్దఱు సంతానము గలిగిన మీఁదటఁ గలుగఁ గూడదా ? కలుగకపోయినమాత్రము బాధ యేమున్నది. మాయాయనకు నాకు "హరీ" యన్నవఱకు రాగ మారభించినట్లు కనఁబడనే లేదు. లేదని కాపురములు చేయలేదా? పిల్లలఁ గనలేదా? దానిలోపము చేతి కడ్డమా? నోటికడ్డమా?

కో—(తనలో) నీనోటికిఁ జేతికి నేమియు నడ్డము లేదు.

వసం—(తనలో) ఆహా! ఈమెయజ్ఞానము పరిమితిలేక ప్రకాశించుచున్నది. (ప్రకాశముగ) అమ్మా! బుద్ధిమతి కీ రాజబాలునిపై ననురాగము గలిగినపిమ్మట వారిఁ గలుపవచ్చును. అంతవఱకు వేచి యుండుము.

బు—(తనలో) అది స్వప్నవార్త.

చం—క్రమక్రమముగా నదే కుదురు నని నేను జెప్పియుంటినిగాదా?

కో—(తనలో) క్రమక్రమముగఁ గుదురుట కిది యేమి రోగమా?

వసం—నామనవి విని వారి కనురాగము కలుగువఱకు నీవు తొందర పడకుము.

చం—ప్రేమములు గలుగువఱకు సంబంధములు పీఁటలు పెట్టుకొని కూరుచుండునా? అన్నవు డెల్ల రాజసంబంధములు తటస్థపడునా?

వసం—రాజసంబంధమే కాని సమకూడిన వీలులేదా?

చం—వీలున కెక్కడికి? బొందునఁ బుస్తెను గట్టుకొని కూరుచుండినఁ గొట్టువా రెవ్వరు? కాని రాజసంబధమునఁ గల్గులాభము లిన్ని యని చెప్పఁదరమా? ఒడలు పట్టినన్ని నగలు! వేలకొలఁది జల తారుబట్టల పెట్టెలు! అడుగులకు మడుఁగులు! "ఆఁ!" యను వరికి గడగడలాడు నాశ్రితులు! అంతఃపురమున హంసతూలికా తల్పములు! మణుఁగులకొలఁది వెండిబంగారములు! గజములు! కంఖాణములు! కంచరగాడిదెలు! కాలి కొక్కదాసి! కరమున కొక్కదాసి! కణువున కొక్కదాసి! తెగులా! పోఁగాలమా! నిక్షేపములాగు ననుభవింపలేక—తెగనీలుగా! ఆఁ!

వసం—అనుభవింపఁదగిన వస్తువులు ననంతరారనత్వమునే చెప్పితివికాని దంపతులసుఖముమాట చెప్పవైతి వేమి? అమ్మా! భర్తను నిర్ణ యించుకొనుటలో స్త్రీకిఁ గొంత స్వాతంత్ర్య ముండఁదగు నని నా యభిప్రాయము.

చం—ఇదిగో! ఆసంబర మైనది కాదా? ఆ యవశిష్టత దీరినది కాదా? ఏరినది! ఏరినది! మహాచక్రవర్తియైన మగనిని—కడుపునిండినకాం తుని—ఆఁ! వలచినది! ప్రేమించినది! సర్వస్వతంత్రతచే మోహిం చినది!—బండ్లులాగు బానిసను—ఎన్నికాఁపురములో దిబ్బలు దీర్చిన విటాధముని—ఆఁ! ఆఁ! అమ్మగారికిఁ గాళ్లులకు గొలుసులు లేకపోయిన నయ్యవారికి గలగలలాడుచున్న యినుపగొలుసుల సింగార మున్నది! అమ్మగారికిఁ జేతికిఁ దొండవుగొలుసులు లేక పోయిన నయ్యవారిచేతులకు బొండగొలుసు లున్నవి! అమ్మ గారి కంతఃపురనివాసము లేకున్న నయ్యవారికిఁ గారాగృహని

వాస మున్నది! అమ్మవారికి గృహసంచారమున దాసదాసీజను లు లేకున్న నయ్యవారికి గ్రామసంచారమున ననేకదాసజనపరి వార మున్నది! ఆఁ! సమృద్ధి! ఇఁక సుఖమునకు లోప మేమి? అయ్యవారినెత్తిపై మట్టితట్ట! అమ్మవారినెత్తిపైఁ బేడపట్ట!— ఇదిగో! స్వతంత్రతాఫలము. స్వతంత్రత చట్టుబండలైనది! వాహి నీ! నీ వీవిషయమున నాతో నింతవాద మేల చేసెదవు? ఇంక నోరు మూసికొనుము. జాగ్రత! నీవుకూడ మాపెద్దమ్మవలెఁ జదు వేడ్చితివా యేమి?

వసం—అమ్మా! క్షమింపుము. (తనలో)

గీ॥ తనకుఁ దోఁచదు, బోధింప • వినదు, వార్ధ
కంబునను మొండిపట్టు బిం•కముగఁ బట్టు
గద; యబలయు నరిసెలపా•కంబు ముదురు
కొలఁదిని గొఱుక రానట్టి•కొయ్య గావె?

చం—నాయనా! ఏదీ! యింకొకమాఱు దాని నూఁపి చూడుము. ఏదో నాయిష్టము వచ్చినదారిఁ ద్రొక్కుదును. కానీ! వేగఁ గానీ! నాప్రాణము విసిగిపోయినది.

కో—(తనలో) హరిహరీ!

గీ॥ ముదుసలికి నుచితత లేదు; • బుద్ధిమతికి
లేదు వలపు; మగతనము • లేదు నాకు;
నిఁకఁ బ్రపంచయాత్ర జరుగు • టెట్టు మాకు?
మూఁడులేదుల యద్వైత•మునకుఁబోలె.

(ప్రకాశముగ.) (బుద్ధిమతిని సమీపించి)

ఆ॥ వె॥ వాఁడిచూపుగమికి • భయపడి నే నీదు
ముద్దుచెక్కు లిట్టె • వుడుకకుండఁ
బోవఁగలనె? ముండ్ల•పోటున కల్కి! గు
లాబిపూవు నెవఁడు • లాగకుండు?

(బుద్ధిమతిబుగ్గలు నలుమగఁ గోకిల చేయి చాఁపఁగ బుద్ధిమతి యాచేతిని దనయెడమచేతితోఁ ద్రోయును.)

బు—ఆఁ! ఆఁ! నే నేమి స్వైరిణి ననుకొంటిరా?

చం—ఆఁగు. ఆఁగు. అమట్టున కాఁగు. ఏమీ! ఆతఁడు చేసినతప్పేమి! ముద్దుముద్దుగ బుగ్గలు నులుమఁబోఁగ నింత యాగడమా? ఇంత యల్లరియా? ఇంత గయ్యాళితనమా? పండ్లు విఱుగఁ బొడిచిన యెడల నీకుఁ దగిన బుద్ధియే వచ్చియుండును.

బు—అయ్యా! మీరు మహారాజులరు. సర్వసద్గుణ సమలంకృతులు. సమస్తవిద్యా పారంగతులు. అయినను మీపై నాప్రేమము ప్రసరింపలేదు. క్షమింపుఁడు. నేను వలసిన యాతఁ డధముఁడే కావచ్చును. ఐన నా కాతఁడే ఘనుఁడు. ఆతఁ డనాకారుఁడే కావచ్చును. కాని నాకంటి కతఁడే మదనసముఁడు. ఆతఁడు మీదృష్టిచేత నేరీతిగ నుండునో యది నా కావశ్యము కాదు. ఆతనితో జోక్యము నాకుకాని మీకుకాదు. ఆతని కర్హమైన యీదేహమును మీరు స్పృశింపఁ బ్రయత్నించుట న్యాయమా! మీరు సర్వమును దెలిసినవారేకద!

కో—(తనలో) ఆహా! ఆఁడుది యన్న నిదియే. అనురాగ మన్న దీనిదే. ఆహా! భర్తునియవ్యాజభక్తివలె నీమె భర్త్రనురాగము ప్రకాశించుచున్నది.

చం—(ఉస్సు రనుచు) ఓసీ! బానిసా! ఏ మంటివి? ఇటు చూచి చెప్పుము.

బు—అమ్మా!

చం—అదిగో! ఆవంకకూఁత కూయవలదనే కాదా మొన్న నెత్తి వాయఁ గొట్టినది.

వసం—(తనలో) హరి హరీ!

బు—నేను మీకుఁ గోడలనైనను మీపరిచర్య సేయుటకే కద! నేను భృత్యురాలనై యంతకంటె నెక్కువ చేయుదును. నన్ను క్షమింపుము.

చం—నీవు నాకోడలవు కాకుండిన యెడల నిన్ను నాకొంప నుండనిచ్చెదనా? నీసేవ నంగీకరింతునా? నీమానాభిమానములు దక్కనిచ్చెదనా? నీగొంతుఁ గోయకుందునా? ఆఁ! ఎంతభయభక్తులు లేని పతివ్రతనము! నిర్భాగ్యురాలా! నోటికి సిరిలేక, యొడలికి సువర్ణభారవహనయోగము లేక, కంటికి మహావైభవదర్శనయోగము లేక, నెత్తిపై నినుపగజ్జలతల్లి భాగవత మాడ నీకు మంచిబుద్ధి యేల పుట్టును? అధమా! పిశాచీ! చండాలినీ! (కొట్టును.) నేఁటిరాత్రిమొదలుకొని నీకైదుదినములు మితినిచ్చితిని. ఆమితిలోపుగ నీవు నాకొడుకును జేసికొన నంగీకరింపవలయును. లేనియెడల నాఱవదిన ముదయమున నిన్నురి తీయింతును. నిశ్చయముగఁ జెప్పుచున్నాను. జాగ్రత్త! బాగుగ నాలోచించుకొనుము. ఇతఁడు నీకు మగఁడు; ఈరెండురాష్ట్రములు నీవి. అదిగాక నాయొద్ద నున్న వస్తుసమూహమంత నీది. బాగుగ నాలోచించుకొనుము. పో. ఇఁక లోనికిఁబొమ్ము.

బు—నేను సెలవు తీసికొందును. (కోకిలవంకఁ దిరిగి) అన్నా! నమస్కారము. (నిష్క్రమించును)

చం—చీ! నీమొగమిూడ్వను! నాయనా! నీమనను విఱుగునట్టుకూడఁ జేయుచున్నది. జాగ్రత! నీవు నీయతఃకరణవృత్తిని మార్చుకొనఁగూడదు. అది నీకు భార్యకాక తప్పదు.

వసం—(తనలో) అబ్బ! ప్రాణము విసిగినది.

గీ॥ ఇరుగుపొరుగిండ్లకలహాల ♦ కింటిలోని
కుంపటులకు, సతీపతు ♦ ల్గుడుచుఖేద
ములకుఁ, బదునాల్గుపాళ్ళు లీ♦ముసలిముండ
గమియె నిశ్చయముగ మూల♦కారణంబు.

చం—నాయనా! నే నిఁకఁ బోయి శయనింతును. వాహినీ! బుద్ధిమతికి బుద్ధి వచ్చినదనుక వివాహ మాఁపి యుంచవలయు నన్ను మఱియొకబాధ యున్నది.

వసం—అది యేమి?

చం—వివాహ మైనగాని పట్టాభిషేకము సేయరాదు. పట్టాభిషేక మైనగాని ప్రజలకు శాంతిగలుగదు. ఇది మహాసాధ్యనమయము గ నున్నది. సార్వభౌముని రాష్ట్రముగూడ మనదానిలోఁ జేరిన దని బుజములెగురవై చిన లాభములేదు. దాని ననుకూలముగఁ బరిపాలింపవలయును. ఆముసలిరా జిక్కడ నున్నాఁడు. ఆతని విడిపింపఁదలచి కాని, నాకుమారునికి హానిసేయఁదలచి కాని, యనేకులు కుట్రలు సేయవచ్చును. ఈనినపులులవలె సేనాధి పతు లతిదాహముతో నున్నారు. ఏమియుఁ దోఁచకున్నది.

వసం—అమ్మా! ఎందఱు మగవాండ్ర వ్యవహార మన్న మీావ్యవహార మున కందునా?

చం—(నవ్వుచు) ఆలాగే కొట్టుకొని వచ్చుచున్నాను. నాయనా! నే నింకఁ బోవలయును. నేను వాహిని నిక్కడ నుంతునా?

కో—ఉంచినఁ బ్రమాద మేమి?

చం—వాహినీ! నీవు జాగరూకతగా నీతని గనిపెట్టి యుండవలయును. వీవనతో విసరికాని, పాదములొత్తికాని యాతని నిదురపుచ్చ వలయును.

వసం— సరే.

చం—నాయనా! నేను బోవుచుంటిని. జాగ్రత్త!

(చంద్రిక పోవును.)

కో—(మంచముపై శయనించి తనలో)

ఆ॥ వె॥ అమితవిభవ మున్న ♦ నప్పుడపుడు కష్ట
మొ' ,లుగకుండ ♦ సుకము లేదు;
లలితలలిత మగు త•లాడపై నను జేతి
యడ్డు లేక నిదుర ♦ నందఁగలమె?

(తలాడపైఁ జేవైచును.)

(ప్రకాశముగ) వాహినీ! కుడికన్నదిరిన నేమి ఫలము?

వసం— మగవారికి మేలు.

కో—ఆఁడువారికి?

వసం—కీఁడు.

కో—మగవారు, నాఁడువారు గానివారికి ?

వసం—(తనలో) న న్నీతఁడు గుర్తుపట్టి యుండెనా యేమి ? (ప్రకాశ ముగ) మహాప్రభూ ! స్త్రీపురుషులుగూడఁ గానివా రుందురా ?

కో—గీ॥ మూతిపైఁ గోరమీసాలు ♦ మొలను గత్తి
లోఁ బిఱికిగుండె గలయమ్మ♦లు భువి నెంద
ఱో, పయిఁటమాటునను గత్తి♦నోగ్రహృదయ
ముఁగల పేడియయ్యలు నంద♦ఱుగద ! వెలఁది !

వసం—(తనలో) ఈతఁడు నావికృతవేషమును, గతినవ్యాపారము బసికట్టినట్లు చెప్పినాఁడు.

కో—(తనలో) హా ! వసంతా ! ఎచ్చట నుంటివోయి ! ప్రాణనాథా !

ఆ॥ వె॥ నిదురఁ బోవనుండ ♦ నీస్మరణం బగు
నిదుర లేచునపుడు ♦ నీస్మరణమె
నిను స్మరియింపనట్టి ♦ నిముసంబు లే దయ్య !
కష్ట పెట్టె దేల ? ♦ కరుణ లేక.

హా ! వసంతా ! (నిదురించును.)

వసం—అయ్యో! అయ్యో!—పలుకకున్నాఁడు. అప్పుడే నిదురపట్టెను గాఁబోలు! హా! ఎంత యదృష్టవంతుఁడు!

గీ॥ కల్పకములో, మాసంబులో ♦ గడియలో, యుగ
ములో, గడిచెఁ; గోకిలాచంద్ర♦ముఖిని బాసి
రుచి యెఱుంగను; నిదుర యె♦ఱుంగను; నోడ లె
ఱుంగ; మిన్నును మన్ను నె♦ఱుంగ; నకట!.

హా! కోకిలా! ప్రాణకాంతా!

గీ॥ కారయం దుండి ని న్నొక్క♦మాఱు దినము
నకుఁ గనఁగఁ దృష్టిలేక య♦నవరతంబుఁ

గాంచఁగా నెంచి యీపాట్లు ♦ గాంచితిని; దు
రాశ పూర్వమునున్మూలనం♦హా ర్త్రికాదె?
నీకొఱకే నే నిప్పు డొకపనిఁ జేయవలసి యున్నది.

గీ॥ యామినికిఁ గాంచి యీవేళ; ♦ యఖిలజనులు
కరము లెదఁ జేర్చి హాయిగాఁ ♦ గాంతురి నిదుర;
పశ్చిమార్ధగోళముతక్క ♦ పరమభాగ్య
హీనసార్వభౌముఁడ నైన ♦ నేనుదక్క.

గీ॥ ప్రకృతి యెడ లెఱుంగని మహా♦వస్థ నడఁగె;
భయదనిశ్శబ్దతాదశ ♦ పర్వె నెల్ల
యెడ; నితఫి చిన్నగుఱుక, నా ♦ వెడ గుసగుస
లు, గడియారపు టిక్కులే ♦ మిగిలెఁ గాని.

గీ॥ జపము చేసెడువానికి ♦ జనరహస్య
వధ మొనర్చువానికి నీ య♦వసరమె తగుఁ;
గోకిలానామజపము చే♦కూఱె నెపుడు
జనవధముకూడ నిప్పుడు ♦ సంభవించు.

గీ॥ ఖడ్గమా ! యట నిదురించు ♦ క్ష్మాపతీందు
హృదయమున ! ఖసుక్కున దూఱి ♦యేగవలయు
హ స్తమా యలవాటు లే♦నట్టిదాన
వైన, దయయుంచి పడఁకకు ♦ మంతనేవు.

(చిటిక వేయును.)

హా! కోకిలా! హా! కోకిలా! (ప్రక్కను సమీపించును) నేను బరమసాత్వికుఁడను. నామహాపారబ్ధముచే నీపనిఁ జేయవలసి వచ్చెను.

గీ॥ అదె? కను లుమ్మూసి శయనించు; ♦ నదె హృదయము
ఖడ్గమా! ముగింపవలయు ♦ క్షణములోన;
ఇదిగొ! గుఱిచూడు! జాగ్రత ! ♦ యింక నేను
గనఁగఁజాలఁ; గనుల మూసి♦కొనెద; నిదిగొ!

(పొడుచును.)

కో—హా! హా! హా! ఎవ రక్కడ? నన్నుఁ జంపుచున్నారు! అయ్యయ్యో! నెత్తురు. అదిగో! పట్టుకో! పట్టుకో!

(ఇద్దఱుభటులు ప్రవేశించి వసంతుని బట్టుకొందురు.)

భటులారా! రాజహత్యను సంకల్పించుకొనినదీనిఁ గారాగృహమం దుంచుఁడు (తనలో) అమ్మయ్యో! నే నింక మాయమ్మ యొద్దకుఁ బోదును. (నిష్క్రమించును.)

వసం—(తనలో)

హా! ఈ ప్రయత్నముకూడ విఫల మయ్యెనా? విఫలము కాదా? కంటితోఁ జూడలేకపోయితిని. చేతికి బింకము లేకపోయెను. కారాగృహప్రవేశ మిది నాకు ద్వితీయపర్యాయమా?

గీ॥ ప్రాణపదమైన కోకిల ♦ పాటిపోయెఁ;
గన్నతల్లికిఁ గొడుకును ♦ గాక యుంటి
నాదుకోటలో దాసి నై ♦ నాఁడ నేనె;
యిది విఫలమయ్యె; నేమైన ♦ నింక నేమి?

హా! కోకిలా!

(నిష్క్రమించును.)

ఇది తృతీయాంకము.

శ్రీ

# కోకిల.

## చతుర్థాంకము



[ప్రదేశము—శ్రీపురమునందలి వీథి]

(ప్రవేశము—గోపాలుఁడు)

గో—అబ్బ! ఏమిప్రజ! ఈజను లంద ఉరికంబములయొద్దకే పోవుచున్నారు కాఁబోలు! ఆహా! ప్రకృతి యెంతవిపరీతముగా నున్నది!

గీ॥ పరులసౌఖ్యముకంటె నాపదయె యధిక
సుఖకరము నరునికి; సొంత ♦ సుఖతఁ దనకుఁ
గలముదముకంటె నితరుల ♦ కష్టకలనఁ
గలుగుసుఖ మెన్నొమడుఁగులై ♦ వెలయు; నకట.
ఓ రామభద్రా!

రామ—(ప్రవేశించి) ఎందులకుఁ బిలిచితివి? త్వరగఁ జెప్పుము. నేను వేగఁ బోవలయును.

గో—ఇంకఁ దొందర లేదు. వ్యవధి రెండుగడియ లున్నది.

రామ—జను లనేకులు చూడఁ బోవుచున్నారు. ముందుగ వెళ్ళినఁగాని తగిన స్థలము లభింపదు.

గో—తగినస్థలము మీకుఁ జిక్కకపోయినను వా రున్నతస్థలమున నుంచఁబడుటచేఁ మీకు బాగుగఁ గనఁబడుదురు కాదా?

రామ—నాకు వారు కనఁబడ నక్కఱ లేదు. వారిమాటలు నాకు వినఁబడ నక్కఱ లేదు.

గో—ఇఁక వారిమాట లే మున్నవి?

రామ—ఉరికంబములపై వారి నెక్కింపకముందు వారు చేసిన తప్పేదియో, యట్లు చేయుటకుఁ గారణ మేమియో, వారిఁ జంపకుం

టకుఁ దగినబలవత్కారణ మేమైన నున్నదో వారివలన రాజు గారు తెలిసికొనెద రఁట!

గో—శిక్ష విధింపఁబడకముందు జరుగవలసిన యీవిధి యిప్పు డేల?

రామ—ఏలయని న న్నడిగెదవేల? పోయి సర్వస్వతంత్రియగురాణి గారి నడుగుము. ఉరిదీయుట చిరకాలమునుండి యుదయమున నాచారమై యుండఁగ నిప్పుడు దీపములు పెట్టినతరువాత నేమి?

గో—రాణిగారైన నేమి? వెనుకది ముందు ముందుది వెనుకఁజేయఁ దగునా?

రామ—సరే తగదయ్యా! వ్యత్యాసముగఁ జేసిన వారిని దప్పుపట్టువా రెవ్వరు?

గో—ఎవ్వ రేమి? తప్పని ఘోషించుచట్టము లేదా?

రామ—చట్టమున కేమి? నోరా? చేయియా? చట్ట మనఁగ నీకు నాకు గాని కన్నబిడ్డలను జంపు ఘనులకుఁ జట్టమేమి?

గో—కన్నబిడ్డ గాదులే. పెంచుకొన్నది.

రామ—దత్తపుత్రికను జంపుటకు ధర్మశాస్త్ర మంగీకరించును గాఁ బోలు! ఏమిటో! ఈదినములలో మంచియేమి? చెడ్డయేమి? మహాకలి ప్రవేశించినది. గుగ్గిళ్లు తెఱచుకొని నోరు మూసికొని చూడవలసినదే కాని—

గో—ఆమె చేసిననేర మేదియో?

రామ—చిన్నరాజుగారి ప్రక్కలోనికి రానన్నదఁట!

గో—నే నన్యథా వింటినే. చిన్నరాజుగారిని బాకుతో—

రామ—అది వేఱు. అది యొక్కదాసి—క్రొత్తదాసి—

గో—దాని కెంతదుర్బుద్ధి!

రామ—అట్టి నూతనపరిచారికను జిన్నరాజుగారి నిద్రావస్థలో నుంచుట కంటె నెక్కువదుర్బుద్ధియా?

గో—అటులైన నివ్వుడు జరుగు స్త్రీవధములు రెండా ?

రామ—ఆ! రెండు; పురుషవధములు రెండు.

గో—పురుషులు! మోహనుఁడు, రుద్రదేవవర్మయే కారా ?

రామ—ఔను. వెరసినాలుగు, ఇప్పటివఱకు.

గో—ఇప్పటివఱ కనుచున్నా వేమి ?

రామ—తీర నక్కడకు వెళ్ళినతరువాత రాణిగారిబుద్ధి యెట్లుండునో ? ఎవరియాయు వెటు లుండునో ?

గో—తెలివితక్కువమాట లాడకు. ఏమియు లేకుండ వారుమాత్రము చంపుదురా ?

రామ—ఆసంగతి నే నెఱుఁగనా ? ఉరితాడుండవలదా ? కానినీవు కూడ రావా ?

గో—నేను రాలేను.

రామ—ఏల ?

గో—నే నట్టి ఘోరకృత్యమును జూడఁజాలను.

రామ—నేనుమాత్రము చూడఁగలనా ?

గో—అటులైన నీ వేల పోవుచున్నావు ?

రామ—మాపిల్లవాఁడు తాను జూచెదనని పోరు పెట్టినాఁడు. ఎవరినైనఁ దగుసాహాయ్య మిచ్చి నే నింటికిఁ బోదును.

(తెరలో) రామభద్రా! ఇంక రావేమి ? రాజుగారు రాణిగారు మొదలగువా రందఱును వెళ్ళినారు. చూడు! చూడు! సంస్థానవు వైద్యునికొఱకు నిక్కడ వెదుకుకొనుచున్నారు. అతఁ డక్కడ నున్నాఁడా ?

రామ—ఇక్కడ లేఁడు. నేను రాను. అయ్యా ! మిత్రమా ! ఆగంగ రావిచెట్టుక్రింద మాపిల్లవాని నుంచితిని. వానిని నీతోఁ దీసికొని వెళ్ళి మఱల జాగ్రత్తగ నింటికిఁ దీసికొనివచ్చెదవా ?

గో—ఇప్పు డక్కడ వైద్యుఁ డేల ?

రామ—వైద్యుఁడు లేనిచోట చావెట్లు సంభవించును ?

గో—ఇప్పు డక్కడ వైద్యుఁడు చేయునది యేమి ?

రామ—ఉరిదీయఁబడినవాఁడు చచ్చె నని నిర్ధారణపఱుచుటకు.

గో—ఆసంగతి మనము చెప్పలేమా ?

రామ—దినకృత్య మగుటచే వైద్యుల కందున మనకంటె పాండిత్య ముండదా ?

గో—అయిన నురిదీయఁబడినవాఁడు చావకుండునా ?

రామ—ఏమో ? గొంతుక కురిపోసి వ్రేలాడఁగట్టుటయే కాదు. చచ్చువఱకు వ్రేలాడఁగట్టవలయు నని క్రొత్తచట్టము.

(తెరలో వాద్యములధ్వని)

గో—అదేమి శుభకార్యములందువలె మంగళధ్వను లగుచున్నవి ?

రామ—నలుగురితో చావంతకంటె భిన్నమా ?

(తెరలో) నాయనా ! ఆరంభమైనది. వాయించు చున్నారు. ఆశాస్త్రులుగారు నన్నుఁ దీసికొనివెళ్ళలేదు. నీవురా ! త్వరగా రా !

రామ—అబ్బ! ఈపిల్లవానిమూలమున నాకుఁగూడఁ జూడక తప్పనిదైనది.

గో—నీమూలమున నాకుఁగూడ నట్లే యైనట్లున్నది.

రామ—అటులైన రండు. పోవుదము.

(ఇద్దఱును నిష్క్రమింతురు.)

ఇది విష్కంభము.



[ప్రదేశము—ఉరికంబములతావు.]

(ప్రవేశము. చంద్రిక, కోకిల, విజయసారథి, జగన్నాథుఁడు, అరదండములతో బుద్ధిమతి, మోహనుఁడు, వసంతుఁడు, రుద్రదేవవర్మ. సేవకుఁడు.)

విజ—(అపవారించి) జగన్నాథా! సేనాధిపతి యుండుటచేతను—ఎవరు?

జగ—(అప) సేనాధిపతి.

విజ—(అప) వట్టి సేనాధిపతియా? సార్వభౌముని రాష్ట్ర మవలీల నప హరించి, యాతని గ్రహించి—పది!

జగ—(అప) ఆతనిగ్రహించి.

విజ—(అప) జగదేకవిఖ్యాతి నొందిన సేనాధిపతి—అట్టిసేనాధిపతియుం డుటచేతను, ప్రాణాపహరణోద్యోగ మిచ్చట జరుగుటచేతను—

జగ—(అప) అయ్యా! అటులనుచున్నారు. ఉరిదీయునది మీరేనా?

విజ—(అప) ఛీ!

జగ—(అప) క్షమియింపుము. తీయఁబడువారు మీరేనా?

విజ—(అప) ఛీ! ఛీ! ప్రాణాపహరణోద్యోగ మిచ్చటజరుగుటచేతను, జనసంకులమై యుండుటచేతను, వాద్యఘోషసమన్వితమై యుం డుటచేత, నీస్థలము యుద్ధరంగమువలెఁ బ్రకాశించుచున్నది సుమా?

కో—సేవకా!

(నేపథ్యమున) అయ్యా!

కో—వాద్యము లేక వాయింపవల దని చెప్పుము.

(నేపథ్యమున) చిత్తము.

విజ—(అప) జగన్నాథా! నే నీ నడుమ నొక్కతప్పుఁ జేసితిని. అం దువలనఁ గొంచెము — భయము లేదులే — నాకిప్పు డదృష్ట దినములు—కుడికన్ను గాలిలోని జెండాగుడ్డవలె నదరుచున్నది.

జగ—(అప) అట్టి తప్పేదియో నే నడుగవచ్చునా?

విజ—(అప) ఈగొడవ తీరినతరువాతఁ జెప్పెదను.

కో—(తనలో) హా! తండ్రీ! నిన్నట్టి యవస్థలో నేఁ జూడవలసి వచ్చెను?

ఆ॥ వె॥ ముగ్గుబుట్టయైన ♦ ముంగురు ల్మెడుతలు
బడినఫాలమందు ♦ వడక వినయ
వార్ధకముల నడుము ♦ వంగఁ, జేతులు బంధ
ములను దండ మిడఁగ ♦ నడుగొ తండ్రి!

ఈ నిర్భాగ్యురాలు నీకడుపునఁ బుట్టుటవలన నీకెంత యవమానము తటస్థించెను! (ప్రకాశముగ) అమ్మా!.

(తనలో) గీ॥ కనక పెంచక, యుండిన ♦ కాంత నమ్మ
యంచు, వినయసంభ్రమముల ♦ నాదరింతుఁ;
గడుపు కఱవాఱఁ గని ముగ్గు ♦ గాఁగఁ బెంచు
నిన్నుఁ దండ్రి యనుచుఁబిల్వ ♦ నేరఁ గట్ట!

చం—నాయనా! ఏల?

కో—వీరిలో నెవ్వరిని ముం దురి దీయు మని మీయభిప్రాయము.

చం—ఇదిగో! దీనిని. (బుద్ధిమతివంకఁ జూపును)

బు—అమ్మా! నమస్కారము.

చం—అమ్మా! చెప్పినమాట విను. మఱియొక్కసారి చెప్పెదను. ఇదియే కడపటిసారి. మూర్ఖపుఁబట్టు పట్టకు. అమ్మా! మహారాజును జేసికొనుము. నీకొఱకే నే నిచ్చుటకు వచ్చితిని. లేనియెడల నంతిపురిని విడిచి రావలసినది కాదు. అమ్మా!

బు—ఇఁక నేమియుఁ జెప్పకుము. నన్ను క్షమింపుము. అదుగో! మోహనుఁడు. ఆతని కిచ్చి నన్నుఁ బెండ్లిసేయుము. లేదేని నీయిష్టము. నాకర్మము.

చం—(ఉస్సురనుచు) హరి! హరీ! ఎంతకర్మము తటస్థించెను. కన్నకడు పావిధముగఁ గానలపాలైనది. తెచ్చుకొన్న దీవిధముగఁ దెల్లవారినది.

వనం—(తనలో) అమ్మా! కొంతనిశ్చయమే!

గీ॥ నీదుకాను పడవిపాలు ♦ నిజము మునుపు
కారపాలయ్యె దాసిలం♦గాలపాలు
నయ్యె మరణశిక్షకుఁబాలు ♦ నయ్యె, నిపుడు
తల్లికాదన్నసుతుని కిం♦తకును గలదె ?

కో—అమ్మా! మీయభిప్రాయ మేమి?

చం—ఈబుద్ధిమతి కిప్పటికైన బుద్ధి మాఱునేమో చూచుటకే నే నిటకు వచ్చితిని. ఇఁకఁ గార్యములేదు. నీయిష్టానుసార మాచరింపుము.

కో—నాయిష్టము వచ్చినట్లు చేయవచ్చునుగద!

చం—ఎంతమాత్రి మభ్యంతరము లేదు.

కో—సరే ! సేనాధిపతీ ! నీవు వద్ద నుండుము. (సేవకునితో) నీ వీమెను బల్లపై కెక్కించి కంఠమున కురిఁ బోయుము.

సేవ—చిత్తము.

బు—రాజేంద్రా ! నమస్కారము. మిమ్ములను బరిణయమాడలేదని మీకుఁ గోపమువలదు. నామనవి యొకటి యాలింపవలయును.

కో—సరే ! చెప్పుము.

విజ—ఈయురి తప్పింపుమనుకోరికతప్ప మఱి యేకోరికనైనఁ గోరవలయును.

బు—నాకంఠమున కురిపోయు మని యాసేవకునకు మీరాజ్ఞాపించితిరి.

కో—అయిన నేమి ?

బు—మహాప్రభూ! వలదు. నే నీమహానుభావుని వలచితిని. నాకతఁడు మంగళసూత్రము కట్టఁదగినవాఁడు. ఆలోపము నాకు లేకుండ

నట్లాకంఠసూత్రము నీతనిచే నామెడను గట్టింపుఁడు. ఆమహా మహుని కిల్లాలనై ప్రాణములు విడుతును.

మో—(తనలో) ఆహా! నాయం దెంతయనురాగము గలదానిని విసర్జించి యనురాగ విహీనయగు దానికై యాసపడి చెడిపోతిని. (ప్రకాశముగ) మహారాజా! ఈమెను బ్రథమమున నురిఁదీయుట నాయభిమతము కాదు.

కో—నోరు మూసికొనుము. అంగీకరించుట కంగీకరింపక పోవుటకు నీ వెవఁడవు? నీయిష్టత ననుసరించి మేము నడువవలయునా? ఒడలు తెలిసికొని మాట లాడుము.

విజ—మోహనా! జాగ్రత్త! నోరు కాపాడుకొనుము. (అపవారించి) జగన్నాథా! చిన్నరాజు సీమతుపాకిమందువలె మంచికారము గలవాఁడుసుమా!

మో—మహాప్రభూ! నాతప్పు మన్నింపవలయును. నన్ను క్షమింపఁ బ్రార్థింతును. ఒక్కమనవి.

కో—చెప్పవలసిన దేదో శీఘ్రముగఁ జెప్పుము.

విజ—ఔను. నీవంటివాండ్రు ముగ్గురింకఁ జావవలసి యున్నారు.

మో—రాజేంద్రా! ఈకాంతామణిని నే ననేకసంవత్సరముల నుండియు వలచియుంటిని.

కో—అసత్య మాడకు, జిహ్వఁ గోయింతును.

విజ—అనేకవిరోధి శిరోధి విదారణాతి దారుణమగుకృపాణము. ఇదిగో! నాయొద్ద నున్నది!

జగ—(అప) జిహ్వఁగోయుట తమవంటి శూరునికి ధర్మముకాదు.

మో—మహారాజా! ఈకాంతను నేను వలచినమాట సత్యమే.

కో—వలచినదాని నేల విసర్జించితివి?

మో—ప్రారబ్ధకర్మమువలన.

కో—ఛీ! తుచ్ఛుఁడా! ఒడలు పొగరెక్కుటవలన—కనులు మీఁదికి వచ్చుటవలన—నిన్నింతగాఢముగ వలచినకాంతను వదలుట కేమికారణమో వెంటనే చెప్పవలయును.

విజ—మహారాజుగారి యాజ్ఞ యేనవు దూరకుందువేమి? శీఘ్రముగఁ జెప్పుము.

బు—రాజేంద్రా! నాకాంతునిపైఁ గోప ముడిగి క్షమింపుఁడు. నన్నాతఁడు విసర్జించుట నాదురదృష్టముననే కాని యాతనిలోపమునఁ గాదు.

మో—కాంతామణీ! సరి కాదు. దురదృష్టము మనదిద్దఱది. లోపము మాత్రము నాదొకనిది. (తనలో) బుద్ధిమతియెదుటను రుద్ర దేవవర్మయెదుటను గారణమునుగూర్చి చెప్పుటకు లజ్జపడు చుంటిని. అయినను దప్పదు. (ప్రకాశముగ)

గీ॥ కోకిలాలాపికాంగక ♦ శ్రీకినెదుటఁ
బరమమయ్యె బుద్ధిమతిసుం♦దరత యడఁగెఁ
బ్రబలవైద్యుత శక్తిప్ర♦భాసమాన
దీపికకు ముందు కాఁగడ ♦ దీప్తివోలె.

కో—(తనలో) ఛీ! దుర్మార్గుఁడా!

గీ॥ కామిచేఁ బైమెఱుఁగులకుఁ ♦ గాంత స్తుతిని
బొందుకంటె విరాగిచే ♦ నింద నొంద
ఘనము; వాఙ్మహాడంబర ♦ కలితకవిత
కనరసనుతికంటె గుణిని ♦ రసనమేలు.

వసం—(తనలో) ఛీ! మోహనుఁడా!

గీ॥ కనులు గానవా? యొడలుపొ♦గరెఁ? మనసు చ
లించెనా? త్రాగినావొ; పే♦ల్రెద వదేర?
నగరుటతివ మఱి, మదాత్మ♦నగయుగు మగు
వ సభఁ బేరెత్తి నుతియింతు♦వా? దురాత్మ!

రుద్ర—హా ! కోకిలా ! నాతల్లీ ! నీచక్కఁదనము నీయిడుమలకే కారణ మయ్యెనా ?

కో—(తనలో) అంతే! ఆపదలకే కాని యుపభోగమునకుఁ గాదు.

మో—మహాప్రభూ !

గీ॥ తన్వి యామె నాపాపనేత్రములఁ బడఁగ
దీని విడిచి దానిని జేరఁ • దీవ్రపడితి
నప్సరస ముందు తెయితక్కలాడ నత్త
మాలవిడి పైటఁ గొను ముని • మాత్రునట్లు.

రుద్ర—(తనలో) హరిహరీ !

వసం—(తనలో)

ఆ॥ వె॥ నెలఁతనీదుసొమ్ము! • నీతాతసొమ్ము! యే
మేమి! చూచుతోడ • నే వలచితె?
కనులు పొడుచుకొనినఁ • గడు మంచిదౌకదా
పడఁతు లెవరు కనులఁ • బడక యుండ్రు.

కో—ఓరీపాపి! అధమా! కోకిలను జూచుటతోడనే బుద్ధిమతిని వదలితివా? ఓరీ చండాలుడా! నీయనురాగస్థైర్య మింతయేనటఁరా ?

ఛీ! ఛీ! భార్యాపరిత్యాగమును జేసిన నీమొగమును జూడరాదు.

బు—రాజేంద్రా! ఆయననేర మేమియు లేదు క్షమింపుము.

కో—తరువాత వసంతుని ప్రక్కలో బుద్ధిమతిని సింగారించితివా ?

మో—అయ్యా ! మీ కెట్లు తెలిసెను ?

బు—నాథా ! నేను గొన్నియంశములఁ జెప్పితిని.

మో—మహారాజా ! నాకుఁ జెప్పుటకు సిగ్గగుచున్నది. ఒకమోసమున వసంతునికి బుద్ధిమతికి నంటించి నేనును గోకిల పోయితిమి.

కో—ఆమోస మేదియో స్పష్టముగఁ జెప్పినఁగాని మా కెట్లు తెలియును?

మో—కోకిలావసంతుల రహస్యప్రయాణమును గూర్చియు, సంకేత స్థలాదులఁగూర్చియు నదివఱకే నే నెఱింగియుంటచే, బుద్ధిమతి నచ్చటికడిమచెట్టుతొఱ్ఱలో డాఁచి యాచెట్టుక్రింద కోకిలకై వేచి యుంటిని. అనురాగాందోళనమునఁ గోకిలయేర్పఱచుకొనిన వేళ కంటె ముందే వచ్చునని గ్రహించి చెట్టుక్రింద నిరీక్షించి యుండి కోకిలను దూరముగఁ జూడఁగనే "బుద్ధిమతీ! ఒకగంట వఱకు నీ వీతొఱ్ఱలో నుండి పైకి రాకుము; తరువాత వచ్చి యీతాత్రిటినిచ్చెనను గదువుము; ఈమేడపత్రిక నేను కొంత సొమ్ము దాఁచుకొంటిని; ఆసొమ్ముతో నిన్నుఁ గలిసికొందును; మాటలాడకుండ నాతో రావలయును." అనునీమాటలు బుద్ధిమతి చెవినివైచి తటాలునఁ గోకిల కెదురుగఁ బోయి మఱలించి తీసికొని పోయితిని.

కో—ఓరీ! అధమాధముఁడా! ఇంతిమోసముచేఁ గోకిలను గ్రహించి వసంతునికిని బుద్ధిమతికిని లంకె వేసితివా?

మో—అగునని చెప్పుటకు సిగ్గుగుచున్నది

కో—ఓరీ భ్రష్టుఁడా! నీకు సిగ్గేల? బిడియ మేల?

ఆ॥ వె॥ పత్రికలోనిసతిని ♦ వదలివేసినవాఁడె
సిగ్గు లేనతఁడుగఁ ♦ జెప్పఁబడఁగ
దాని మఱియొకనికిఁ ♦ దార్చినచండాలుఁ
డేమి లేనివాఁడొ ♦యెఱుఁగవశమె?

చెలియలిని విటునకుఁ దార్చిన వేశ్యాపుత్త్రుఁడు నీకంటె సహస్ర గుణాధికగుణసంపన్నుఁడు. నిన్నుఁ జిత్రవధము సేయవలసి నదిరా! ఏమి? వసంతునిపత్రికలో బుద్ధిమతిని గూర్చితివా?

వసం—(తనలో) కూర్చినవినియోగ మేమున్నది?

గీ॥ మతిచెదరువాని మెడలోన ♦ మల్లెదండ
వలెను, సతిఁబాసి యేడ్చెడు ♦ వానిముందు
గానసేవవలెను, నాదు ♦ కాంతవిడిచి
యేడ్చునాకు నీసకియ సమర్పించె నతఁడు.

ఎదుట బుద్ధిమతి యున్నది. దాని నడిగి నానిర్దోషతయు దాని నిర్దోషతయుఁ దెలిసికొనరాదా ?

కో—ఏమీ! బుద్ధిమతీ! నీకు వసంతుఁ డేమైన ద్రోహ మొనర్చినాఁడా? ఓరీ మోహానుఁడా! నీవు మనుజుఁడ వైన నీచింత నీకుండఁ దగినది. ఏమి బుద్ధిమతీ!

బు—హరిహరీ! ఎంతమాట! వసంతుఁడు మహాసుగుణసంపన్నుఁడు. ఆతనికిఁ గోకిలా నామసంస్మరణముతప్ప వేఱుచింతయే లేదు.

వసం—(తనలో) సెబాస్! బుద్ధిమతీ! యథార్థకథనము నీపాతి వ్రత్య మునకు వన్నె దెచ్చుచున్నది.

చం—బుద్ధిమతీ! నీవు వసంతు నెచ్చటఁ జూచితివి ?

బు—అమ్మా! నే నిక్కడకు రాకమునుపు వనములోఁ జూచితిని.

చం—ఆతఁడు వసంతుఁ డని నీ వె ట్లెఱుఁగుదువు ?

బు—ఆతఁడే చెప్పినాఁడు.

చం—ఆమాట నమ్మఁగూడదు.

వసం—(తనలో)

ఆ॥ వె॥ బ్రదికియుండునాతఁ • డెదుటికి నేతెంచి
నేను జావలేదు • నిక్క మనుచుఁ
బలుకుచున్న నైనఁ • బాపభూయిష్ఠ కా
లమ్మువలన వాని • నమ్మ రెవరు.

కో—వసంతుఁడు కానీ కాకపోనీ! బుద్ధిమతీ! ఆతఁడు నీతో నింకే మనెను ?

బు—ఈమోహానునివలనఁ గోకిల కేమైన నుపద్రవము గల్గునా యని నన్నడిగెను. అట్టి దెన్నఁడును జరుగ దని నే నంటిని.

కో—ఈమోహానుఁ డట్టి దుర్మార్గుఁ డని వసంతుఁ డెఱుఁగునా ?

బు—ఎఱుఁగడు కాని, యేమో కొంతసందేహించినాఁడు.

కో—వసంతుఁడు కోకిల నేల సందేహింపవలయును ? ఆభిజాత్యసంపన్నత గలిగి యధికగుణాన్వితుఁ డైన యీావృద్ధమహారాజ పుత్త్రికకదా కోకిల యనునది.

రుద్రి—రాజేంద్రా! ఔను. కోకిల నాకూతురు. నా కొక్కతెయే కూతురు. అయ్యో! అయ్యో! నాకోకిలను నాకుఁ గనఁబఱచి పుణ్యమును గట్టుకొనరా? ఎక్కడ నున్నదో వెదకింపరా? హా! కోకిలా! (ఏడ్చును.)

కో—(తనలో) హా! తండ్రీ! నీక్షోభము నేనెంత యస్వతంత్రనై చూడవలసివచ్చెను?

ఆ॥ వె॥ ఎదుట నున్నదాని ♦ వెదకింపవలయునె?
కనఁబడిమెదుదానిఁ ♦ గనఁబఱుపఁగ
వలయునయ్య? చావుఁ ♦ బడయనికూఁతుకై
యేల యేడ్వవలయు ♦ నీవు తండ్రి?

గీ॥ మాయ యనుతెర యడ్డుండ ♦ మాత, తండ్రి
కూఁతు రనుభ్రమము గలిగె; ♦ నా తెరవయి
మగతనపుఁదెర యుండ భ్ర♦మముమఱింత
యయ్యెఁ; గూఁతురు రాజుగా♦నయ్యె నీకు.

(ప్రకాశముగ) సేనానీ! ఆరాజు నాశ్వాసింపు మనుము.

విజ—చిత్తము. ఏమయ్యా! అనవసర రోదనమున నల్లరిచేసి సభాకార్యముల కేల విఘ్న మొనర్తువు? ఊరకుండుము.

కో—విజయసారథీ! నీ వేమి గౌరవ మెఱుఁగవా? మాటలాడువై ఖరి యెఱుఁగవా! మూఢుఁడవా! ఆవృద్ధరాజేంద్రు నట్లు గద్దించదవేల? కనినయొక్కబిడ్డ కానఁబడక పోవ నేడువనివారుందురా?

వనం—(తనలో) మాయమ్మ యున్నదికదా?

విజ—మహాప్రభూ! క్షమింపవలయును. (అప) జగన్నాథా! ఈచిన్న రాజు పట్టాభిషిక్తుఁ డగుతరువాత మనమానప్రాణములు దక్కునుమా?

జగ—(అప) కాదా? మనప్రయోజకతలు విద్యావిహీను లగు విభుల యొద్దను వితంతువులయొద్దనే కదా?

కో—నే నడిగినప్రశ్నమునకు త్తరము చెప్పక యూరకుంటి వేమి? బుద్ధిమతీ! గుణసంపన్న కాక తప్పని కోకిలను వసంతుఁ డేలసందేహింపవలయును?

బు—అత్యనురాగ మున్నచోట నట్టిభయము సహజమేకదా!

వసం—(తనలో)

గీ॥ ప్రాణపదమగువస్తువు ♦ పాడుపడు న
టంచు భయ మెల్లపుడు చిత్త ♦ మాశ్రయించు
నతులితాచారనిష్ఠుఁడో ♦ నతఁడు మైల
యెపుడు పడుదునో యనుభీతి ♦ నెగిరిపడఁడె?.

కో—మోహనుఁడా! నీవు కోకిలను వనమునకుఁ దీసికొనిపోయితివా?

మో—చిత్తము.

కో—పోయి యచట బలాత్కరింపలేదుకద!

వసం—(తనలో) ఈయొక్కమాటతో వసంతునిబ్రతుకో చావో, తేలనై యున్నది.

గీ॥ తరుణిఁ బాసి ప్రాణాపాయ ♦ దశను గంటి;
రాజవైద్యుఁడు మృతజీవ ♦ రసము నిచ్చె;
వైద్యహస్తవిశేషాన ♦ బ్రదుకఁ గలనో!
వాహకు నదృష్టమునఁ జావుఁ బడయవలెనో!.

ఇంకను మాట లాడకున్నాఁడు.

కో—సందేహించుచుంటివేమి? బలాత్కరించితివా?

మో—(చెవులు మూసికొని) పాపము శాంతించునుగాక! పాపముశాంతించుగాక!

కో—ఏమి అటు లనుచున్నావు?

మో—ఆమె మహాపతివ్రత! నేను పరమదుర్మార్గుఁడను.

వసం—(తనలో) సెబాస్! యథార్థవాక్యములు రెండు పలికితివి.

గీ॥ అత్యసత్యవాదియు దిన ♦ మందు నొక్క
యొక్కపుడు సత్య మాడక ♦ యుండఁ డహహా!
తిరుగనిగడియారమయిన ♦ దివసమునకు
సరిగ వేళఁ జూపును రెండు ♦ పఱులు గాదె?

మో—ఆమె నాకుఁ దల్లివంటిది. ఇఁక నాకు బుద్ధి వచ్చినది. అంధకారమునకు దీప మెట్లో కామాంధకారమునకుఁ గారానివాస మట్టిది. తల్లియగుకోకిలాదేవి యెన్నటికైన నాకనులఁ బడుట తటస్థించినయెడల రక్షింపుమని నే నామెకిట్లు సాష్టాంగ మొనర్తును. (సాష్టాంగపడును.)

కో—నీవు నాకు నమస్కరించెదవేల?

మో—కోకిలాకాంతను బలిమిచేఁ బట్టితి నని నాకీ కారాగృహనివాసము, తరువాత నిప్పటి మరణశిక్షయు, విధింపఁబడినవి నేను ద్రోహిని కానని మనవి చేసికొంటిని. నన్నుక్షమించి రక్షింపుఁడు.

కో—బలాత్కార మెట్లు శిక్షార్హమో తత్ప్రయత్నముకూడ నట్టులే! నీవు చావక తప్పదు.

మో—తప్పదా? చిత్తము బుద్ధిమతీ! (మోఁకరించి)

ఆ॥ వె॥ ఇంట సుఖముఁ జెందు ♦నింతిని నిప్పట్టి
యడవి కీడ్చి యిడుము ♦ లందఁ జేసి
యురిని గూడఁ బొంద ♦ నుండఁజేసినఖలుఁ
డిడుగొ! వీనిశిరము ♦ నెగసి తన్ను.

కో—ఓరి దుర్మార్గుఁడా! నీ వొసఁగినయాపదలు బుద్ధిమతికే యననేల? వసంతునికో? కోకిలకో? వారిమూలముగ నీవృద్ధమహారాజునకో? ఈవిచిత్రనాటకమునకు నీవేబీజమవు; ఈయద్భుతభారతమునకు దుష్టశకునివి నీవే! నిన్నెగసి తన్నవలయునా! నీమాంసము ఖండఖండములుగఁ గోసి కాకుల కెగమీటవలయునా?

(తనలో)

ఆ॥ వె॥ ఇట్టిచోటనైన • నీరీతిగానైనఁ
గాంత మగనితోడఁ • గలిసె నహాహా!
యిట్టిభాగ్యమైన • నే నొందలేనైతిఁ
గట్ట! పూర్వరచిత • కర్మకలన.

బు—బాలప్రభూ! ఆతఁడు యౌవనప్రాదుర్భావమున నేమైన నేరములు చేసియుండినయెడల మీరాతనిని క్షమియింపఁదగును. ప్రభువులకు శిక్షార్హుని క్షమించుటకంటె నుదారత వేఱొకటి లేదు. (సాష్టాంగపడును.)

కో—బుద్ధిమతీ! లెమ్ము! నీవంత దైన్యముగఁ బ్రార్థించుంటివి కాన మేము మీయిద్దఱప్రాణములలో నొక్కప్రాణమును మాత్రమే రక్షింతుము. నిన్ను రక్షింపు మంటివా? నీకు బానిసయగుట కైనఁ దగనిసభర్తను రక్షింపు మంటివా?

మో—(తనలో) హా! బుద్ధిమతి యేమనునో?

బు—మహారాజా! నాభర్తనే రక్షింపవలయును.

కో—హాహాహా!

చం—ఓసీ! నిర్భాగ్యురాలా! నీవు చచ్చినతరువాతనైన లోకమున కాధరణముగను దౌష్ట్యమునకు బీజనాశనము లేకుండుటకు నీ దుర్మార్గుఁ డుండవలయును గాఁబోలు!

కో—నీభర్త నేల కాపాడవలయును?

బు—నాప్రాణము నాభర్తలో నున్నది. ఆతనిఁ జంపినయెడల నొకప్రాణముతో మఱియొకప్రాణము పోవును. నన్నుఁ జంపినయెడల నేను నాభర్తలో జీవించియే యుందును. కావుననే నట్లు కోరితిని.

కో—ఆహా బుద్ధిమతీ! నీవు సార్థకనామ వైతివి!

గీ॥ శక్తివంతుని ధనవంతు • నరసతముని,
రాగయుతు, వ్యభిచారదూ•రస్థుఁ, గాంతు
నింతి ముక్కుచు, మూల్గి, ప్రే•మించు నట్టి
పాపకాలనై చిత్రంబు • ప్రాప్తమయ్యె.

గీ॥ కాని, నీరసు నిర్భాగ్యుఁ • గాపురుషుని,
రాగహీనునిఁ, బరసతీ • రాగయుతునిఁ.
బతిని, రక్షింపఁదలఁచి నీ•ప్రాణములను
విడువ నుంటివి; నినుఁబోలు • వెలఁదియేది?

బు—మహారాజా! మీస్తుతి కర్హ్యారాలను గాను. ఇదివఱకే నావలన మీకుఁ జాలశ్రమము గలిగినది. నన్నింక నురిదీయింప సెలవిండు. నాభర్త నన్నుఁ బట్టుకొని యాబల్లపైకిఁ దీసికొని వెళ్లును. అతనిసన్నిధానమున నాతనిచేతఁ జేపైచి ప్రాణములు విడుచుటకంటె నాకు మహాభాగ్య మక్కఱలేదు. అమ్మా! నమస్కారము! ఆర్యులారా! మీకు నమస్కరించుచున్నాను. నాథా! నన్నుఁ బైకిఁ దీసికొనిపొమ్ము.

మో—బుద్ధిమతీ! నీకటాక్షమున నే బ్రదికితిని. నీ కనేకవందనములొ నరించుచున్నాఁడను. నీవుమాత్రమేల మరణింపవలయును? బ్రదికి యుండుటకు సాధన మేమైన నుండఁ జచ్చునంతటి జ్ఞానహీనుఁ డుండునా? నీవు చావవలదు. నీ వీ మహారాజును వివాహము చేసికొందు ననుము. ని న్నాతఁడు వెంటనే రక్షించును. ఆరీతిగ బ్రదికి యుండక వృథగఁ జావనేల?

కో—పరకఱలోనిభార్యను పైవాని కప్పఁజెప్పు నీపాడుబుద్ధి పోనిచ్చుకొంటివికావు.

చం—మోహానుఁడా! నీవు బుద్ధిమతికి బ్రదుకుదెరువగు నుపదేశమును మావలెనే చేసితివి. అది కోసినసగే! చెప్పినట్లు వినదు.

కో—బుద్ధిమతీ! నీభర్త చెప్పిన యుపాయమునకు నీ వేమైనఁ బ్రత్యుత్తరము చెప్పవలసియున్న దేమైన చెప్పుము.

బు—అమ్మా! నేనుఁ బ్రత్యుత్తరములదానను గాను; మాటలదానను గాను; నన్నుఁ బరలోకమున కంపుఁడు.

కో—పరమపాపిష్ఠ శిఖామణియైన పతిప్రాణములు స్వప్రాణదానప్రయత్నమున రక్షించిన మహాపతివ్రతా శిరోమణివైన నీ వింకఁ

గొంతకాలము లోకసంగ్రహార్థమై జీవించి యుండవలయును. నిన్నుఁ జూచి నమస్కరించువారికిఁ బాపవిమోచన మగును గావున నమస్కరించుచున్నాను.

(సాష్టాంగపడును)

బు—(తిరిగినమస్కరించి) మహాప్రభూ! అనుగ్రహింపఁబడితిని.

కో— గీ॥ బహుళజీవభూయిష్ఠ ప్రపంచమందు
సచ్చిదానందమయ సు ప్రశస్తమైన
యట్టి బ్రహ్మముతరువాత నధికపూజ్య
భవ్యమగువస్తు వౌకపతివ్రతయే కాదె?

సేనాపతీ! ఈదొంగను, విశ్వాసఘాతుకను, రాజద్రోహిణిని, రమణీరూపరాక్షసిని, పైఁటకొంగున బాకును ముడుచుకొని బాసిసతనమునకై వచ్చినపాపి నిటు తీసికొనివచ్చి నాయెదుట దూరముగఁ బెట్టుము.

సేనా—(తనలో) అయ్యయ్యో! ఇఁక నాకొంపగూఁడ నేమిమునుఁగునో కదా! (ప్రకాశముగ) వాహినీ! రమ్మ! ఇటురమ్మ. మహారాజుగారియొద్ద— కాదు— యెదుట— దూరముగ— నంత దూరముగఁ బనికిరాదు—కొంచెము దగ్గఱగ—నిలువఁబడుము. మహాప్రభూ! వాహినిని దయయెదుట నిలువఁ బెట్టితిని.

కో—అమ్మా! ఇంక దీనిని విచారింపనా?

చం—న న్నడుగవలసినపనిలేదు. నీ యిష్ట మెటులో యటులాచరింపుము.

కో—రాజవధమును సంకల్పించుకొనిన నీ వెవతెవు?

వసం—(తనలో) ఎవతెవు కాదు. ఎవఁడవని యడుగుము. హా! కోకిలా!

గీ॥ ఎటులో కారయం దుండ నన్నీడ్చి పైకి
నడవి పాల్సేసి త్యజియించి యాఁడు బాని
ననుగఁ జేసి రాజవధమునలుపఁ జేసి
యురిఁ దగిలించి గుట్టునుగూడఁ జెఱుపఁ దలఁతె?

కో—ఏమి మాటలాడక యున్నావు.

వసం—ఏమిచెప్పవలసి యున్నది.

కో—ఏమీ యీామఱవు? ఛీ! తుచ్ఛురాలా! రాజవధ మేల సంక ల్పించుకొంటివి?

వసం—రా జెవరు?

కో—నీకుఁ గన్నులు లేవా? మతి లేదా? అటు లడిగెద వేమి?

వసం—కన్ను లున్నవి. మతి యున్నది. కావుననే యడిగితిని. రాజెవరు?

కో—నేనే.

వసం—అసత్య మేల యాడెదరు?

కో—అసత్య మేమున్నది?

వసం—ఈరాజ్యము నీ కేతీరునఁ గలిగెను. నీవు మాదేశపురాజునకుఁ బుత్త్రిఁడ వగుదువా? ఆమె నిన్నుఁ గనెనా?

కో—కన్నవాఁడేకాని దత్తుఁడు రాజ్య మేలఁగూడదా?

వసం—నీ వామెకుఁగాని యామెభర్తకుఁగాని దత్తస్వీకృతుఁడవా?

కో—ఛీఛీ! అనవసరవాక్యములఁ గట్టిపెట్టుకొనుము. నీవు రాజవధ మేల సంకల్పించుకొంటివి? సేనాపతీ! సర్వమును సిద్ధపఱచి యుంచుము. దీనిని ముందుగ నురితీయవలయును.

వసం—నేను నీవధ మేల తలఁచితినా? నిన్ను రాజ్యమునుండి తొల గించుటకు—

కో—తొలఁగించి—

వసం—నేను రాజ్య మేలుటకు—

కో—హాహా! నవ్వు వచ్చుచున్నది. ఆనిసకు రాజ్యమేల?

వసం—పై వానికంటె మంచిదికాదా?

కో—(తనలో) హాహా! ఇది యేమి? ఇది యేమి? నానాథుఁడే!

విజ—ఈమహారాజు వృద్ధరాజున కభిమానపుత్త్రిఁడు.

వసం—ఔరసుఁ డుండ నభిమానపుత్త్రిఁ డేల యేలవలయును?

కో—(తనలో) హా! హృదయమా! శాంతించుము.

చం—ఓసీ! మతిమాలినదానా! ఔరసపుత్త్రుఁడెవ్వఁడే?

వసం—నేనే!

చం—ఎవరికి? ఎవరికి?

వసం—నీకు—నీభర్తకు—

చం—నా కౌరసుఁడు వసంతుఁడు.

వసం—అంతమాత్ర మెఱుఁగుదువుకద! ఆనిర్భాగ్యుఁడైన వసంతుఁడువీడే.

కో—(తనలో) అదృష్టహీన నగునామూలమునఁ బ్రాణనాథా! నీకె న్నియాపదలు తటస్థము లైనవి.

ఆ॥ వె. నిన్ను మొదటఁ జూడ ♦ నే నెచ్చటనో యుల్లే
వ్రతిమఁ గాంచితి నని ♦ భ్రమము పడితి;
మునుఁ జదివినపాఠ ♦ మును నెచ్చటనో విని
నట్టు లున్న దనెడు ♦ నజ్ఞవలెను.

చం—సేనానీ! చూచితివా? చెప్పలేదా? పట్టుకో! కొట్టు! చంపు! నరుకు! రాజ్యమును హరించుటకు వసంతుఁడను పేరుపెట్టుకొని దాసివేసమువేసుకొని బాకు నోడిలో దాఁచుకొని వచ్చి రాజకు మారునిజంపఁ దలఁచితివా? రాజ్య మెక్కఁ దలఁచితివా? మ హారాజు చచ్చినతోడనే రాజ్య ముల్లోలకల్లోల మైన దనుకొం టివేమి? జాగ్రత్త! డొక్క చీల్పించెదను. సేనాపతీ! పట్టుకొ నుము. ఎక్కించు! ఉరికంబములమీఁది కెక్కించు!

కో— సేనాధిపతీ! పట్టుకొనకుము. అరదండములతో భటమధ్యమున నున్నవాఁ డెచ్చటికిఁ బోవును? అమ్మా! అతఁడు వసంతుఁడే యగునెడల మనకంతకంటె సంతోష మేమియు లేదుకద! కాక మఱి యెవ్వఁడో ద్రోహియుఁ జోరుఁడైనయెడల నాతఁడు నాకుఁ జేయదలఁచినయనకృతి యేదియో చేయనే చేసినాఁడు కదా! బద్ధుఁడై కొలఁదికాలములోఁ కడతేరనున్నవాఁడు మన కేమియాపదను గలుగఁ జేయఁగలఁడు? ఏమియు భయము లేదు. ఈతని పూర్వాపరసందర్భము లన్నియుఁ గనిపెట్టుదము.

చం—ఇంక నేమి కనిపెట్టవలయును ? ఒక్కమాఱుగ వసంతుఁడనే యనుచున్నాఁడు.

కో—(తనలో) వసంతుఁడు కాఁడా ! హా ! ప్రాణనాథా !

ఆ॥ వె॥ ఎఱ్ఱజీర లుండి ♦ యింతలోనేత్రముల్
కాంతిఁ దప్పె; నింకె; ♦ గళ మొకింత
సన్నవడియె; నున్న ♦ నున్నవౌ చెక్కులు
చప్పఁబడుచు బ్రమదిమ ♦ దప్పె నకట!

ఆ॥ వె॥ పోల్లుపిట్టపొట్టఁ ♦ బోలినముంజేయి
తరుణమాంసలతను ♦ దక్కనరము
లకట ! పొటకరించె; ♦ నవిగొ భాగ్యమువోవ
జనునిలోపచయము ♦ చందమునను.

వసం—అమ్మా !

ఆ॥ వె॥ అమ్మగానిదాని ♦ నైన నమ్మాయని
యనెడువాని నింతి ♦ యాదరించు
నన్నుఁ గన్ననిన్ను ♦ నా "తల్లి" యనిపిల్వ
నెగచి నఱుకమనెద ♦ వేల? యమ్మ!.

ఆ॥ వె॥ కొడుకుమృతికి నడ్డు ♦ పడవలసినతల్లి
తనయుఁజంపఁబూన ♦ దారిగలదె ?
ఏది గుండెఁబట్టు ♦ నిట్టె నీ రది దింపు
నీరు గుండెఁ బట్ట ♦ దారి యేది ?.

కో—నీవు వసంతుఁడవే యైయుండినయెడల బహిరంగముగ వచ్చి "నేను నీకొడుకను; ఈ రాజ్యము నాది. ఈకొత్తరాజును వెడలఁగొట్టి నారాజ్యమును నేఁ దీసికొందును." అని మాయమ్మతో స్పష్టముగ ...రాముఖని జెప్పలేకపోయితివా? ఈభయ మేల? ఈసందేహ మేల? దాసీజనముల గుడారములోదాఁగ నేల? లేసపోనియాడువారిహాంగులు తెచ్చి పెట్టుకొననేల? చక్రవర్తి పుత్రుఁడవై పుట్టియుఁ గింకరవృత్తికి లోనుగా నేల ? అర్ధరాత్రి

మున నిద్రావస్థ నుండువారిఁ బొడువ నేల? అరదండములతో నురికంబములయొద్ద కీడ్వఁబడ నేల? ఎందుల కీశ్రమము? ఈక్షోభము? ఈయవమానము? ఈబలవన్మరణము?

వసం—నేను మూడేండ్లవయసువాఁడ నై యుండఁగ నీమహారాజువలనఁ దీసికొనిపోఁబడుటచే నిచ్చట న న్నెవ్వ రెఱుఁగరు. మాతల్లి యైన న న్నెఱుఁగదు. బద్ధుఁడై న యీ వృద్ధరాజప్పటప్పటఁ జూచుటచేత నన్నుఁ గొంత యెఱుఁగును. ఒకసారి చూచుట వలన బుద్ధిమతి నన్ను మిక్కిలి స్వల్పముగా నెఱుఁగును. హా కోకిలా! నీ విప్పుడు నాయెదుట నున్నయెడల నే నెంతవికృతి వేషములో నున్ననై నను నీ విట్టె యానవాలు పట్టుదువు గదా!

కో—(తనలో) మగరూపున నున్న నన్ను నీ వెంతగుఱుతు పట్టితివో యింతకుముందువరకు నేను ని న్నంతే గుఱుతు పట్టితిని.

ఆ॥ వె॥ ఎఱుఁగు టనఁగ నేమి? ♦ యెఱుఁగమి యన నేమి?
నెత్తిపై న జ్యేష్ఠ ♦ నిలుచు నపుడు
కనులు పూలు పూచి ♦ కాయలు కాచును;
బుద్ధి మొక్కవోయి ♦ మొండిఁబాఱు.

(ప్రకాశముగ) వసంతా! నీ వేదో చెప్పఁబోయి మఱియొక్క దారిని బోయితివి.

వసం—ఔను. ఇచ్చట మాతల్లియైన న న్నెఱుఁగదు. నేను వసంతుడనని చెప్పిన నెవ్వరు నమ్ముదురు? మగరూపమున నంతఃపురమెట్లు ప్రవేశింతును? అందుచే నీదాసీత్వమున కొప్పుకొని నగరు ప్రవేశించితిని. మాయమ్మతో రహస్యముగ నాస్వరూపమును వెల్లడించుకొనవలయు నని యెంచితిని గాని, వసంతుఁ డని పేరు పెట్టుకొని వచ్చిన నెవరి నైనఁ బ్రత్యేకాజ్ఞ లేకయే శిరఃకర్తన మొనరింపుమని ద్వితీయసేనాధిపతి కప్పుడే యాజ్ఞ నిచ్చుచుం డెను. తరువాత—(సేనాధిపతి వంకఁ జూచును.)

విజ__చెప్పుము. సేనాధిపతికి భయమేమి ?

వసం__తరువాత, నీసేనాధిపతితో నాయుదంతము సంపూర్ణముగఁ జెప్పితిని. అప్పు డీతఁడు నాయవస్థకు మిగుల ఖేదపడి నీవీరాత్రి నీశత్రువైన యీనూతనరాజును గడతేర్చినయెడల సేనాభండారములతో నేను నీకు సాహాయ్య మొనర్చి నిన్ను రాజ్యమున నవలీల నిలుపుదు నని వాగ్దానమొనర్చెను.

కో__సేవకా ! ఈసేనాధిపతి కరదండములఁ దగిల్చి యురికంబముల యొద్దకుఁ దీసికొని వెడలుము. ఛీ ! దుర్మార్గుఁడా ! రాజద్రోహీ ! పాపీ ! రాజ్యము వసంతునిదిగావున నాతఁడేదో యొకతంత్రమునఁ దన రాజ్యమును దాను సంపాదించుకొనుటలో నంత తప్పేమియు లేదు. నీ కేమి పోఁగాలమా ? ఒడలు మదమా ? నీకు నే నేమి ద్రోహమొనర్చితిని ? నీదారికి నే నేమియడ్డుగ నుంటిని ? నన్నుఁ జంపు మని నీ వీతనికి బోధింతువా ?

విజ__చంపుమని నేను బోధింపలేను. ఆతఁడు మిమ్ముఁ జంపఁగలిగిన యెడల నాపైని__

కో__ఛీ ! నోరు మూసికొనుము. నీవుచావదగినవాఁడనే!

వసం__అయ్యా! ఆతనిని క్షమియింపుము!

చం__విజయసారథీ! ఇట్టిచిక్కులు రాఁగ నివారణము చేయదగిననీవే! మమ్మిట్టి యాపదలలోఁ బ్రవేశింపఁ జెట్టితివా? ఈవిశ్వాసహైన్యము నీకుఁ దగునా?

విజ__రాజకుటుంబమం దిప్పటికి నాకు విశ్వాసమే?

కో__(కత్తిదూసి) ఆఁ ! ఆఁ ! ఏమంటివి ? ఏమంటివి ? రాజకుటుంబమందు నీ కిప్పటికి విశ్వాసమేనా ? నేను రాజకుటుంబములోని వాఁడనుగాక పోవుటచేత నన్నుఁ జంపుటలో విశ్వాసహైన్యము లేదని సూచించుచుంటివా? బాలిశాధమా ! (నఱుకబోవును,)

చం__అబ్బాయీ! శాంతింపుము.

వసం__అయ్యా ! రక్షింపవలయును.

కో—మహారాజ్ఞీ! వసంతుఁడని పేరుపెట్టుకొనిన వాఁడెవఁడో వచ్చి నంతమాత్రముననే యధములైన సేవకులకు సహితము నా యందెంత గౌరవమున్నదో చూచితివా! నన్నువారు వధించుటకుఁ గూడ యత్నించుచున్నట్లు స్పష్టమైనదా? గౌరవహీనమై ప్రాణాపాయదశ నొందుచు, నేను నీయింట నింకెన్నాళ్లుండ వలయును? నీబాంధవము నాకక్కఱలేదు. నీరాజ్యము నాక క్కఱ లేదు. నాయిష్టానుసారముగ నేఁ బోయెదను.

(పోఁబోవును)

చం—నాయనా! కోపపడకుము. వసంతుఁ డను నామము ధరించి యే నిర్భాగ్యుఁడైన వచ్చినయెడల నింత మునుఁగు నని యెఱిగియుం డియే యట్టులానతిచ్చితిని. (అపవారించి) ఈసమయమున నీ వి ట్టు లాచరింపఁదగదు. యుద్ధానంతరము రాజ్యమా యల్లగిగ నున్నది. పై రాజ్యభారమా మీఁదఁ పడెను. రాజ్యాపేక్షచే దొంగలు ముచ్చులు వేషధారణ మొనర్చుకొని వచ్చుచున్నా రు. ముఖ్యుడైన సేనాధిపతియూ పరిభవింపఁబడి మరణయాత్రో న్ముఖుడై యున్నాఁడు. ఎదుటొమ్ముపై గుంపటివలె సార్వ భౌముఁడు మఃయసందర్భచర్య నంతయుఁ జూచి యున్నాడు. ఇట్టి యసాధ్యావసరమున బుద్ధిమంతుడవై ననీవేమి! అనాలోచన ముగ నీవ్రియత్న మేమి? తప్పు కాదా? నాయనా! ఏమియు మాటలాడకు.

వసం—(చంద్రికవద్దకువచ్చి) అమ్మా! నేను వసంతుఁడను. నీవు రాజ పత్ని వనుమాట యెంతయథార్థమో నేను నీసుతుఁడననుమాట యంతయథార్థము. అభిమానపుత్త్రుఁ డని, యౌరసుఁ డని, యధికారతారతమ్య మని, యన్యోన్యకలహారంభ మగునని, జన నాశన మగునని, ధనవ్యయ మగునని, రాజ్యమమితాందోళనా ధీన మగునని, మీరు గుజగుజలువోయి, డిల్లపడి యేమియుఁ దోఁచక నిలువుగుడ్లువెచుకొని, నాలుకలు గఱచుకొని, యింత యిబ్బందిపడనక్కఱలేదు. దానికొఱ కపేక్షించి వచ్చినవాఁడను

గాను. నిశ్చయముగ నీరాజ్యమును గోరి రాలేదు. ఆకోకిలా పాదములతోడు.

కో—(తనలో) హరిహరీ! ప్రాణనాథా! నీపాదములనే గతిగనమ్మియు న్న నన్నిట్టిమాట లాడదగునా?

చం—(తనలో) ఇంతసేపటినుండియుఁ గొంతదూరమున నుంటచే దీని మాట బాగుగ గుర్తింపలేకుంటిని. ఇప్పు డిది నాకతిసమీపస్థ యగుటచే దీనికంఠధ్వని బాగుగ నానవాలు పట్టుచున్నాను. నాభర్తకంఠరవముకూడ నిట్టిదే. ఏమియుభేదములేదు. కనులు మూసికొనిన నాతఁడే మాట లాడినట్లు నాకుఁ బొడకట్టుచు న్నది. (ప్రకాశముగ) అబ్బాయీ! కోకిల యని మీ రందఱిం తసేపటినుండియు సంభాషించుకొనఁగ నేను వినుచు నూరకుం టిని. ఇప్పు డిది కోకిలాపాదములతో డనినది. నాయనా! కోకిల యెవ్వతెయో నాకు స్పష్టముగఁ జెప్పుము.

వసం—అమ్మా! న న్నడుగుము! నేను జెప్పెదను. అతని కేమి తెలి యును?

కో—(తనలో) ఆత్మస్వరూపనిర్ణయ మసాధ్యము కాదా? (ప్రకాశము గ) కోకిలాస్వరూపాదులు నీకన్నులఁ గట్టినట్లుండ వేఱ వర్ణింప నేల? కాని, రాజ్య మక్కఱలేనివిరాగిశిఖామణివి కాంతారము లం దుండక కాంతలయంతఃపురములం దేల దూరితివి?

వసం—నాప్రాణనాయిక యగు కోకిలను బురముల వెదకితిని. వనముల వెదకితిని. ఎచ్చటను గానఁబడ దయ్యెను. ఇఁక నాకు వెదకు టకు దేహశక్తి లేదు. చేతిలో సాధనములు లేవు. నారాజ్య మును జేరి నే నుండినయెడల నాకుసేవకు లుండరా? ధనము కావలసినంత యుండదా? తత్సాహాయమునఁ బ్రపంచమంతయు నేనుగోకిలను గాలింపఁగల ననియును, దానిని చూచుభాగ్య మప్పటికైన నాకుఁ గలుగకపోయిన యెడల స్వదేశములోఁ దల్లిసన్నిధిని మరణము నొంది పితృపితామహాదు లేమట్టిలోఁ

గలిసిరో దానితో నేనుఁ గలియఁ దలఁచి యిక్కడకు వచ్చితిని. నాకు రాజ్య మక్కఱలేదు. ఐశ్వర్య మక్కఱలేదు. ప్రాపంచకవస్తు వేదైనను నాకుఁ గోకిలతరువాతిదే. హా! కోకిలా! కోకిలా!

కో—(తనలో) హృదయమా! అత్యానందమున నవశత నొందుచుంటివా?

చం—బుద్ధిమతీ! నీవు వసంతు నొకసారి చూచితి నని చెప్పితివి కాదా?

బు—ఔను.

చం—నీ వతని నానవాలు పట్టఁగలవా?

బు—ఏమో! చూచెదను. (వసంతుని సమీపించి) అమ్మో! ఇదే పొడుగు; లావు. అమ్మా! ఆఁడుదాని కంత యెత్తైన నుదురుండునా?

చం—ఫాలముమాట కేమి? ఆముక్కునకు నాముక్కున కేమైన భేదమున్నదా? చూడు! ఈవ్రేళ్లు ముంజేతు లచ్చముగఁ దండ్రివి సుమా! ఆహా! ఈ కర్ణములను జూడనే లేదు. ఇవి నాచెవులకుఁ బ్రతిబింబములుగ లేవా?

బు—సామ్య మున్నట్లే నాకుఁ దోఁచుచున్నది.

కో—తోఁచదా? ఇప్పు డందఱు పండితులే.

గీ॥ జాతకముఁ జూపి జాతక♦స్వామిలింగ
మెదనఁ గాలజ్ఞుఁ డిగిలించు ♦ నిద్ది స్త్రీద
గుటకు హేతువు లే వన్న ♦ గుటకఁ ద్రిప్పు
కే కరువుపెట్టు శ్లోకాల ♦ నెన్నొ యతఁడు.

(తనలో) వసంతా!

గీ॥ కల్ల తలకట్టు త్రాళ్ళు చె♦క్కిళ్ళ వ్రేలు,
దొంగ గుబ్బలపై నున్న ♦ కొంగు జార
సర్దుకొననైన లేవు; నీ♦చానతనము
కంటె నామగరూపె బిం♦కముగ నుండె.

(ప్రకాశముగ) అమ్మా! మీకందఱకు వెఱ్ఱితన మేల?

గీ॥ ఇతనిఁ బదియాఱువర్షము ♦ లతఁడు తనదు
బందిలో నుంచె; నతఁడె చె♦ప్పంగఁ దగు వ
సంతుఁ డితఁ డౌనొ కాఁడొ; యీ ♦ వంత యేల?
గొల్లఁ డెఱుఁగకయుండునే ♦ గొఱ్ఱెగుఱుతు?

చం—ఈవృద్ధరా జేమో తల వంచుకొని మాటలాడక యున్నాఁడు.

మో—(తనలో)

గీ॥ పంచపక్ష్యుపాసన గల్గు♦వానిఁ బోలె
కనుల నిట్టిట్టె చిట్టించు♦కొనుచు లోన
నేదొ గొణగుకొంచును వ్రేళ్లు ♦ లిటు గణించు
కొనుచు వెఱ్ఱిచూపున నవ్వు♦కొనుచు నుండె.

చం—అబ్బాయీ! ఈతని నేఁ బల్కరించిన బాగుగ నుండదు. నీ వడుగుము.

కో—నీవుపుత్రునిచేతనే యడిగింపుము.

చం—(వసంతునివంకఁ దిరిగి) నీవే యడుగుము.

వసం—"నేను నే నేనా?" యని నే నాతని నడిగిన నన్నుఁగూర్చి యాతఁ డే మనుకొనును. ఎవరికి సందేహ మైన వా రడుగవల యును గదా?

కో—నీయథార్థత్వమును స్థిరపఱచుకొని మాసందేహమును బోఁగొట్టు భారము నీమీఁదనే యున్న దని నీ వెఱుఁగవా?

వసం—సరే! అడిగెదను. అయ్యా! అయ్యా! పలుకఁ డేమి! అయ్యా! (బిగ్గఱగ నఱచును.)

రుద్రి—ఎవఁడవు నీవు?

వసం—నే నెవఁడనో తెలిసికొనఁగోరియే వీ రందఱు నన్ను ని న్నడుగు మనినారు.

రుద్రి—నిన్ను నీవే యెఱుఁగనపుడు నేను ని న్నెఱుఁగు టెట్లు?

వసం—నన్ను నే నెఱుఁగుదును. పీరు నన్ను నమ్మకున్నారు. మీరు నన్నెఱుఁగుదురు కావున, నమ్మకము గలుగఁజేయుటకుఁ గోరుచున్నాను.

రుద్రి—నేను నిన్నెఱుఁగుదునా? (దగ్గఱగఁ జూచును.)

వసం—ఎఱుఁగరా? నేను వసంతుఁడను గానా? మీ కారాగృహముసఁ జిరకాలము నివసింపలేదా?

రుద్రి—ఓరీ! ఓరీ! తస్కరుఁడా! అధముఁడా! చండాలుఁడా! నా కూఁతు రేదీ? నాయొక్క పుత్త్రిక యేదీ? (వసంతునిపైఁ బడి) నా కిప్పుడు దానిఁ గనఁబఱువుము. లేదేని నీగొంతుక నులిమెదను. జాగ్రత్త! మహాప్రభూ! తరువాతఁ దిరిగి కట్టవచ్చునుగాని, యరదండముల నొక్కసారి విప్పింపుఁడు. హా! కోకిలా! హా! కోకిలా! (ఏడ్చును.)

మో—మహారాజా! శాంతింపుఁడు. శాంతింపుఁడు.

(ఇద్దఱను వేఱుచేయును.)

రుద్రి—మహాప్రభూ! మహాప్రభూ! నేను వెనుకఁ జక్రవర్తిని. ఇప్పుడు పేరులేని యధముఁడను. నారాజ్యమును మీరు గ్రహించితి రను చింతచే నిట్లు మనవిచేసికొనుట లేదు. నాకు న్యాయమొసర్ప మీరు కర్తలు; సర్వాధికారులు. ఈదుర్మార్గుఁడు నాకోకిలను హరించినాఁడు. వానిని శిక్షించి నాకూఁతును నాకిప్పించి న్యాయము సేయవలయును. నేను మీకు సాష్టాంగపడుచున్నాను. హా! కోకిలా! హా! కోకిలా!

(ఏడ్చుచు సాష్టాంగపడును.)

కో—(ప్రకాశముగ) అయ్యో! లెండు. లెండు. (తనలో) హా! తండ్రీ నే నెంత ఘోరపాపము చేసితిని! నీవు నాకు నమస్కరింపఁగ నే నూరకుండవలసి వచ్చెనుగదా! 'హా! కోకిలా!' యని నీ వేడ్వఁగ నీతోపాటు నేను బిగ్గఱగ నేడ్చుటకు వీలులేక కన్నులలోఁ జేలలు గొటుకొంటిని. 'కోకిలా! కోకిలా!' యని నీ వాలా

పింపగఁ 'ఆఁ' యనుటకైన నోఁచుకొనలేక నోటనివ్వాలు వోసు కొంటిని (తిరిగి ప్రకాశముగ) అయ్యో! లెండు! లెండు! ఏమి లేవకున్నారు! అమ్మా! చూడు! చూడు!

చం—(చూచి) అయ్యో! మూర్ఛాగతుఁ డయ్యెను.

కో—తండ్రిప్రాణమున కాపదరాఁగఁ గొడుకు మగతనమే యాఁడుతన ముగఁ గరఁగిపోవలసియుండఁగా, నాఁడుపడుచు పైఁబై మగతన మెగిరిపోయి యాఁడుతనముగ మాఱు టాశ్చర్యమేమి? ఛీ! ఛీ! ఛీ! ఇఁక నా కీ యనవసరవేష మేల! తీసివైతును. (తీసి లోని స్త్రీవేషమున నిలిచి) హా! తండ్రీ! హా! తండ్రీ! (పెద్ద పెట్టున నేడ్చును.)

చం—(ఆశ్చర్యముతో) ఏమిది! ఏమిది! బుద్ధిమతీ! ఇది యేమి? జాలమా? స్వప్నమా? కనుకట్టా? హా! ఏమిది?

బు—ఇది యేమియుఁ గాదు. ఇదియే కోకిల యని స్పష్టమగుచున్నది.

చం—మా అబ్బాయి యేఁడీ?

మో—అబ్బాయియే అమ్మాయిగా మాఱినది. కాలమహిమము.

వసం—(తనలో) హా! హృదయమా! ఇప్పటికైన నాలుక కెడ మిచ్చె దవా? హా! కోకిలా!

గీ॥ ఎపుడుఁ గన్నులఁ బడుదువో, యెపుడు నిన్నుఁ
గాఁగిలింతునో? యని చిరకాల మేను
తహతహను బొందఁ బ్రారబ్ధతంత్రమునను
జేరవలసె ని న్నిట్టిదుస్స్థితిని నేను.

కో—తండ్రీ! ఇంకను లేవకుంటి వేమి? రాజ్యవిహీనుఁడవై యాశత్రు రాష్ట్రములో నురికంబముల ప్రదేశమున మరణశిక్షను బొంద నుద్యుక్తుఁడవై కఠినాత్మక యైన కూఁతుకొఱ కేడ్చి యేడ్చి మొఱఁడువాఱిపోతివా తండ్రీ! (ఏడ్చును.) నామూలమున నీ కెంత ప్రారబ్ధము తటస్థించెను! తండ్రీ! తండ్రీ! తండ్రీ! (ఏడ్చును.)

రుద్ర—(లేచి) నన్నుఁ దండ్రీ! యని పిలుచువా రెవ్వరు? కోకిలయే నా? ఏదీ! ఏదీ! (తడవుకొనును.)

కో—నాయనా! నే నిక్కడ నున్నాను. కన్నులు తెఱువుము.

రుద్ర—(తెఱచి) హా! నాతల్లి! నాతల్లి! (ఏడ్చును)

కో—నాయనా! లెమ్ము. (లేచును.)

రుద్ర—అమ్మా! నిశ్చయముగ నీవు నాకూఁతురైన కోకిలవేకద!

కో—ఔను నీకూఁతురైన గోకిలను నేనే. వసంతుని చెరవిడిపించి యత నితోఁ బారిపోయిన పాపాత్మురాలైన గోకిలను నేనే. మోహ నుని బాధఁ దప్పించుకొని పురుషవేషమున నీరాజ్యమును జేరి యీామెకు బుత్త్రుఁడనై రాజ్యము సేయుచు సిగ్గుమాలియున్న కోకిలను నేనే ని న్నురిదీయవలసిన దని యాజ్ఞ యిచ్చి యిచ్చ టి కరదండములతో ని న్నీడ్పించిన చండాలినియైన కోకిలను నేనే. నీవు నాకొఱ కేడ్చుచుండినను మూఁగనైయుండిన కోకి లను నేనే. ఏమి చేయఁగలను? రాజవిధి! అవిలంఘ్యమైన రాజ విధి న న్నట్లు చేయించెను. క్షమింపుము. (సాష్టాంగపడును.)

రుద్ర—తల్లీ! లెమ్ము నీవు విచారింపవలదు నేను నిన్నుఁ బురుషవేష మునఁ జూచినతోడనే నిన్నుఁ గొంత యానవాలు పట్టితిని గాని నావిద్యమానస్థితినిబట్టి వెల్లడించిన నేమి నేరమో యని భయపడి యూరకుండవలసి వచ్చెను. తరువాత నట్టి యాటె యేమో నాకు మతి చెదరుచున్న ట్లుండెను. దేహస్మృతి తప్పుచున్నట్లు కానఁబడెను. ఇప్పుడు నాకు శాంతచిత్తత కలిగినది. ఇఁక నిక్కడ నేమి చేయవలయును?

కో—కొంచెముపనిమాత్రమే యున్నది. ఈ సేనాధిపతి నురి దీయించ వలసి యున్నది.

వసం—కోకిలా! నావంకఁ జూడుము. ఆతనిని జంపుట కేమికాని, ముందు నన్ను బ్రిదికింపుము.

కో—నీవసంతత్వ మింకను స్థిరపడలేదు కదా!

వసం—అది నీవలననే స్థిరపడవలసినది కదా!

గీ॥ రమ్యమాధుర్యమృదుతమా ♦ రవము గల్గు
కోకిల వసంతునికి శోభఁ ♦ గూర్పవలయు;
రమ్యమాధుర్యమృదుత మా♦రవము గల్గు
కోకిల వసంతునికి శోభఁ ♦ గూర్పఁ గాదె?

కో—నీ కనుచిత మగునట్టియు, నేను జూడఁదగనట్టియు నీయాఁడు వేసమును దీసివై చినఁగాని నీవసంతతను నేను స్థిరపఱుపఁజాలను.

వసం—మహాప్రసాదము.

గీ॥ నినుఁ గనఁగ నతిరూపె సా♦ధనమయినది
యైన నినుఁ బొందుటకు దాని ♦ నటుల త్రోతు
జ్ఞానమే ముక్తిసాధన ♦ మైన దైన
దానిఁ ద్రోయవలయు ముక్తి♦దశనుగాదె?

(వసంతుఁడు నిష్క్రమించును.)

కో—(నవ్వుచు)

గీ॥ కొడుకఁగా నుండినపుడు నన్ ♦ బడిబడిగను
గరుణఁ జూచుచుఁ బల్క ద♦గ్గఱును వీవు
కోడల నయినవెంటనే ♦ కొఱకొ అంచుఁ
బలుకకుంటివి దూరాన ♦ నిలిచి యత్త!

చం—(నవ్వుచు) అప్పుడే కోడంట్రిక మారంభ మైన దని నంకోచించు చుంటివా? ఈ వింతమార్పు లన్నియు నామనసుఁ జెదఱఁజేసినవి. అమ్మా! నీకంటె నెవ్వరికి నెక్కువ తెలియదు. అది వసంతుఁ డేకద!

కో—ఏమియు సందేహింపఁ బనిలేదు. ఆతఁడు నీపుత్త్రుఁ డగు వసంతుఁడు.

చం—నాపుత్త్రుఁ డగు వసంతుఁ డైనయెడల నీభర్త యగు వసంతుఁడు మాత్రము కాకుండునా?

కో—పెద్ద లెట్లాచరించిన నదియే మాకు సమ్మతము. (అపవారించి) అయినను మాతండ్రిగారి యభిప్రాయ మెటు లుండునో?

చం——అన్నయ్యా! నీకూఁతును నాకొడుకునకుఁ జేసికొనవలయు నని యున్నది. నీ యంగీకృతికొఱకుఁ గోరుచుంటిని.

రుద్ర——(నవ్వుచు)

గీ॥ పెండ్లికొడుకు కూఁతుల నింట • బెట్టుకొంటి,
వహావా! కట్టివై చితివి వి•య్యంకు నిచట,
నన్ని సమకూడెఁగద! యీ ని•రర్థకంపు
ముసలిగంగిరెద్దుతలయూఁ•పు లివు డేల?

చం——(నవ్వుచు) అన్నయ్యా! ఇది నీవు చెప్పిననీతియేకద! నాపుత్త్రిని నీవు చిరకాలము గట్టివైచితివి! కాన నాకొడుకుతో వడ్డిగ నీ కూఁతును దీసికొంటిని. ఇఁక వెనుకటిమాటలతోఁ బ్రయోజనము లేదు. నీకూఁతును నాకొడుకున కీయవలయును.

రుద్ర——నీకొడుకునకు నాకూఁతును జేసికొమ్మని నే నిన్నుఁ బ్రార్థింప వలసియుండ నీ పటు లందు వేల?

చం——అట్లు నీ వనుకొనఁ బనిలేదు. మే మందఱము నీ కెప్పుడు విధేయులము కామా? ఈ రాజ్యములు రెండును నీవే కావా? మాకు నీకంటెఁ బెద్ద దిక్కెవ్వ రున్నారు?

విజ——నాచావుమాట ముందుగఁ జూడక మీపెండ్లిమాట లాడుకొను చున్నారా?

కో——ఇఁకఁ జూచునది యేమి? ఓరీ! సేవకా! ఆతనిమెడ కాతాడ్రుఁ గట్టుము. ఛీ! అటు కాదు. ముందు చేతులు వెనుకకు విఱిచి కట్టవలెను. పాదములు రెండుబొట్టనవ్రేళ్ళను గలిపి కట్టుము. మెడను దా్రడుచ్చువలె వేసి మొగము గానఁబడకుండ నొక టోపిఁ దగుల్చుము.

చం——మన మందఱ మింత యానందముగ నుండ నీసమయమున నాతని మాత్ర మేల చంపవలయును?

కో——ఏదోషమునైన సహింపవచ్చుఁ గాని రాజద్రోహమును సహింపఁ గూడదు. జనులక్షేమము రాజక్షేమమున నిమిడి యుండును.

అట్టిరాజున కపకారముచేయువాఁడు లోకాపకారి. కావున నట్టి వానిని క్షమియింపఁ దగదు !

విజ—మోహమునకుఁ గుఱాయి నిండఁ దగుల్పవలదు. అయ్యా! నాభార్య చిరకాలముక్రిందటనే కాలముచేసినది. ఇంతకాలమునుండి విధురస్థితి నుండియు నీనడుమనే యొకదానిని దెచ్చుకొంటిని. దానిని గారణాంతరమునఁ బరిణయము కాలేదు. దానిఁ జూడవలయు నను కోర్కె నా కున్నది.

కో—దాని నిచ్చటి కెవ్వరు తీసికొనివత్తురు?

విజ—అచ్చట నున్న జగన్నాథుఁడు.

కో—కానీ.

జగ—(పరుగెత్తి భ్రమరికతో వచ్చును.)

భ్ర—హా! ప్రాణనాథా! ఆకస్మికముగ నీ కెట్టియాపద తటస్థించెను.

విజ—నీవు నాయాపదకొఱకు విచారింప వలదు. ఏతత్క్షణమువఱకుఁ "కోకిలయో, కోకిలయో" యని యేడ్చు నీకుఁ గోకిలాదర్శనము కానున్నది. అటు చూడుము!

భ్ర—అమ్మా! అమ్మా! (దరికిఁ బోయి కౌఁగిలించుకొని) అమ్మా! అమ్మా! ఎక్కడనుండి? ఎప్పుడు? ఏలాగు? అరుగో! అరుగో! నీ తండ్రిగారు! అమ్మా! వసంతుఁ డేఁడీ?

కో—నీవు రాలే దని నిశ్చయపఱచుకొనియే ని న్నింతవఱకు స్మరింపనైన లేదు.

భ్ర—అమ్మా! రాఁకపోవుట కూడనా?

కో—సరే. నీవు పోయి నీపెనిమిటి నోదార్చుము. అతఁ డింకఁ జావనైయున్నాఁడు.

భ్ర—అమ్మా! రక్షింపుము. (కాళ్ళపైఁ బడును.)

కో—అతఁడు చేసినద్రోహ మేదియో నీ వెఱుఁగవుకాన నీ వట్లనుచున్నావు.

భ్రి—అది యేమి?

కో—ఆతఁడు నన్నుఁ జంపుట కొకనికిఁ బ్రోత్సాహ మొసర్చినాఁడు.

భ్రి—హరిహరీ! గొప్ప నేరమే చేసినాఁడు. అటులైనఁ జావవలసినదేనా?

కో—ఆఁ!

భ్రి—ఆతని రక్షించుకొన నుపాయాంతర మేదైన నున్నదా?

కో—ఈజను లాతని క్షమింపు మని ప్రార్థించిన క్షమింతును.

భ్రి—ఓమహాజనులారా! నాపతిని రక్షింపరా? ఈతఁ డడవిలో నన్ను రక్షించెను. నేను దాసిని, స్వైరిణిని. అయినను గులాంగననై యీతని వివాహముఁ జేసికొన నిశ్చయించితిని. నారాణి యగు కోకిలాదేవి నాకుఁ గానఁబడిన తరువాత నిన్ను వివాహము చేసికొందు నని నే నాతనికి వాగ్దానము చేసితిని. స్వామికటాక్షమున నా కామె దర్శనలాభము గలిగెను. మీ మహోదారతచే నాకుఁ బతిలాభము కలుగవలయును. రక్షింపుఁడు.

(నేపథ్యమున) ఆతఁడు శిక్షాపాత్రుఁ డయ్యెను నేరముచేసిన వారిని గొందఱను మహానందావసరమున క్షమించి వదలివేయు పూర్వాచారము ననుసరించి యీతని క్షమింపఁదగును.

కో—జనవాక్య మంగీకరింపఁబడినది. సేవకా! విజయసారథిని దింపుము.

(అట్లుచేయును.)

విజ—(అపవారించి) నే నిదివఱ కొకని జంపుటయే యాచారముగాఁ గలవాఁడను గాని, చంపఁబడు నాచార మున్నవాఁడను గాను. నే నొకరిని రక్షించుహాడుక కలవాఁడనే కాని యొకరిచే రక్షింపఁబడువాడుక గలవాఁడను గాను. అట్టి నా కిట్టిగతి కలిగెను.

భ్రి—ఏమియు విచారింపకుము.

విజ—నాకు భయవిచారము లెన్నఁడును లేవు.

భ్రి—అమ్మా! వసంతుఁ డేఁడీ?

కో—అదుగో! (వసంతుఁడు ప్రవేశించును.)

చం—(కౌఁగిలించుకొని) నాయనా! నాయనా! ఎంతకాలమునకు నా కనులఁ బడితివి! ఇంతవాఁడవై యుండ వెడలి, యింతవాఁడవై రాఁగ నిన్ను నేను గుర్తింపలేకపోయినను నిన్నుఁ జూచిన తోడనే నామనసులో నేదియో యనిర్వచనీయమైన యాందోళనము గలిగినది నాయనా! నీమామగారికి నమస్కరింపుము.

వసం—ముందు నీకు నమస్కరించి—(నమస్కరించును.)

చం—శీఘ్రముగ వివాహ మగుఁగాక!

వసం—మామగారూ! నమస్కరించుచున్నాను.

రుద్ర—చెల్లెలా! వివాహాశీర్వచనము నీవు చేసితివికాన శీఘ్రముగ సంతానవంతుఁడవు కమ్మని నే నాశీర్వదింతును.

చం—నాయనా! అదిగో! చిరవిశ్లేషపరితప్త యగు కోకిల నాశ్వాసింపుము.

వసం—ప్రాణప్రియా! దైవకటాక్షమున నిచ్చట నందఱము చేరితిమి. నేను బుద్ధిలేనివాఁడనై నీ యెడ నాచరించిన దోషమును నీవు దయతో మన్నింతువుగాక! (నమస్కరించును.)

కో—లెమ్ము. ప్రమాదమున కింత ప్రార్థన మేల?

వసం—అనుగ్రహింపఁబడితిని. ఆహా! ఎన్నెన్ని చిత్రములు జరిగినవి?

ఆ॥ వె॥ కొడుకు కోడలయ్యెఁ; గోడు కయ్యె బానిస;
అమ్మ యత్తయయ్యె; నత్త యమ్మ
యయ్యె; వైరి వియ్య మయ్యెఁ; గోడలు కూఁతు
రయ్యె[illegible] బుద్ధఁ డల్లుఁ డయ్యె నహహ!

విజ—హాహాహా! దాసి సంసారిణి యయ్యెను. సేనాధిపతి దాసిమగఁడయ్యెను. ఈ రెండుమాటలును జెప్ప మఱచినారు.

చం—మీరు మూఁడుజోళ్ళుగ వేఱువేఱుగ నిలువఁబడుఁడు.

(అట్లు చేయుదురు.)

చం——మోహనా! ఇది పెంకి దయ్యమను మిక్కిలి బుద్ధిమంతురాలు. ఇట్టిదానికి నీవంటిబుద్ధిహీనుఁడు పతిగ నుండుట తగదు. మీ దాంపత్యము లోకవిరుద్ధముగ నున్నది.

మో——ఎంతమాత్రమును లోకవిరుద్ధత లేదు. ఆలాగున నీలాగునఁ గూడ నున్నది.

చం——ఆలా గీలాగున నేమి?

మో——గీ॥ ఛాందసాచారపుణ్యనిష్ఠాభరున కొ
కింత పిత్తశరీర యా • నింతి గలుగుఁ,
దఱుచు గుడిసెవేట్రులకాళ్ళ • కెఱగు తులువ
కిలమహాపతివ్రత సంభ • వించు నతిగ.

చం——(తనలో) అంతమట్టుతోఁ జాలించుము. (ప్రకాశముగ) అన్నయ్యా! వీరి వివాహములు వెంటనే చేయవలయును. ఎవరిది ముం, దెవ రిది వెనుకఁ జేయవలయునో యానతిచ్చెదరుగాక!

రుద్ర——మహారాజ వివాహమునకుఁ బూర్వమున సర్వమంగళయుక్తముగ సాలంకారముగఁ గొన్నికన్యాప్రదానములు జరిగించవలయును. కనుక వీరిద్దఱవివాహములును వెంటనే చేయవలయును. తరువాత——మనము వియ్యమొందవలయును.

చం——అన్నయ్యా! సంతోషమే. వివాహము లిప్పుడే కావలయును. అందఱమును లోనికిఁ బోవుదము.

(అందఱును నిష్క్రమింతురు.)

ఇది చతుర్థాంకము.



శ్రీ

# కోకిల.

## పంచమాంకము



ప్రదేశము — శ్రీపురములోని వీధి.

(ప్రవేశము — కృష్ణశంకరులు)

కృ—ఏమండి! చిరకాలమునుండి వివాహదక్షిణకై కనిపెట్టియున్న మీకు నేను బాగుగ లభింపఁ జేసితినా?

శం—అయ్యా! సంతోషించితిని. వివాహము బహుశోభావంతముగ జరిగినది.

కృ—పెండ్లికొమరుని జూచితిరా?

శం—లేదు. నాయనా! కాని, మిక్కిలి బుద్ధిమంతుఁ డని తెలిసినది. సంతోషించితిని.

కృ—మా మహాదృష్టమున మా కట్టి ప్రభుఁడు లభించెను.

సీ॥ ఫాలభాగంబు వి♦శాల మాటను గొంత
కోలవా టగుమోము ♦ గ్రాలువాఁడు
నొకసారి కని పల్క ♦ నొరుస్వరూపస్వభా
వము లిట్టె కనిపెట్టు ♦ ప్రతిభవాఁడు
నిదిగో! యనుచు నర్థి ♦ కిచ్చెదు పర్యంత
మును నిచ్చెద నటంచు ♦ ననని వాఁడు
నెటు పోయి యెటు వచ్చి ♦ యేమైన సరె కాని
యనృతంబు వచియింప ♦ నట్టివాఁడు
చెదరు లేనివాఁడు ♦ స్మితభాషి మితభాషి
కవితయన్నఁ బ్రీతి♦గలుగువాఁడు
బహుకలాన్వితుండు ♦ పరమగంభీరుండు
మాతృభక్తియుతుఁడు ♦ మాప్రభుండు.

శం—మహారాజబాలకగుణాకర్ణనమునఁ గర్ణములు మిగులఁ బవిత్రము లైనవి.

కృ—కథనమున నాజింహ్వాకంటెనా? అదిగో! అటు చూడు. మననేత్రములు కూడ సాఫల్య మొందవలసియున్నది. ఊరేగి వధూవరు లిప్పుడే సర్వమంగళోత్సవపరంపరలతోఁ గోటలోఁ బ్రవేశించుచున్నారు. బురుజునొద్ద నిలిచి చూతము రమ్మ.

(నిష్క్రమింతురు.)

ఇ ది వి ష్కం భ ము.

---

[ప్రదేశము—శ్రీపురమున సభాశాల.]

(ప్రవేశము—విజయసారథి, జగన్నాథుఁడు, చంద్రిక, కోకిల, వసంతుఁడు, రుద్రదేవవర్మ)

చం—ఆహా! ఇప్పటికిఁ గృతార్థుల మైతిమి. సమస్తవైభవోపేతముగఁ గల్యాణ మైనది. ఇఁక నేమియుఁ జింతలేదు. కాని, నాయనా! (వసంతుని కౌఁగిలించుకొని) నీవు నాపుత్త్రుఁడ వని తెలియక నీ యెడల నే నెంత తొందరపడితినిరా! తండ్రీ! నీమనసెంత నొవ్వఁ జేసితినో?

వసం—అమ్మా! అటు లనెద వేల? నాప్రాణప్రియ యైనకోకిల నాకుఁ బరమశత్రు వని భ్రమసి నేను దానిని బాకునఁ బొడువలేదా? భ్రమము వలనఁ గలిగినయజ్ఞతయే యింతకు హేతువు. విచారింపవలసినది లేశమును లేదు.

రుద్ర—ఇప్పుడు వెనుకటిమాటలతోఁ బని లేదు. అయినను బ్రస్తావన వచ్చినది కావునఁ జెప్పెదను. తల్లికొడుకులకుఁ గలిగిన వెనుకటి మనఃకాలుష్యమునకును, భార్యాభర్తలలోని యీ విపరీత కార్యమునకును మూలకారణ మీవిజయసారథి.

విజ—ఈదెబ్బ నాపై గురిపెట్టితి రేమీ? నే నేమి చేసితిని?

రుద్ర—నీవు యుద్ధమునుండి ఇటకు వచ్చినవెంటనే స్త్రీరూపమున నున్న వసంతుఁడు నీతో మాటలాడి నీయొద్ద తనగుట్టును వెల్లడించు కొనినాఁడుగదా?

విజ—ఆఁ!

రుద్ర—ఈరాజ్యమున నున్న యుద్యోగులలో నీవు పెద్దవాఁడ వనియు, వయసుమీఱినవాఁడవనియుఁ దలయాడించుకొని తిరుగుచుంటివి కదా! కోకిలను జంపు మని నీవు చెప్పినయాలోచనము నీతి బాహ్యముగ నున్నది కాదా? "అమ్మా! ఇదుగో! వసంతుఁడ ననుచు నీతఁడువచ్చినాఁడు. అయి యుండును. అయినఁ దొందర పడవలదు. నిదానముగ నాలోచింతము" అని సుగుణరాశియైన యీమహారాజ్ఞిగారితోఁ జెప్పి మాతాపుత్త్రులను నీవు గలిపిన యెడల నింతక్షోభము రాకయుండునుగదా!

విజ—ఆఁ! ఆఁ! వసంతుఁ డని వచ్చినవానిని, వసంతుఁ డని చెప్పిన వానిని దెగనఱకు మని దేవిగారియాజ్ఞ యైయుండగ—

రుద్ర—అదేమి మాట? అది యొకవంక యని నే నెఱుఁగనా? యథా ర్థగ్రహణపర్యంత మట్టియాజ్ఞ నుపసంహరింపు మని నీ వీరాణి గారితోఁ జెప్పిన రాజ్యకార్యనైపుణ్యధురంధరయు బుత్త్రాభి మానవిశేషయు నైన యీయామె యంగీకరింపకపోవునా? నీస్వభా వము మంచిది కాదు.

గీ॥ అమితధారాళముగఁ బైకి • నగపడుచును
లోనఁబరమకుత్సితుఁడైన • వానిపెట్టి
పలుకు లాడుచుఁ బైకి లోఁ • బరమకఠిన
వృత్తిగలవాని నిన్నె వీ • క్షించినాఁడ.

విజ—(అపవారించి) జగన్నాథా! వింటివా? సేనాధిపతి కట్టిస్వభావమే శ్రేష్ఠమనుమా! పొగగారకాయవలె మీఁదఁ బడువఱకుఁ గనఁ బడకుండుటయే పౌరుషలక్షణము.

రుద్రి—వసంతా! నీ వజ్ఞబాలుడవై మీతల్లియొడిలోఁ బాలు ద్రావు చుండ నిన్ను నేఁ దీసికొని వెళ్ళితిని. దైవకృపచే నాకూఁతుతో నిన్ను మీయమ్మ కప్పఁజెప్పుట తటస్థపడినది. ఈమెను నీ వెఱిఁగి యుండవు. కాని, కర్ణములు పావనము లగున ట్లీమెగుణములు చిరకాలమునుండి వినుచున్నాను.

సీ॥ శ్రీరామచంద్ర పా◆దారవిందాశ్రాంత
చింతనాసంస క్త◆చి త్త యీమె
బహుదీనజనసంఘ◆పరిపాలనాలోల
మృదుదయాపరిపక్వ◆హృదయ యీమె
వివిధదేశాసీత◆విద్వత్కవీశ్వర
సంఘాతశోభితా◆స్థాన యీమె
దేవగోబ్రాహ్మణా◆దిస్తుత్యసంభార
పాళీవినిక్షి ప్త◆భ క్తి యీమె
పరమసాధ్వి యీమె ◆ బహుకీ ర్తిభర యీమె
తల్లి యీమె నీకుఁ ◆ దండ్రి యీమె
దైవ మీమె గాఁగఁ ◆ దలఁచి తత్సేవచే
నధికకీ ర్తి నొందు◆మయ్య! వత్స!

వసం—ఎఱిఁగియుండి యనుష్ఠింపఁదలఁచిన యంశమున కుపదేశ మనావశ్యక మయ్యును మామగారి యుపదేశ మగుటచే గ్రహించి శిరసా వహించితిని.

చం—అన్నయ్యా! ఎందుల కిప్పు డీ మాటలు?

విజ—(అప) జగన్నాథా! చూచితివా, రాజ్ఞిగారిప్రకృతి? స్వస్తోత్ర కథనమును సహింపలేదు సుమా!

జగ—(అప) ఆ శ క్తియందు మీయంతవాఁడు లేఁడు.

రుద్రి—చెల్లెలా! ఎందుల కిప్పు డీమాట లనుచున్నా వేమి? దైవాను గ్రహమునఁ గల్యాణోత్సవ మత్యనుకూలముగ జరిగినది. సర్వ మనోరథములు ఫలించినవి. ముసలుల మైన మన కింక యుబును పోకమాటలతోడనే కదా కాలక్షేపము?

చం.—(నవ్వుచు) మనమాటల కేమి? భార్యాభర్తల నిద్దఱను—అదిగో! వీరిశయనగృహము. దివ్యముగ సింగారింపఁబడి యున్నది. చూడుఁడు!

సుదర్శ—ఓహో! ఇఁకఁ బవిత్రు లగు సువాసినుల మంగళగానాది కృత్యములు జరుగనై యున్నవి కాఁబోలు! నేను బోయెదను.

విజ—జగ—మేముగూడఁ బోయెదము. (నిష్క్రమింతురు.)

చం.—నాయనా! నేను బోయి కప్పురపుటారతి నొక్కసువాసినిచే నిటకుఁ బంపెదను. అప్పుడు నీవు భార్యాసహితుఁడవై లోనికి రమ్ము. (పోవును.)

వసం.—(కోకిలను గౌఁగిలించుకొని)

గీ॥ తలఁచి తలఁచి పందొమ్మిదేఁ•డులకు నొక్క
మాఱు నిన్ను ముద్దుఁ గొనఁగఁ•గోరి, మూతి
నిట్టి పొడుగుసేయఁ గటకట • యినుపకణిక
లడ్డుపడె నిప్పు డడ్డేది • యగునొ చూతు.

ప్రాణప్రియా! మనవివాహముతో సమస్తమనోరథములుఫలించినవి. ఇఁకఁ గోరఁదగినదియే లేదు. ఐన నిట్లు కోరెదను.

గీ॥ ధరణి యీతిబాధలు లేక • తనరుఁగాక
ప్రజలయన్యోన్యవైరముల్ • పాయుఁగాక
కవిత రాజపోషణమునఁ • గ్రాలుఁగాక
నీతిపాలనమున రాజు • నెగడుఁగాక!

(సువాసిని యొకతె కప్పురపుటారతితోఁ బ్రవేశించి)

సువా—తథాస్తు! తథాస్తు!!

(అందరు నిష్క్రమింతురు.)

పంచమాంకముతో సర్వమును

సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ



